

రు. 1'25

# దక్షిణ భారత కథాగుచ్ఛము

తెలుగు, తమిళ, మళయాళ, కన్నడ భాషలనుండి ఎంచి, ఏర్చిన మనోరంజకమగు కథా సముదాయము.



# దక్షిణ భారత కథాగుచ్ఛము

తెలుగు, తమిళ, మళయాళ, కన్నడ
భాషలనుండి ఏరి ఎంచి, పర్చిన మనో
రంజకమగు కథా సముదాయము.

సిటిజన్ ప్రెస్,
పార్కులేన్, సికింద్రాబాద్.

# SELECTED SHORT-STORIES
*From The Southern Languages*

TELUGU :

**Venkanna** by K. Ananda (Karunakumar).

**Pogadanda** by C. Padmavathi Devi.

TAMIL :

(Translator : Y. Satyanarayana)

**Amma Chupina Velugu** by M. P. Periaswami Thooran.

**Kalapasam** by M. K. Somasundaram.

**Pulakankuram** by T. Janakiraman.

KANNADA :

(Translator : Thirumalai Ramachandran).

**Nenu Champina Yuvathi** by A. Seetharaman (Ananda).

**Sakuntala Punaragamanamu** by Masti Venkatesa Iyengar (Srinivasa)

MALAYALAM :

**Jeevitha Chakram** by P. Kesava Dev.

**Military Vadu** by Thakazhi Sivasankaran Pillai.

——x:x:x——

The above stories have been included by the kind permission of the Copyright holders.

First Edition : May, 1959 : 5,000 copies

**Price : Rs. 1.25.**

Published under the auspices of the Southern Languages Book Trust, Madras.

by

CITIZEN PRESS,
Park Lane, Secunderabad.

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణను ప్రోత్సాహం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణభారత పుస్తక సంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింప చేసింది. ఆ ప్రచురణల వలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడ భాషలలోకి అనువాదం చేయించి ప్రచురింప జేస్తూంది. పాఠకులలో భిన్నభిన్న అభిరుచులకు తగినట్లు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నికచేశారు. అందువల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయంకోసం ఆ మహా పురుషులు ఏమి చేసినది, వారికి తామెంత ఋణపడి ఉన్నది. ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించడానికి వారెన్నెన్ని పాట్లు పడినది. ముందు తరాలవారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం- ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు, కథానికలు, ప్రాచీన కళాసంపదలను అభివర్ణించే గ్రంథాలుకూడా ఇందులో ఉండటం ముదావహం. నాటక కళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నేత్రాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాస దాయకములైన భిన్నభిన్న విషయాలను

గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందుముందు విస్తార ప్రచారం కలుగ గలదని నా విశ్వాసం.

దక్షిణభారత భాషలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలోకి అనువదింప చేయటం ఈ ద్వితీయ గ్రంథ పరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడి నప్పుడు విద్యావంతులలో ఎక్కువ మందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాశక్తి గల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞాన పిపాసను తృప్తిపరచడానికి యోగ్యమైన గ్రంథాలను కూడా వారికి అందజేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణభాషా పుస్తక సంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

ఇట్లు
ఎ. లక్ష్మణస్వామి ముదలియార్,
వైస్ ఛాన్సెలర్,
మద్రాసు విశ్వవిద్యాలయం.

మద్రాసు,
7-10-1958.

# తొలిపలుకు

---

విదేశ విద్య వలన మన దేశ భాషలకు నూతన వికాసము కలిగినది. మన భాష లలో క్రొత్త క్రొత్త రీతులలో రచనలు సాగుచున్నవి. అట్టి రచనలలో కథానిక (లేక చిన్న కథ) ఒకటి. ఇట్లనుట వలన మన దేశ భాషలలో పూర్వము కథలు లేవని కాదు. నిజమునకు కథలు లేని భాష ఉండదు. మన దేశ భాషలన్నింటిలో ఆది కాలమునుండి ముచ్చట గొల్పు కథలెన్నియో గలవు. సంస్కృతములోని భారతము, భాగవతము, రామాయణము, కథాసరిత్సాగరము, పంచ తంత్రము వంటి గ్రంథములలో వినోదము విజ్ఞానముకూడ కలిగించు వేనకు వేల కథలున్నవి. ఈ కథలన్నిటిని పూర్వులు దేశ భాషలలో కూడ వ్రాసిరి. ఇవి గాక, ఆయా ప్రాంతములకు సంబంధించిన కథల, ఆయా భాషలలో పుట్టి పెరిగి మన సాహిత్యమునకు మరింత పుష్టి కలిగించినవి. కాని ఈ కథలకు నేటి కథానికకు చాల భేదమున్నది. వాస్తవికత,—అనగా జీవితము నందలి సంఘటనలను ఉన్నవి ఉన్నట్లుగ చిత్రించుట—నేటి కథానికకు ముఖ్య లక్షణము.

విదేశ కథల పరిచయము వలనను, రేడియో కేంద్రములు , వార మాస పత్రికలు ఇచ్చుచున్న ప్రోత్సాహము వలనను మనదేశ భాషలన్నింటిలో కథానికా రచన నేడు విస్తారముగ సాగుచున్నది. మన భాషలోని ఉత్తమ కథానికలు కొన్నింటిని ఏర్చి కూర్చి దక్షిణ భాషా పుస్తక సంస్థవారు లోగడ ఒక సంపుటమును ప్రచురింప జేసిరి. దాని వలన మన భాషలోని ఉత్తమ కథానికలను మాత్రమే మనము చదివి ఆనందింపగలిగితిమి. ఈ పుస్తకములో ఇతర దక్షిణ భారత భాషలలోని సుప్రసిద్ధ కథల అనువాదములను గూడ జేర్చిరి. పాశ్చాత్య దేశములలో ఒక భాషలోని ఉత్తమ రచనలన్నింటిని మిగిలిన భాషలలోనికి అనువదించుకొందురు. ఆ విధముగా ఒక భాషవారి జీవన విధానములు, ఆశయములు, ప్రజ్ఞావిశేషములు ఇతర భాషలవారుకూడ తెలిసికొని ఆనందింపగలరు. మన దేశ భాషలలో ఇట్టి అవకాశములు ఇంకను లేవు. ఇందువలన మనకు విదేశ రచయితలను గురించియు, రచనలను గురించియు తెలిసినంతగా మనకు మిక్కిలి సన్నిహితు

లైన ఇరుగు పొరుగు భాషలలోని రచయితలను గురించిగాని, వారి రచనలను గురించిగాని తెలియదు. ఈ పుస్తకము వంటి ప్రచురణలు ఈ లోపమును తీర్పగలవు. ఇట్టి అనువాదముల వలన దక్షిణ భారతమున ఒక భాషవారు ఇతర భాషలలోని రచనల అంద చందములను కూడ గ్రహింప గలుగుదురు. అంతేకాదు. భాషలు వేరైనను, తమ మధ్య పోలికలు ఎంత ఎక్కువగ నున్నది, తమలో ఎంత గాఢముగు సామరస్యము నిగూఢముగా నున్నది వారందరు చక్కగ గ్రహింప గలరు. ఇట్లు గుర్తించుట వలన వారిలో ఐకమత్యము, సోదర భావము పెంపొందును. వేరు వేరు భాషల వారి నడుమ విభేదములు, విద్వేషములు పెచ్చు పెరిగిన ఈ దినములలో ఇది అత్యంత వాంఛ నీయముగద !

ఎస్. గోవింద రాజులు,
అధ్యక్షుడు,
దక్షిణ భాషా పుస్తక సంస్థ.
వైస్ ఛాన్సెలర్,
శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయము.

మదరాసు,
19—2—1959

# విషయ సూచిక

# అనువాదకులు

---

*కన్నడ కథలు :—*

| | |
|---|---|
| శకుంతల పునరాగమనం<br>నేను చంపిన యువతి | తిరుమల రామచంద్ర |

*తమిళ కథలు :—*

| | |
|---|---|
| కాలపాశం<br>పులకాంకురం<br>అమ్మచూపిన వెలుగు | యండమూరి సత్యనారాయణ |

*మళయాళ కథలు :—*

| | |
|---|---|
| మిలటరీ వాడు<br>జీవిత చక్రం | పుట్టపర్తి నారాయణాచార్య |

# 1. వెంకన్న

—కరుణ కుమార్

"అయ్యా! రాగయ్యా! శిస్తు పైకం యిప్పించుకొని రమ్మన్నాడయ్యా, రెడ్డి," అని అంటూ తెల్లవారేసరకు యమకింకరుల్లాగ ఇద్దరు వెట్టివాండ్లు వచ్చి వాకిట నిలబడ్డారు.

రాగయ్య దెబ్బదేండ్ల తొక్కు. ఇంకా నిద్ర మంచం మీదనుంచి లేవనేలేదు.

"ఈ రెండు రోజులు నిదానించండ్రా. పిల్లవాడు ఊరినుంచి వచ్చి, కరణంకాడ లెక్క చూచుకొని పైకం కట్టేస్తాడు" అని మంచం మీద కూచునే, వణికే కంఠంతో సమాధానం చెప్పాడు రాగయ్య.

"రెడ్డి ఒప్పుకోవడం లేదయ్యా, ఇయ్యాల ముడుపు ఇరసాలు అయితీరాలే, ఇంక నిలపడానికి లేమంటున్నారు మునసబు, కరణమూను. పైకం యివ్వకుంటే ఎద్దుని పట్టుకొని రమ్మన్నాడు రెడ్డి" అని వెట్టివాళ్ళు ఇద్దరూ చెరొక కర్ర చేత పట్టుకొని, వాకిట్లో నిలబడ్డారు.

'ఎద్దుని జప్తీచేసి తీసుకొని రమ్మన్నాడు రెడ్డి, అనే మాటలు రాగయ్య చెవిలో పడే వరకు అతని మనస్సు కలుక్కుమన్నది. అతనికి డెబ్బై యేళ్లు వచ్చినవి. ఇంతవరకెన్నడూ అటువంటి చిన్నతనం మాట అతడనిపించుకొని ఉండలేదు. సర్కారుకు వెయ్యా, పదిహేను వందలా శిస్తు కట్టే మహా మహా పెద్ద పెద్ద రెడ్లందరివంటేకూడా, చిన్న కాపు అయినా తాను ఒకరి చేత అడిగించుకోవలసిన అవసరం లేకుండా, ఏ వాయిదా శిస్తు ఆ వాయిదాలో ముందుగానే మునసబుకు చెల్లించి రసీదు తెచ్చుకొనే బాధ్యత తెలిసిన కాపు అతడు. తన హయాంలో తాను ఒకరికి చెప్పినవాడే కాని ఒకరి చేత చెప్పించుకొన్నవాడు కాడు. కాని ఈ నాటికి చిక్కు పడవలసి వచ్చింది. మునసబు పంపిన ఒక వెట్టివాడిచేత ఈ కాలానికి ఈవావిధంగా అడిగించుకోవలసివచ్చింది. ఎద్దును పట్టుకొని రమ్మన్నాడు, రెడ్డి! పోగా మిగిలిన ఐశ్వర్యంలో తనవద్ద ఉన్నది, ఇంట బుట్టి పెరిగిన ఆ ఎద్దు ఒక్కటే! ఆ ఎద్దు కొక దున్నపోతు నాధారం చేసుకొని, ఆ నాలు గెకరాలకయ్యా ఎట్లాగో సాగు చేసుకొంటున్నాడు రాగయ్య. తన ఏకైక పుత్రుడు రమణయ్యతో సమానంగా పెంచుకొన్న ఎద్దు అది, దాన్నే జప్తీ చేయాలని తలపెట్టాడు రెడ్డి! ఔరా దుర్దినం! అను కొన్నాడు రాగయ్య.

అతని కళ్ల వెంబడి గిర్రున తిరిగినవి నీళ్లు. దొడ్లో గాట కట్టివేసిన ఎద్దు కళ్లల్లో మెదిలింది. ఇంత బ్రతుకు బ్రతికి, బంగారం వంటి ఎద్దును పదిమందిలోను

జప్తి చేయించుకొంటాడా తాను ? అంతకంటే తనశిరస్సు నేలబడిపోవడం మేలు కదూ ! అంతకంటే ఆ ఎద్దును ఏ కసాయివాడికైనా అయినకాడికి తెగనమ్మి సర్కారు శిస్తు కట్టివేయడం మేలుకదూ !

రోషం పుట్టేవరకు రాగయ్య కళ్లెర్రనైనవి. కను రెప్పల మీద జారిపడ్డ తెల్లని కనుబొమ్మలు పైకెత్తేడు, ముడతలు పడ్డ ముఖంలో ప్రజ్వలించే ఆ రెండు నేత్రాల్లోనూ మిగిలి ఉన్న రెండు చుక్కలు కింద రాలిన్నై. కనుబొమ్మలెత్తేవరకు నుదుటిమీద తాచుపాము పిల్లల్లాగా మూడు ముడతలు పైకి ఉబికిన్నై.

"ఒరే! పదిగంటలకు పైకం పంపుతానని రెడ్డితో చెప్పండి. అప్పటికి పైకం చేరకుంటే—అట్లనే మీ ఇష్టప్రకారం ఎద్దుని తీసుకొని పోవచ్చును. నేను చెప్పానని రెడ్డితో చెప్పం" డన్నాడు రాగయ్య.

వెట్టివాళ్లు వెళ్లిపోయారు.

"ఏందయ్యా! ఎద్దుని తీసుకొని పొమ్మంటున్నావు" అని లోపల కుండలు కడిగే భార్య లక్ష్మమ్మ ఈ మాటలు విని, బయటికి వచ్చి భర్తనడిగింది.

"సర్కారుకు చెల్లించవలసిన శిస్తు చెల్లించక పోతే అధికార్లు ఊరుకుంటారా? శిస్తు కట్తావా, ఎద్దుని జప్తి చేయమంటావా అని మునసబు కబురు చేశాడు" అని చెప్పాడు రాగయ్య.

"అయ్యో ! ఇదేం పోయేకాలమయ్యా ! సర్కారు శిస్తు కట్టకుండా ఎగవేస్తామనుకొన్నాడా రెడ్డి ! అందరూ తనకి మల్లె కరిగినవాల్లే ఉంటారా భూమి మీద ? ఒక రోజు ముందు వెనకా ఉండద్దు ఎంత వాడికైనా ?" అని బుగ్గలునొక్కుకొని నిలబడింది లక్ష్మమ్మ.

"మునసబు తప్పేముంది ? వాళ డ్యూటీ ప్రకారము వాళ్లు అడగడం న్యాయమే" అన్నాడు రాగయ్య.

"అందుకని, సాటి కాపువాడై కూడా, వాకిట వెట్టివాళ్లచేత ఎద్దుని జప్తి చేయించడానికి సిద్ధమవుతాడా ? ఈ యేడు గిద్దెడు గింజలు కూడా ఆ పొలం మీద కళ్లను చూచిన పాపాన్ని పోలేదే ! శిస్తు ఎలా కట్తామనుకొన్నాడా మునసబు ?"

"మన రోదన అరణ్యరోదన. ఎందుకు నువ్వు ఆయాసపడుతావు ? ఏది తప్పినా సర్కారు ముడుపు తప్పుతుందా మరి ?

"నువ్వు మొదటినుంచీ ఇల్లాంటి నీతులు చెప్పే సంసారం ఇంతకాడికి తెచ్చావు. నువ్వు శిస్తూ కట్టొద్దు; ముడుపూ కట్టొద్దు ఊరుకో! పల్లెలికి పోయిన పిల్లోడు రానీ! కరణం కాడికి పోయి లెక్క చూచుకొని కట్టవలసి ఉంటే వాడే కట్టి రసీదు తెచ్చుకొంటాడు."

"అయ్య వచ్చేదాకా అమావాస్య నిలుస్తుందంటే పిచ్చివానా ? సర్కారుకు మన ములాజా ఏమీ ఉండదనుకో!"

"అయితే నీ మనసొచ్చినట్లు చేసుకో" అని విసుక్కొంటూ లోపలికి పోయింది లక్ష్మమ్మ.

గ్రామ మునసబు అక్రమంగా తన పెనిమిటి దగ్గర డబ్బు గుంజుకొంటున్నాడేమో నన్న ఆక్రోశం కొద్దీ మాట్లాడవలసి మాట్లాడింది కాని భర్త మాట కెన్నడూ ఎదురాడేది కాదు ఆ భాగ్యశాలి. భర్త మీదనే ఆ జవాబ్దారీ పెట్టి, తానింట్లోకి వెళ్లిపోయింది.

అప్పటికప్పుడే వారం రోజుల క్రిందట ఎద్దుల బేరగాళ్లు పడమటినుంచి వచ్చి ఆ గ్రామంలో దిగి ఉన్నారు.

రాగయ్య కొడుకు రమణారెడ్డి పొగాకు బేరం మీద ఏటి అవతల పల్లెల్లోకి పోయి పది రోజులయింది. అతడెప్పుడు వస్తాడో ! వారాని కల్లా తిరిగి వస్తానని నమ్మకం చెప్పి పోయిన కొడుకు ఇంకా ఇంటికి రాలేదు. అతడు వచ్చేదాకా సర్కారుశిస్తు నిలుస్తుందా ? నిలవక పోతే పైకం ఎక్కణ్ణుంచి తీసుకొని రాగలడు రాగయ్య? పదిగంటలకు పైకం చెలిస్తానని గ్రామ మునసబుకి ఖండితంగా చెప్పి పంపాడు. ఆ మాట పొరపాటయితే, ఎద్దుని జప్తి చేయక మానడు మునసబు. ఈ సారి తాను మూడో వాయిదా పైకం కూడా చెలించలేనని చెప్పితే, ఇంత వరకు గ్రామ మునసబు తనని ఒత్తిడి చేయకుండా నిలుపుకొని వచ్చాడు. కాని, ఇది ఆఖరు వాయిదా ! ఇక శిస్తు నిలపడానికి వీల్లేదని రాగయ్యకి తెలుసు. రెండు వాయిదాల శిస్తూ, కరణానికి ఇవ్వవలసిన జమాబందీ మామూలు వగైరాలన్నీ కలసి ఇరవై రూపాయల దాకా చెల్లించవలసి ఉంటుందని కరణం యిదివరకే చెప్పాడు. ఇంట్లో కూటికే చాలీ చాలకుండా ఉన్నవి ఈ మెట్ట పొలంలో పండిన గింజలు. ఏ వస్తువయినా కుదువ పెట్టి తెద్దామనుకుంటే, భార్య మెడలో తాళి బొట్టు తప్ప మరొకటి ఏమీ లేదు. పిల్లవాడు గనక ఉంటే ఏ మారాజునో అడిగి తీసుకొని వచ్చే వాడు. తాను ముసలి వాడు. ఒకరి దగ్గరకు పోయి చేబదులడగ డానికి అభిమానం. అక్కడికీ, షాహుకారి వద్దకు పోయి ఒక పాతిక రూపాయలు ప్రోనోటు మీద బదులడిగాడు. కాని, మేజరు అయిన కొడుకూ తనూ ఇద్దరూ కూడా చేరి ప్రోనోటువ్రాసియిస్తే రూపాయి వడ్డీకి ఇస్తానన్నాడతడు. కాని హాజరుతో తన కొడుకేడీ?

శిస్తు పైకం సర్దుబాటు చేయగల ఉపాయం అతనికేమీ తోచలేదు. అట్టే ఆలోచించాడు. పోనీ, ఎద్దు జతకి కట్టే మన్న పోతుని అమ్మివేద్దామని ఆలోచన పుట్టింది. కాని దాని మీద పదెనిమిది రూపాయలకంటే జాస్తిగా రాదే! పదిహేను ఇరవై రోజులనుండి ఈ సందుకట్లు పిల్లవాడు ఇంటి పొరుగున ఉండనే లేదు,

అందువల్ల పశువులకు సరిగా మేత అమరక, అవి చిక్కి శల్యమై పోయాయి. ఆ దున్నపోతు అమ్మబోతే అడవీ, కొనబోతే కొరివీగా ఉన్నది. ఇక ఎటువచ్చీ ఎద్దు ఒకటి ఉన్నది. దాన్ని అమ్మితే అప్పటి ధరల్లో ఏ నలభయ్యో, ఏభయ్యో ఇస్తారు. అదిగాక అవసరంకొద్దీ కావాలెనని అమ్మజూపితే, రూపాయి సొమ్ము అర్ధరూపాయికి అడుగుతారు బేరగాళ్లు, తాను శిస్తు కట్టకుంటే మునసబు ఎటు తిరిగీ ఆ ఎద్దును జప్తి చేసి తీసు తాడు. తన ఇంట్లో అప్పటికా యెద్దు తప్ప, విలువ గల మరొక చరాస్తి ఏమిన్నీ లేదు? ఎద్దును జప్తి చేసి తీసుకొని పోతే తానేమి చేయగలడు ? దాన్ని అయినకాడికి ఏలంలో అమ్మివేస్తే తానేం చేయగలడు? తన కంఠంలో ప్రాణం ఉండగా వెట్టివాడు తన ఎదర ఇంటో అడుగుపెట్టి ఎద్దును పట్టుకొని పోతావుంటే తాను చూస్తూ ఊరుకోవడం ఎట్లాగా? అంతకంటే, పోతే పోయింది ఎద్దు, దాన్ని గుట్టుగా అమ్మి వేసి సర్కారు శిస్తు కట్టేయడం తనకు గౌరవం కదా ! తన హయాంలో సంపాదించిన ఆస్తి ఎంత ఖర్చయి పోయింది కాదు ? తన తండ్రి యిచ్చిన మాన్యమూ, పశువులూ అన్ని నష్టమయి పోయినవి కాదు? ఇంట పుట్టిన ఎద్దని దీనిమీద మమకారం గాని, లేకపోతే ఈ ఎద్దు వుండి తనని రక్షిస్తుందా ? తన ఐశ్వర్యం అంతా ఎట్లా పోయిందో ఇది కూడా అట్లానే పోయిందనుకొంటాం—అని ఈ విధంగా పని చేయడం మొదలెట్టింది రాగయ్య బుర్ర.

రాగయ్య మళ్లా భార్యతోనయినా సంప్రదించలేదు. కాలికి చెప్పులు తొడుక్కొన్నాడు. ఊరి వెలపల మంద బయట బేరగాళ్ల వద్దకు వెళ్లాడు. వాళ్ల నింటికి పిలుచుకొని వచ్చాడు. ఎద్దును చూపించాడు. ఏభయి రూపాయలకు బేరం ఫయిసలు చేసుకొన్నాడు. డబ్బు చేతిలో వేసికొన్నాడు. ఎద్దు మెడ పలుపు విప్పి బేరగాళ్ల చేతిలో పెట్టాడు. దుఃఖం ఆపుకోలేక పోయాడు. బొట బొట ప్రవహించింది కన్నీరు. "నా మహా లక్ష్మి పోతున్నదే" అని లక్ష్మమ్మ బారు మన్నది.

"మనకి ఋణం తీరిపోయింది—ఊరుకో," అని ఆమెకు ధైర్యం చెప్పాడు రాగయ్య.

"పసిబిడ్డని సాకినట్లు సాకాను. దాని తల్లికి పుట్టిన దూడలు నా బిడ్డల్లాగే—బతకకుండా చచ్చిపోతుంటే తిరపతి వెంకటేశ్వర్లకి మొక్కుకొని, దీనికి వెంకన్న అని పేరు పెట్టుకొన్నాను. నాకు రమణయ్య ఒక కొడుకూ, ఇదొక కొడుకూ అనుకొన్నాను—అయ్యా ! వెంకన్నా ! నా చేతి నీళ్లు నీకు ఋణం తీరిపోయిందయ్యా ? పోతుండవా? ఇక మళ్లా నా కళ్లకు అగుపడవూ ? నిన్ను విడచిపెట్టి నే నెట్లా ఉండేదే ఈ కొంపలో ? నువ్వు అగుపడకుంటే రమణయ్య కూడు కుడిచి నీళ్లు తాగుతాడా . . ." అని ఎద్దు మీద చెయ్యివేసి బెగ ఏడుస్తోంది లక్ష్మమ్మ.

రాగయ్య లోలోపలనే కుమిలి పోతున్నాడు. మొగవాడు తాను, వయస్సు మీరిన అనుభవశాలి, కష్ట సుఖాలు తెలుసుకొన్న జ్ఞాని. తనుకూడా ఆడదానిలాగ బెంబేలు పడితే ఎట్లా ? ఋణానుబంధ రూపేణ పశుపత్నీ సుతాదయః అని పెద్దలు చెప్పే వాక్యం స్మృతికి వచ్చిందతనికి.

"ఈ గొడ్డు మీద నీ కెందుకీ మమకారం? ఋణం తీర్చుకొని వాని దారిని అది వెళ్లిపోతోంది: నువ్వు ఏడవబోకు" అని భార్యకు ధైర్యం చెప్పి తాను ధైర్యం తెచ్చు కొన్నాడు.

బేరగాళ్లు ఎద్దు పగ్గం పట్టుకొని బర బర లాక్కొని పోయారు.

ఎద్దు లేక బారుమన్న దొడ్డి చూచుకొని లక్ష్మమ్మ మళ్లా బారుమని పొడ్లోనే ఏడుస్తూ కూర్చున్నది. రాగయ్య ఇంట్లోకి పోయి, చుట్ట ముట్టించి, వాకిలి ముంగిట గోడ కానుకొని గొంతుకూర్చున్నాడు. దుఃఖభార కంపితమయిన తన హృదయాన్ని స్వస పరచుకొంటున్నాడు. కొడుకు రమణయ్య వచ్చి సంగతి తెలుసుకొంటే, తగవులాడుతా డేమో అని అతనికి సందేహం కలిగింది. కాని అంతలోనే ధైర్యం తెచ్చుకొంటున్నాడు; నెత్తి మీద బరువు దింపుకొనే నిమిత్తం అమ్మవలసి వచ్చిందని చెప్పితే పిల్లవాడు మాత్రం కాదంటాడా ? అని అనుకొన్నాడు.

వీధిలో మళ్లా ప్రత్యక్షమయ్యారు శెట్టివాళ్లు.

"నేను ఎంత పైకం కట్టవలెనో కరణంచేత కాగితం మీద లెఖ వేయించి చేసుకొని రంపి పైకం యిస్తాను. తయారుగానే వుంది," అని వాళ్లతో చెప్పాడు రాగయ్య.

"కరణమూ రెడ్డి కచ్చేరిలో కూచుని వుండారు. నువ్వే అడవాకా వచ్చి పైకం చెల్లించి రాగూడదయ్యా ? అని అడిగారు గ్రామ నౌకర్లు.

రాగయ్యకు వీధిలో పడి నలుగురి మొఖమూ చూడడానికి సిగ్గయింది: గ్రామాధికార సమక్షంలోకి పోవడానికి తలకొట్టినట్లయింది: మనస్సు ఇష్టపడలేదు.

"నేను చెప్పానని చెప్పితే కరణం లెఖ తేల్చి యిస్తాడు లేరా. నాకు వంట్లో వుసులుగా లేదు. నేను ఇప్పుడు నడిచి రాలేను. కాగితం రాయించి చేసుకొనిరండి. ఇదిగో ! పైకం సిద్ధంగా వున్నది" అన్నాడు రాగయ్య.

కరణం లెఖ వేసి, మూడు, నాలుగు వాయిదాలకు ఇవ్వవలసిన మాగాణి శిస్తూ, ఉత్తరువు లేకుండా సాగుబడి చేసినందుకు తీర్వజాస్తి నీటి అపరాధమూ, రోడ్డు సెస్సూలూ, విద్య పన్నూ, తన జమాబందీ మామూలు, డి. పి. డబ్ల్యు ఓవర్‌సీరుకి చెందవలసిన మామూలూ,—అమాంబాపతులూ కలిపి రూ. 19—12—0 కు లెఖ తేల్చి కాగితం మీద వేసి పంపాడు. పైకం పెట్టివాళ్ల పరంగా యిచ్చి పంపివేశాడు రాగయ్య. శిస్తు కట్టగా మిగిలిన పైకం రూ. 30—4—0 లూ తీసి, పెట్టిలో భద్రం చేసుకొన్నాడు.

ఆ రోజు పడమట బారెడు పొద్దు తిరిగేవరకు లక్ష్మమ్మ వంట చేయకుండా ఏడుస్తూనే ఉన్నది.

పొద్దుగూకే ముందు ఇన్ని మెతుకులు కొరికాడు రాగయ్య. ఉదయం తొమ్మిది గంటలకల్లా తోలిపెట్టిన ఎద్దు సాయంత్రం దాకా తన కళ్ల బడకుండా వున్నందువల్ల

అతనికి మనస్సు ఉండబట్టడంలేదు: పొద్దుగూకిన తరువాత మంద బయటికి పోయి, బేరగాళ్ళ మందలో కలిసిపోయిన ఎద్దును ఒకసారి చూసుకొని మరీ ఇంటికి వచ్చాడు.

ఆ రాత్రి వేకువనే బేరగాళ్ళు ఎద్దులమందను తోలుకొని పడమటికి వెళ్ళిపోయారు.

రాగయ్య కడుపున ఎనమండుగురు సంతానం కలిగారు. కాని అతనికి వృద్ధాప్యం వచ్చేవరకు మిగిలిన వాళ్ళల్లో కల్లా కొడుకు రమణయ్య ఒకడున్నూ, కూతురు వెంకమ్మ ఒకతెనీ, ఆడ పిల్ల పెద్దమనిషయి భర్తతో సంసారం చేసుకొంటోంది. రమణయ్య ఇప్పుడు పాతికేళ్లవాడు. ఇటీవలనే మేనమామ కూతురిని ఏటి అవతల వివాహం చేసుకొన్నాడు. కాని ఆ పిల్ల ఇంకా పసిది: కాపరానికి రాలేదు.

రాగయ్య తండ్రి చని పోయేటప్పుడు పదహారెకరాల మాగాణి, నాలుగెకరాల పశువుల బీడూ, రెండెకరాల తోట, దొడ్డి, కళ్ళెపుబావి, ఇల్లూ, రెండు గాళ్ళ ఎద్దులూ, నాలుగు పాడి పశువులూ వగైరా స్థిర చరాస్తులంతా కలసి ఏడెనిమిది వేల రూపాయల ఆస్తి వప్పచెప్పి చనిపోయాడు. కాని ఆస్తితోకూడా తన హయంలో చేసిన నాలుగువేల రూపాయల అప్పుకూడా చూపించి మరీ పోయాడు. రాగయ్య వయస్సులో ఉండంగా కష్టపడి ఆ పదహారెకరాల పొలము పండించుకొని దాని మీద వచ్చే ఆదాయంలో, అప్పుల వాళ్ళకి ఏటా చెల్లువేసి, అంతా పదిపన్నెండేళ్లలో అప్పులేకుండా చేసుకొని, ఆస్తిని మిగుల్చుకొందామనితాపత్రయ పడ్డాడు. కాని, పాపం, అప్పటి కతడు ఒంటరిగాడు. ఇంటి దగ్గర సంసారమూ, పొలంలో సేద్యమూ, — ఈ రెంటిలో తానొక్కడూ తూగలేక పోయాడు. అదిగాక, చిన్న వయసులోనే తనకు భగవంతుడు సంతాన ప్రాప్తి కలగచేసి వుంటేను, ఏ మొగ పిల్లవాళ్లయినా, ఒకరిద్దరు బయలుదేరి ఉంటే, ఏదో బర్రె గొడ్డుల నయినా మళ్లవేసుకొని వచ్చేటందుకు ఉపయోగపడేవారు. ఆ ప్రాప్తం లేకుండా అత్యవమ్త వరసగా ఆడపిల్లలనుకనడమూ, పుట్టినవాళ్ళు నన్నమైపోగా, ఇప్పుడు వెంకమ్మ మాత్రమూ మిగలడమూ జరిగింది.

నాలుగు వేల రూపాయల అప్పు తీర్చాలంటే సామాన్యమైన పనేనా ? అవసరం కొద్దీ, తన తండ్రి ముక్కాలు రూపాయి, రూపాయిన్నర, రూపాయిపావలా—ఈ ప్రకారం ప్రత్యేకమైన వడ్డీల మీద ఆ చేసిన అప్పు. ఈ అప్పుల్లో ఏటేటా అంతంకం తిరిగే ప్రోనోట్లు కొన్ని, రెండేళ్ళకి ఒకటం తిరిగేవి కొన్నీ, మూడేళ్ళకి తిరిగేవి కొన్నును. వడ్డీ అసలు కలిసే వరకు, పాపం పెరిగిపోయ్యి, ఇబ్బడికి ఇబ్బడయి పోతోంది అప్పు. ఒక వేళ పొలం మీద వచ్చే గింజలమ్మి, తోటలోపండే మిరపకాయలమ్మి, ఇంట్లో పెరిగిన కోడె దూడల నమ్మి, పది వరాలు పోగుచేసి బాకీలో ఏ వందో, రెండు వందలో చెల్లు వేసినప్పటికీ, అసలు అసల్లాగే ఉండడం సరిగదా, వడ్డీలోకి కూడా సరిపోవడంలేదు ఆ చెల్లు. దీనికి తోడు బాకీదార్లుకూడా అప్పులు కట్టమని తొందరచేస్తూ వచ్చారు. ఇక ఇది పని గాదనుకొని తండ్రి గతించిన నాలుగేళ్లకల్లా ఆరువేలదాకా పెరిగిన అప్పుకు సరిపొయ్యే పొలం అయిన కాడికి తెగనమ్మి ఋణ బాధ అనేది లేకుండా చేసుకోవాలని నిశ్చయు

పరచుకొని పదహారెకరాలలో పది ఎకరాల మాగాణి, రెండెకరాల తోట అమ్మి వేసి ఋణ బాధ పూర్తిగా నివర్తిచేసుకొన్నాడు రాఘయ్య. ఇప్పుడు పోగా మిగిలిఉన్నది నాలుగెకరాల మాగాణికయ్యా, నాలుగెకరాల బీటి కయ్యా మాత్రమే.

కష్టపడి చేసుకొంటే మాగాణి కయ్యి మంచిదే, కనీసం ఎకరా పుట్టి చొప్పున నాలుగెకరాలూ నాలుగు పుట్లు నమ్మకంగా పండితే సర్కారు శిస్తులూ, సేద్యపు ఖర్చులూ పోను, తన కుటుంబం మనవర్తికి సరిపోతుంది: పరవాలేదు. కాని రాఘయ్య అదృష్టానికి తోడు ఇప్పటికి అయిదారేళ్లనుంచి ధాన్యానికి ధర తగ్గి పోవడం సంగతి ఎట్లా ఉన్నా, నాలుగేళ్ల క్రిందట కొట్టిన గాలి వాన సంవత్సరం మొదలు ఎందు వల్లనో చెరువుకి సకాలంలో నీరు ఎక్కడమూ లేదు, పంటలు సరిగ్గా పండడమూ లేదు. ఎంత ఎరువు తోలినా, ఎంత సత్తువ చేసినా, రాత్రిం బగళ్లు కయ్యి ఎదటి పెట్టుకుందా దాంట్లోనే పండుకొన్నా కూడా, ఎకరానికి పంపుం, పన్నిద్దుం గింజలు రాలే పంట కటకటలు పోతోంది. ఈ ఆదాయం చాలక ఈ మధ్య రమణయ్య పొగాకు బేరం ఒకటి పెట్టు కొని, సేద్యం నాద్యం లేని తీరు బడి రోజుల్లో ఏదో పది రూపాయల పొగాకు కొని, దాన్ని ఏటి అవతల పల్లెలకివెత్తు కొని పోయి, మారు బేరానికి అమ్ముకొని తన పొట్ట గడవగా, నాలుగు పావులు మిగిలితే ఇంటికిచేర్చు కొంటున్నాడు. శరీర కష్టం అంటే అటగానికి ఒక లెఖలోది కాదు. మంచి వయస్సులో ఉన్నాడు. అతనికి తల్లి, తండ్రి అంటే పంచ ప్రాణాలూనూ. ఆ తల్లి దండ్రులు కూడా రమణయ్య అంటే అదే విధంగానే ఉంటారు.

రమణయ్య వెళ్లిన పొగాకు మూట పెట్టుకొని పల్లెలకి పోయి పది రోజులు దాటింది. ఒక వేళ ఏటి అవతలకి పోయినా, ఎప్పుడు గాని వారం రోజులకంటే ఎక్కువగా నిలిచేవాడు కాదు. అల్లాంటిది ఈ సారి మాత్రం ఎందువల్లనో పది రోజులు దాటికూడా ఇంకా ఇంటికి చేరుకోలేదు.

వెంకన్న నమ్మి నాలుగు రోజులయింది: అయిదు రోజులయింది: ఆరయింది: ఏతత్సంబంధమయిన ఎడబాటు రాఘయ్యకీ, లక్ష్మమ్మకీకూడా పరిపాటయిపోయింది. ఓడ్డ రమణయ్య ఇంకా రాలేదేమా అని ముదుసళ్లు కొడుకు మీద మరులు నిలుపుకోలేక పోతు న్నారు. వెంకన్న విడచిన ఇంట్లో రమణయ్య అయినా తిరుగుతుంటే, ఆ వృద్ధుల కడొక విధమైన తృప్తి, ఆనందమూను.

ఏడో రోజు ఉదయం తొమ్మిది గంటలకు రమణయ్య ఇంటికి చేరాడు. వీధి వసా రాలో మంచంమీదనే పడుకొని ఉన్నాడు తండ్రి రాఘయ్య. లక్ష్మమ్మ దొడ్లో కుండలు కడిగిన నీళ్ల బర్రె గొడ్డు తానే తొట్టిలో పోస్తున్నది. రమణయ్య యనుగుల చప్పుడు విని, దిగ్గున మంచం మీద లేచి కూర్చున్నాడు రాఘయ్య.

“ఈ తడవ ఇన్నాళ్లు నిలిచినావేమి నాయనా! అని ఆప్యాయంగా కొడుకుని. అడిగాడు.

"ఏదో ఆలస్యమే అయిందే; ఈ తడవ పోయినవాణ్ణి ఎట్లాగా పోయాను కదా అని మామ గారి ఊరికి కూడా పోయి, పిల్లవాళ్లని చూచి వచ్చా" అన్నాడు రమణయ్య.

కొడుకు మాటలు సవ్వడి విని, ఇంట్లోనుంచి వాకిట్లోకి వచ్చింది తల్లి.

"ఏదీ! మామగారి ఇంటికి పోయి వచ్చావా? అందరు బాగుండారా?" అని తాను కూడా అడిగింది.

"ఆ ! అందరు బాగానే ఉండారు. మామ కాలు ఈ మధ్య ఎద్దు తొక్కిందట పాదం అంతా మోపుచేసి వారం రోజులుగా ఆయన లేవలేక పోతున్నాడు" అని సమాధానం చెప్పాడు రమణయ్య.

"అయ్యో!

"అయ్యో! మరి ఆ సంగతి చెప్పి పంపనే లేదు చూడు వాళ్లు! పోయి చూచేనా వద్దును ఒకసారి" అన్నది లక్ష్మమ్మ.

"ఇప్పుడు నయమయిందిలే : ఎవడో మంగలివాడి చేత కాలు తోమిస్తుండాడు. ఇప్పుడిప్పుడే కాలు కింద పెట్టి లేచి తిరుగుతున్నాడు".

"సరే: బాగానే ఉండది" అంటూ లక్ష్మమ్మ లోపలికి వెళ్లి పోయింది.

"ఎండ పడింది, కాళ్లూ, మొఖమూ కడుక్కోని, చద్ది నీళ్లు తాగు నాయనా! బెట్ట పడిందే ఆ మొఖం" అన్నాడు తండ్రి.

నెత్తిని చుట్టిన గుడ్డ తీసి మంచం కోడు మీద వేసి, జుట్టు ముడి విప్పి, రెండు చేతులా దులుపుకొని మళ్లా ముడి వేసుకొన్నాడు రమణయ్య. పళ్లు తోముకోను వొడ్లో వరల బావి కాడికి పోయి., ఎద్దు సంగతి జ్ఞాపకానానికి రాగా, పసువుల చప్పారంలోకి పోయి చూచాడు. దున్న పోతు మాత్రం గాటి కట్టివేసి ఉన్నది. ఎద్దు లేదు. పాలు తాగే బర్రె దూడ పండుకొని నెమరు వేస్తోంది. బర్రె పొలం పోయింది కాబోలుననుకొన్నాడు. మరి ఎద్దు ఏమయిందా అని సందేహం కలిగింది.

బావికాడ పళ్లు తోముకొని మొఖమూ కాళ్లూ కడుక్కోని ఇంట్లోకి వస్తూ, ఎద్దుని కూడా పొలం తోలి పెట్నావా ఈ పొద్దు" అని తల్లిని అడిగాడు.

"పొలమూ లేదు, వల్లకాడూ లేదు నాయనా !" అని నిట్టూర్చింది తల్లి.

"మరి ఏయిందీ ఎద్దు ?"

"పడమటి ఎద్దుల బేరగాళ్లకి ఏభయి రూపాయలకి అమ్మివేశాడు మీ అయ్య. ఏం చెప్పమంటావు నాయనా?" అని కన్నీరు విడిచింది పొయ్యికాడ కూర్చున్న తల్లి.

రమణయ్య వడుం కరేలు మన్నది. ఎద్దును అమ్మడ మేమిటో లతనికి అర్థం కాలేదు.

వాకిట్లోకి పరుగెట్టాడు.

"ఎద్దు నెందుకు అమ్మావే, నాయనా ?" అని తండ్రిని అడిగాడు.

"సర్కారు శిస్తుకి రెడ్డి తొందర చేశాడు. నువ్వు సమయానికి ఇంట కాడ లేక పోతివి. నేను ముసలాణ్ణాయి లేవలేక పోతిని . . . ." అని ఏమో చెప్ప బోయాడు రాగయ్య.

రమణయ్యకు చికకానిపించింది.

"ఏమి శిస్తే ? ఈ యేడు మన కయ్యలన్నీ ఈటు పోయినవి. మన కీయేడు శిస్తు ముజరా ఇస్తారని నాతో చెప్పాడు కరణం. ఇంకా శిస్తు—శిస్తు — దాని తల్లి కడుపు కాలిన శిస్తు — ఇంకా శిస్తు ఎక్కణ్ణించి వచ్చిందే" అని పెద్దగా అరిచాడు రమణయ్య.

"నాకేం తెలుసు ఆ సంగతి ? ఇరవై రూపాయలు శిస్తు కట్టాలి. కడ్తావా లేక పోతే ఎద్దుని జప్తి చేయమంటావా అని రెడ్డి, కరణమూ చేరి వెట్టివాళ్లని ఇంటి పైదికి పంపించారు. నన్నేం చేయమంటావు చెప్పు ?"

"అయితే మట్టుకు ; నేను వచ్చే వరకు నింపనైనా నిలవకుండా బంగారం వంటి ఎద్దును అమ్ముకొంటారయ్యా ?" నీ కెవరు చెప్పారే ఈ సంహా?

"చెప్పాను నాయనా? 'పిల్లోడు వస్తాడు, రెండు రోజులు నిదానించండయ్యా' అని బతిమాలాడుకొన్నాను. కాని వారు మన మాటలు వింటారా చేస్తారా?"

"అయ్యయ్యో ! ఎంత పని చేశావయ్యా ? నోటికాడ కూడు పొగొట్టుకొంటా రయ్యా ఎవరైనాను ? నీ కేమంత తొందర వచ్చిందే, నేను రాకుండానే నిక్షేపంవంటి ఎద్దును నాశనం చేశావుగదయ్యా" అని కింద కూల బడ్డాడు రమణయ్య.

"మన వెంకన్నకీ, మనకీ ఋణం తీరి పోయింది నాయనా. బిడ్డని సాకినట్లు ఎనిమిదేళ్లు సాకాను. ఏం క్రియ ? బంగారం వంటి ఎద్దుని అమ్మి పైకం కట్టేదాకా నిలవనిచ్చాడా ఆ రెడ్డి ? సాటి కాపువాడయితే మట్టుకు, ఏం ప్రయోజనం? ఏం చేస్తాం? మన ఖర్మ అట్లా తెల్లారింది" అని కంట నీరు పెట్టు కొంది లక్ష్మమ్మ.

"నీ కెవడు చెప్పాడయ్యా ఈ ఆలోచన? అయ్యయ్యో, బంగారం, బంగారం, కాని అది ఎద్దా? ప్రాణంతో సమానంగా సాకుకొన్నానయ్యా దాన్ని. ఆ ఏద్దు వాధారం చేసుకొని ఆ నాలుగెకరాల కయ్యా చల్లు కొంటున్నాను. నాశనం అయింది గదయ్యా నా ఎద్దు" అని రమణయ్య వలవల ఏడుస్తున్నాడు.

"ఊరుకో నాయనా, ఊరుకో. తీరిపోయింది, దానికీ మనకీ ఋణం తీరిపోయింది. నేనూ ఇట్లాగే మనస్సు పట్టలేక ఈ వారం రోజులూ ఏడ్చాను. ఏం చేస్తాడు మీ

"అబ్బాయీ ! నువ్వేమీ తొందర పడవద్దు. నా మాట విను ! నువ్వు అధికార్లతో తగవు పెట్టుకొంటే నీకే తగులుతుంది దెబ్బ. నిదానించు, మన ఖర్మకి గ్రామాధికార్లు కర్తలా" అని తండ్రి అడ్డు తగిలాడు.

"నేనేమీ తగవులాడను లేవే ? ఆ శిస్తేమిటో, ఆ లెఖ ఏమిటో—లెఖయినా చూపించుకొని వస్తాను : మనకి ఇంకా ఇరవై రూపాయల శిస్తు ఏడుంది వచ్చిందీ ? అంత శిస్తు కట్టవలసినట్లు నాకు జ్ఞాపకం లేదే?" అని బయటికి వచ్చాడు రమణయ్య.

"అబ్బాయీ ! నువ్వు అసలే కోపవారి మనిషివి. వాళ్లతో అనవసరంగా తగవులాడక నీ పనేమిటో అది చూచుకొనిరా" అని తండ్రి మళ్లా బోధించాడు.

ఎకాయెకీని రమణయ్య గ్రామచావడికి పోయాడు. కరణమూ, మునసబూ కూడా కూర్చొని పైకం వసూలు చేసే పనిలోనే ఉన్నారు. ఇంకా ఇతర రైతులు నలుగురైదురు కూడా లెఖలు చూపించుకొంటున్నారు.

"ఏమయ్యా ! మునసబుగారు ! నీకు సర్కారువాళ్లు అధికారం యిస్తే మట్టుకు మాతోటి బీదవాళ్లని గొంతుకు తెగ్గోయమని కూడా అధికారం యిచ్చారా ?" అని పెద్దగా అడిగాడు రమణయ్య.

"గొంతుకు తెగ్గోస్తే ఉరిశిక్ష వేస్తారు సర్కారు" అని ఎగతాలిగా జవాబిచ్చాడు మునసబు.

"అది కాదయ్యా ! నీకు శిస్తు పైకం కట్టవలసి ఉంటే మాత్రం, నేను ఇంటి కాడలేకుండా చూచి ముసలాణ్ణి ఏపించుకొని తిని ఎద్దును అమ్మిస్తావుటయ్యా ? నువ్వు మాత్రం కాపోడివి కాదూ ? నీకు మాత్రం సేద్యం లేదూ ? నీకు మాత్రం పశువులు లేవూ ?"

"నిజమేరా ! ఉన్నాయి. ఉంటే ? మీ నాయన్ని ఎద్దుని అమ్మవలసిందని నేను బలవాయం చేశానా ?"

"పైకం కట్టకుంటే, ఎద్దుని జప్తి చేస్తానని వెట్టివాణ్ని ఇంటిమీదికి పంపితే, దాని అర్థం ఏమిటి ?"

"సర్కారు శిస్తు కట్టకుంటే జప్తి చేయక ముద్దు పెట్టుకొంటారా ?"

"రెండు రోజుల్లో నేను వస్తానే ఉంటినే ? అంత మాత్రం నిదానిస్తే సర్కారు వాళ్లు పీకి తెగ్గోస్తారా ఏందయ్యా ?"

"ఎవరి మట్టుకు వాళ్లు నాయిదాలు వేస్తుంటే ఇక పని జరిగేది ఎట్లా ?"

"నాశనం చేశారు గదయ్యా. మీరందరూ చేరి, ఎద్దును. మాతోటి బీదోళ్లని ఇట్లా పీడిపిస్తే మీతోటి గొప్పోళ్ళకి మేలు లేదయ్యా. ఈ ఒక్క ఎద్దూ అట్లా.

అన్యాయమయిపోయిందే, ఇక నేను దేనితో సేద్యం చేసుకొనేదో మీరే చెప్పండయ్యా" అని అక్కడ ఉండిన నలుగురు రైతుల కేసి చూచి దీనంగా అడిగాడు రమణయ్య.

రమణయ్య అమాయకత్వానికీ, అతని నిష్కాపట్యానికీ అక్కడ చేరిన రైతులకే గాక మునసబుకీ, కరణానికీ కూడా నవ్వు వచ్చింది.

"నవ్వులా రెందుకయ్యా ? మునలాడి దగ్గర ఇరవై రూపాయలు గుంజుకొన్నారట ఇంత శిస్తు ఏడనుంచి వచ్చిందయ్యా రెడ్డిగారూ?" అని అడిగాడు. రమణయ్య.

"ఆ సంగతి కరణాన్ని అడిగి లెఖ చూపించుకో" అన్నాడు రెడ్డి.

"ఏమయ్యా కరణమయ్యా!" నువ్వు ఏటా ఆయిన వాడికి మా దగ్గర జమా బందీ మామూలనీ, వల్లకాడు మామూలనీ, ఊడేస్తూనే ఉంటివి. ఇప్పుడింత శిస్తు ఏడనుంచి వచ్చింది ? "అని కరణాన్ని అడిగాడు.

కరణం చిరునవ్వు నవ్వాడు.

"నీ మాగాణి కయ్య నాలుగెకరాలకీ ఇరవై రెండు రూపాయలు మాగాణి శిస్తు ఇవ్వవలసిందేమిటా ?"

"రామరామ ! ఈ ఏడు ఆ పొలంలో చిట్టెడు గింజలు కళ్ళ చూచింది లేదే ? పొట్టి తాలూ పొంపు కోసుకొని తెచ్చుకొంటిమే ! నువ్వు తణిఖీ చేసికూడా వస్తివే ! పంటలేదని రాసి, శిస్తు ముజరా యిప్పిస్తానని చెప్పితివి గదయ్యా ?"

"చెప్పిన మాట నిజమే. నీ నంబరులో మూడున్నర ఎకరాలలో పైరు పోయిన మాట నిజమే, కాని మిగిలిన అర ఎకరా పండింది కదూ ?"

నాలుగెకరాల కయ్యలో ఒక అర ఎకరా పండితే పూర్తి శిస్తు కట్టవలసిందేనా ?"

"ఆ హా !"

"ఇదేమి ఘోరమయ్యా ? "

"కొరవ నంబర్లకి శిస్తు ముజరా ఇవ్వరా సర్కారువారు."

"ఆ కొరవ మాత్రం ఏమి పండిందయ్యా ? కూలి ఖర్చులకే చాల్లే ఆ నలుతుము గింజలున్నూ."

"అందుకనే నేమూ ఇన్‌స్పెక్టరూ వేయడంలో నీ నంబరంతా కలిసి సగటున ఒక అణా ఫలితం మాత్రమే వేశాం. కాని తహశీలుదారు ఒప్పుకోలేదు. నాలుగెకరా లో నూ అర ఎకరాలో పైరు వెన్ను దీసి కాస్త సదరుగా అగపడేవరకు ఆయన సరాసరి రెండణాల ఫలితం వేశాడు, దానితో అంతా తుడిచి పెట్టుకొనిపోయింది."

"రెండణాల ఫలితం పండితే ముజరా ఇవ్వరా ?"

"ఇవ్వరు, రెండవదానికు లోపలనే ఉండాలి ఫలితం. అదిగాక నీ పొలానికి అడా బాజులో ఉండే కయ్యాలన్నీ సుమారుగా పండినట్లు లెక్కగట్టారు రాసుకొని పోయాడు. నీ పక్క భూములు పండి, నీ భూమి పండకుంటే అది రైతు పొరపాటువల్ల జరిగింది కాబట్టి, సర్కారువారి జవాబ్దారీ లేదని, నీకు ముఖరా ఇవ్వడానికి వీల్లేదని పోసేశారు . . . . ఈ చిడుకోళ్ళన్నీ మీకేం తెలుస్తాయి ?"

"ఏమి అన్యాయపు కాలం వచ్చిందయ్యా ! సరే. నీ పన్నెండ్లు మాగాణి శిస్తు ఇరవై రెండు రూపాయల్లోను పదకొండు రూపాయలు మొదటి రెండు వాయిదాల్లోనూ చెల్లిస్తినే — ఇంకా ఇప్పుడు ఇరవై రూపాయలెట్లా అయింది శిస్తు ?"

"ముప్పై ఇరక కయ్యలో చేసిన తీర్వజాస్తి సంగతి మరిచావా ఏమిటి ?"

"దానికెంత పడింది శిస్తు ?"

"పావలా తక్కువ ఏడు రూపాయలు."

"ఏడీ, ఆ ముంతెడు విత్తనాల పట్టుకీ ఏడు రూపాయల శిస్తేందయ్యా ? నువ్వేమో మాకొంపలు ముంచేట్టుగా ఉన్నావే ?"

"అది మెట్టభూమి కనుకటా, దానికి ఉత్తర్వు లేకుండా ముప్పై సీర్ల ఏరు కొన్నందుకు ఐదున్నర రూపాయలు అపరాధం వేశారు. అపరాధమూ, శిస్తూ కలిసి ఆరు ముక్కాలు రూపాయి అయింది."

"ఇవేంటయ్యా ఈ విడ్డూరమూ ? ముంతెడు విత్తనాల మట్టు కేంది, ఏడు రూపాయల శిస్తేంది ? . . . . కొంపలు పెరుక్కొని ఏడికయినా లేచి పోవాలనిపిస్తున్నట్టుగా ఉంది కాని . . . . . . . ." అని ఆశ్చర్య పోతున్నాడు రమణయ్య.

ఇదంతా వింటూ ఉండిన రైతులు పక పకా నవ్వుతున్నారు.

"మేమూ ఇట్లాగే ఏడుస్తున్నాంరా నాయనా పెద్దటినుంచి. మా గోడు ఆ పరమాత్ముడికే ఎరుక, మాకు కూడా తలా అయిదూ, పదీ అపరాధాలు పడ్డాయి.ఏందో మాగాణి రేటంటా, దానిలో మెట్ట రేటు తోసేస్తరంటా, దానికేమో ఇబ్బడి ముబ్బడీ కడతారంటా . . . . . . ఏమిటో చెప్తున్నాడు కరణం. ఆయనగారు చెప్పేదేమిటో మా కేమీ బుర్ర కెక్కడం లేదు. పెద్దటినుంచీ, మేము ఎంతెంత శిస్తు కట్టాలనో మాకు తెలియక కొట్టు మిట్లాడుతున్నాం. ఎవడితో చెప్పకోవాలో తెలియడం లేదు ." అని ఆ రైతులు రమణయ్యతో చెప్పారు.

"అదిగాదయ్యా కరణంగారూ ! నా తీర్వ జాస్తి పొలముకు నీళ్ల ఉత్తర్వు తెప్పిస్తా నని చెప్పి, ముప్పై చేసుకోమంటే కదయ్యా, నేనా కయ్యలో ప్రవేశించాను. లేకుంటే నా కెందుకా లట్లాలు . . . ."అని రమణయ్య అడిగాడు కరణాన్ని.

"అప్పుడా ! నిరుడు సంవత్సరం గ్రామంలో పెద్ద పెద్ద రైతులందరూ ఉత్పత్తులు సరి పడవని మీరు ఒకరు సొమ్ము పెట్టుకొని ఆ వాగు ఏటుకు చెల్లించవలసిన

ముడుపు చెల్లించనే లేదు. అందువల్ల ఈ యేడు ఈ వూళ్లో తీర్వజాస్తి కేసులకు ఉత్తర్వులు ఇవ్వడానికి వీల్లేదని, ఆయన పైకి రాసి, అందరికీ తోక తెగ్గోశాడు, నన్నేం చేయమంటావు ? ''

''మీ యిష్టం వచ్చినట్లు ఏడిపించండయ్యా మమ్మల్ని. మాకేం తెలుస్తాయి ఈ తిరుగుళ్లు ? పశువులం మేం. అట్లా బంగారంవంటి ఎద్దు మట్టి గడ్డలయి పోయిందనే ఏడిచేదా ! ఛీ ! గుక్కెడు విషం తాగి చస్తే మేలు, ఈ గడ్డన బతికే దానికంటే ఏడిపించండి. తల్లి అయినా మీరే, తండ్రి అయినా మీరే అని, కరణం మునసబుల్నిద్దర్నీ నమ్ముకొనందుకు, మమ్మల్ని మీరేం చేస్తే చెల్లుబడి కాదుగనుక ! మమ్మల్నిట్లా తడి గుడ్డలతో కోసే బదులు, ఒక్కసారి పడేసి ఏటపోతును నరికినట్లు నరికి పారేయరాదు'' అని ఇల్లాగే ఏమోమో సణుగుకొంటూ ఇంటికి చక్కాపోయాడు రమణయ్య.

ఎన్ని విధాల ప్రయత్నించినా రమణయ్యకు వెంకన్న మీదనుంచి మనస్సు మరలడం లేదు, ఎన్ని తంటాలయినా పడి, పడమటి బేరగాళ్ల పోబిడి తెలుసుకొని, వాళ్ల డబ్బు వాళ్లకి వాపసు ఇచ్చి తన ఎద్దును లాసు మళ్లా ఇంటికి తెచ్చుకోవాలని కూడాలతనికి అదే ఆలోచనగా ఉన్నది. కాని — చేలితో చిక్కిన ఎద్దును మళ్లా వాళ్లు ఇస్తారా ? ఇంకో నాలుగు రూపాయలు లాభం చూపి అడిగితే ఎందుకు ఇవ్వరు ? — వాళ్లు బేర గాళ్లు కాదా, పోనీ, ఎద్దును ఇవ్వకుంటే మానె, వాండ్ల ఆచోకి తెలిస్తే పోయి ఎద్దు నయినా కళ్లతో ఒకసారి చూచి రావచ్చును, అని ఆలోచించాడు రమణయ్య. పడమటి వాళ్ల దేవూరో అని తండ్రి నడిగాడు.

''వెలిగొండలకి అవతల అదేదో వూరని చెప్పారు నాకు జ్ఞాపకంలే'' అని చెప్పాడు, తండ్రి.

రమణయ్య గ్రామంలోకి పోయి, బేరగాళ్ల విషయమై వాళ్లనీ, వీళ్లనీ విచారించా చాడు, కాని వాళ్ల స్వగ్రామం ఏదో తెలియదని కొందరూ, తెలిసినా నీకు వాళ్లింకా చిక్కు తారా, ఏవూరు పోయారో, ఎక్కడ తిరుగుతున్నారో అని కొందరూ, వాళ్లీ పాటికి వెలి గొండ దాటి పోయి ఉంటారని మరి కొందరూ, ఇంకా నీకు ఎద్దు మీద ఆశ ఎందుకని కొందరూ — ఈ విధంగా అతనికి నిరుత్సాహకరమైన సమాధానాలు చెప్పారు గ్రామంలోని రైతులు, బేరగాళ్లని వెదికి పట్టుకోవడం సాధ్యమైన పనిగా తోచలేదు, రమణయ్యకి. తాను ఒంటరిగాడు, ఇంటికాడ ముసలి వాళ్లని విడిచి, తాను ఎన్ని ఊళ్లని తిరుగగలడు ? ఎంత కాలం అని తిరుగగలడు ? అది కాక, తానా ప్రయత్నమేమీ పెట్టుకోవద్దని ఇంటి దగ్గర తల్లీ తండ్రీ కూడా చాలా దూరం చెప్పారు. ఆ ప్రయత్నంనుంచి విర మించుకొన్నాడు రమణయ్య.

పొద్దు గూకులూ కాలుకాలిన పిల్లిలాగ తిరిగి తిరిగి సాయంకాలానికి ఇంటికి ఘటం చేరవేశాడు రమణయ్య. అతనికి మనస్సు కుదుట పడడం లేదు, దొడ్లో ఎద్దు

లేకపోవడం అతనికి ఇల్లంతా బావురుమని పోయింది. ఎదుట వీధిలో పోయ్యే పశువుల్నీ ఎద్దుల్నీ చూచుకొని ముచ్చట పడుతున్నాడు. ఎక్కడికి పోయినా, సాయంకాలానికి తన యిల్లు చేరుకొంటూ ఉండేది అని ఎద్దు వస్తుందేమో అన్నట్లుగా వీధి వాకిట్లో ఎదురు చూస్తూ నిలిచేవాడు. దొడ్లోకి పోయి చప్పరం చుట్టూ తిరుగుతూ వుండేవాడు. ఎద్దును కట్టే గుంజవైపు అట్టే పరకాయించి చూచాడు. ఎద్దు అక్కడ నిలబడి చేత్తో మేత దువ్వుమని తలపై కెత్తినట్లుగానే గోచరించడం అతని కళ్లకి. మళ్లా అంతలోనే వట్టి గుంజ మాత్రమే కనిపించింది. అతనికి పెద్ద దుఃఖం పొంగివచ్చింది. ఎద్దు యింటికి వచ్చే వేళ, ఎద్దుకి బుస్తా మేపుపెట్టే సమయం, గాడిలో వచ్చి గడ్డి వేసే కాలం, — ఇవన్నీ అతనికి జ్ఞాపకానికి వచ్చినై, కాని వీటిల్లో ఏ పనీ కూడా చేయవలసిన అవసరం లేకుండా పోయింది. తనకి చేయి విరగ గొట్టినట్లుగా ఉంది. వాకిట్లో గోడ కనింబస నాగేలి, కాడి మానూ అతని కళ్లల్లో పడినవి. ఎద్దు జ్ఞాపకానికి వచ్చింది. కళ్లు చెమ్మగిల్లినై. కళ్లలో మెదిలాడు వెంకన్న. ఒక క్షణం నాగేలివైపు చూస్తూ నిలబడ్డాడు. "ఇంక నేను సేద్యం ఎట్లా చేసుకొనేదే, వెంకన్నా" అని కళ్లు తూడుమకొన్నాడు.

రమణయ్య ఇంట్లోకి వచ్చాడు గోడకి కొయ్యకు తగిలించిన మువ్వలూ, గంటా, తోలు పట్టెడా, చికు మోరతాడూ అగపించినవి అతని కళ్లకి. ఇక తానా దుఃఖం పట లేక పోయాడు. ప్రక్కనే నులక మంచం మీద బోర్లగిల్లి పడి వెక్క ఎగర వేస్తున్నాడు.

గంట సేపయింది రమణయ్య ఆ విధంగా పండుకొని. రాత్రి భోజనాల వేళ ఐంది తల్లి వచ్చి అన్నానికి రమ్మని పిలిచింది. ఆకలవడం లేదు. భోజనానికి రానన్నాడు రమణయ్య.

"ఇదేంటి అబ్బాయీ ! నీ కిదే పిచ్చిగా ఉన్నదే. పోతే పోయిందిలే ఎద్దు. దాని కోసరం దిగులు పడి, కూడూ, నీళ్లూ మానుకొంటారా ? నువ్వు మొగవాడివి. నీకేం? నీ రెక్కలు బాగుంటే, ఇల్లాంటి ఎద్దుల్ని లక్ష సంపాదించుకోవచ్చు. ఇట్లా దిగులుపడి కూచుంటారా ? బాగానే వుంది — అన్నానికి లే" అని తల్లి పిలిచింది.

"...........".

"నువ్వీ విధంగా దిగులు పడ్డావని ఆ ముసలాయనకి ఎంతో కష్టంగా ఉంది. దాని కాలం, కర్మం ఒనగూడి వచ్చి, శనిగాడు నెత్తినెక్కినందు వలన, దాన్ని అమ్మ వలసివచ్చి అమ్మాడుగాని — ఆయనకి మాత్రం ఎద్దుని అమ్మడం సంతోషమా ఏమిటీ? లే ! నువ్వు లేచి రెండు మెతుకులు తింటేనేగాని ఆయన లేవడు. పాపం ! ఆయనది పెద్ద ప్రాణం. ఒక్కగాక ఒక్క బిడ్డవు నీమీద ప్రాణాలు పెట్టుకొని బ్రతుకుతున్నాం మేమిద్దరమూను, లే, నాయనా, లే !" అని బలవంతం చేసింది తల్లి.

తన స్థితి చూచి తండ్రి కష్ట పడుతున్నాడని వినేవరకు రమణయ్యకు హృదయం విరిగి పోయింది. ఒక వేళ తనకి బాధగా ఉంటే — దాన్ని తండ్రికి తెలియ పరచ కుండా కడుపులోనే దాచి పెట్టుకోవడం మంచి దనుకొన్నాడు, లేచి భోజనం చేశాడు.

దినములు గడచి పోతున్నవి. వెంకన్నని అమ్మి వేసి ఒకటి, రెండు, మూడు నెలలయింది. వృద్ధుడయిన రాగయ్య ఒక రోజున అకస్మాత్తుగా జబ్బుచేసి, కొడుకు చేతుల మీదుగా లవతలికి దాటుకొన్నాడు. రమణయ్య భుజాల మీది భారం బరువెక్కి నట్టయింది.

మరునటి నెలలో భార్య కాపరానికి వచ్చింది. రమణయ్య జీవితంలో సుఖమూ, దుఃఖమూ రెండూ కూడా పొడగట్టాయి. ఆ రెంటిని వేసుకొన్న కావడి బద్ద బరువెక్కి నడుస్తూ వుంటే అతని నడుములాగే అది కూడా జసజప లాడుతోంది.

పొగాకు బుట్ట నెత్తి మీద వేసుకొని పల్లెలకి తిరుగుతూ వున్నప్పుడు వెంకన్న జాడ ఏమయినా గుర్తు చిక్కుతుందేమోనని ఇంకా అతనికి అడియాస కొట్టుకొంటేనే ఉంది కొన ఊపిరితో, కనబడిన పశువుల మంద నంతనీ కలయ వెదుకులాడు, దృష్టిలో పడ్డ ఎద్దునల్లా దీక్షతో పరిశీలిస్తాడు. వెంకన్న పోలికలు గల ఎద్దు తన దృష్టికి తగులుతే భ్రమపడి చూస్తాడు. అది తన వెంకన్న కాకుంటే వెంటనే నిట్టూర్పు విడుస్తాడు. దాన్ని జన్మలో మల్లా లానొక్క సారి చూడాలని అతని కోరిక, అంతే అతని ఆశ !

దినములు గడచిన కొద్దీ, దానీ జన్మలోకి మళ్ళా వెంకన్నను చూడగలన్న ఆశ పూర్తిగా వదలుకొన్నాడు రమణయ్య. రాను రాను ఆ చింతనే మరచి పోయాడు.

రమణయ్య తన సంసారమేమో, తన భార్య ఏమో — తన సౌఖ్యమేమో, ఈ లోకంలోనే మునిగి తేలుతున్నాడు.

ఎంతలో తిరిగి వస్తుంది కాలం వెంకన్నని అమ్మి అప్పుడే ఏడు నెలలయింది. అది మార్గశిర మాసం. చలి వణికించేస్తోంది.

మామూలు ప్రకారం లక్ష్మమ్మ వేకువనే లేచింది. ఇంట్లో పిల్లవాడూ, కోడలూ ఇంకా గాఢ నిద్రలోనే వున్నారు. కోళ్ళు కొక్కొరోకో యని కూస్తున్నాయి.

సంజ వెల్తురు వచ్చింది, మంచు దట్టంగా పడింది. వాకిట కసవు చిమ్ముకోను లక్ష్మమ్మ మంచం విడిచి తలుపు చిలుకు తీసి ముంగిట్లోకి వచ్చింది. చేతితో పొరక కట్ట తీసుకొని వీధి వాకిలి తెరిచింది. తలుపు తెరిచి తెరవడంతోనే బక్క చిక్కిన ఒక్క ఎద్దు గాభాలున తోసుకొంటూ ఆమె మీదికి వచ్చింది. ఇంకా నిద్ర కళ్ళ మీద, మత్తు మీద ఉన్నదేమో, కొమ్ములు ముందుకు వంచి తోసుకు వచ్చే ఆ ఎద్దును జూచి పొడుస్తుందేమో నన్న భయం చేత ఆమె వెనక్కి రెండడుగులు వేసింది. ఎద్దు ముంగిటిలో ప్రవేశించి దొడ్డిలోకి పోయే ఉత్తరపు తట్టు సందు ముఖం పట్టింది. "హా, హా, హా" అంటూ సమయానికి కర్రేది చిక్కనందువల్ల, పొరక కట్టలోనే ఎద్దుని అదిలించి వెనక్కి మళ్ళి

గొట్టడానికి ప్రయత్నించింది లక్ష్మమ్మ. కాని ఆ అదిలింపులు లెక్కపెట్టకుండా ఎద్దు దొడ్డిలోకి పోయింది.

దొడ్లో చప్పారంలో పాలిచ్చే బర్రెపడ్డా, దూడా, దున్నపోతూ ఉన్నవి. ఈ ఎద్దు ఎవరిదో, ఆ పశువుల్ని పొడుస్తుందో ఏమో ! ఎంత అదిలించినా జమలేకుండా దూసుకొని దొడ్లోకి పోయింది, లక్ష్మమ్మకి కంగారు పుట్టింది.

"అబ్బాయి ! అబ్బాయి ! రమణా ! ఇట్లారా "అని పిలిచింది లక్ష్మమ్మ.

"ఎందుకు ? " అని నిద్ర మంచం మీాదనుంచే పలికాడు రమణయ్య.

"ఎవరిదో ఎద్దు దొడ్లో పడి నానా బీభత్సా చేస్తుండదిరా, ఎంత కొట్టినా వెనక్కి పోలేదు, బర్రె దూడని పొడుస్తుందో ఏమో ! ఒకపాలి లేచి ఇట్లారా. దాన్ని బయటికి వెళ్లతరుము" అని అరిచింది లక్ష్మమ్మ.

మొలగుడ్డ బిగించుకొంటూ రమణయ్య దొడ్లోకి పోయాడు.

"ఇదేమి అలవాటమ్మా ? పశువుల్ని ఇంటికాడ భద్రం చేసుకోవాలిగాని, ఇట్లా ఊరి మీాదికి విడిచి పెట్టితే ఎట్లా అనుకొన్నారో! దొడ్లో నీళ్ల కుండలూ బొచ్చెలూ ఉండయి. ఏం నాశనం చేసిందో ఈ యెద్దు " అని సనుగుకొంటూ వీధిలోకి వచ్చి, వంగి, వీధివాకిలి చిమ్మడం మొదలు పెట్టింది లక్ష్మమ్మ.

రమణయ్య ఎద్దును వెతుకొంటూ దొడ్లోకి పోయే వరకు అది అప్పటికే చప్పారం లోకి పోయి దున్నపోతు జతను గుంజకాడ నిలచింది. ఆ యెద్దును జూచి బెదురుకొన్నాయో ఏమో, పండుకొన్న దున్నపోతూ, బర్రెపడ్డా, దూడా ఒక్కసారిగా లేచి నిలబడి ఎద్దువైపు చూస్తున్నాయి.

"దా ! దా ! " అంటూ, చేతిలో చిన్న కర్ర తీసుకొని ఎద్దును సమీపించాడు రమణయ్య. అతన్ని చూడగనే ఎద్దు ముందుకు రెండడుగులు వేసి మెడకింద గీరమని మోర ఎత్తింది.

అప్పటి కప్పుడే తూర్పు రేఖలు బాగా అరి వెలుగు వచ్చింది. రమణయ్య అట్టే ఎద్దు వైపు చూశాడు. దాని చుట్టూ ఒక సారి తిరిగాడు. దగ్గరగా వచ్చాడు. ఎద్దు మోర మీాద చెయ్యి పెట్టాడు. పాత నెత్తూరు పాత నెత్తూరు గుర్తు తెలుసు కొన్నాయి.

"అమ్మా! అమ్మా! వెంకన్న వచ్చాడేవు; వెంకన్నేవు" అని పెద్దంగా అరిచాడు రమణయ్య.

"ఆ ! ఆ ! నా వెంకన్నే — నా తిరపతి వెంకటేశ్వర్లే ! అని అరచుకొంటూ దొడ్లోకి ఒక్క దూకు దూకింది లక్ష్మమ్మ.

అప్పటి కప్పుడే తన ఇద్దరు బిడ్డలూ, ఒకరి నొకరు పరామర్శించుకొంటూన్నారు.

"తప్పించుకొని వచ్చింది కాబోలురా, నాయనా ! చూశావ దాని విశ్వాసం ? దాన్ని పరాయివాడి చేతులో పెట్టి ఏదో నెల జొరబడింది. అయితేనేం ? దాని కెంత గుర్తో కనుక్కో ! ఏ వూరునుంచి వచ్చిందో, ఎప్పుడు బయల్దేరిందో " అని అంటూ లక్ష్మమ్మ కూడా ఎద్దు దగ్గరగా వచ్చింది.

"నా వెంకన్నా ! ఎట్లా అయిపోయావురా ! బక్క పేగులడి వరుగైనావు !" అని కంట తడి పెట్టుకొని లక్ష్మమ్మ "వెంకన్నా ! మరిచి పోయావనుకొన్నాం. ఇంత కాలం ఏడ ఉండావు నాయనా ? నీ అన్న రమణుడూ, నేను నీకు గుర్తు ఉండామా ?—నీ కోసరం అలవటించి మరీ ప్రాణం విడిచాడు — ఆ ముసలాయన. నీ చూపు ఆయనకి ఋణం లేకుండా పోయింది. ఈ పొద్దు నిన్ను చూచి ఉంటే ఆ మారాజు ఎంత పొంగిపోయేవాడు — "

రమణయ్యా, వెంకన్నా కన్ను లరమోడ్చి తన్మయులై ఒకరిలో ఒకరు లీనమై పోయారు.

"అయ్యో ! నా బంగారు కొండా ! కళ్ళల్లో వున్నై ప్రాణాలు ! గుర్తు పట్ట టానికి శక్యం కాకుండా ఇట్లా ఎండిపోయావేమి — వెంకన్నా ? తలుపు తెరిచి చూస్తును గదా — ఎవరి ఎద్దో అని భ్రమపడ్డాను. నా తిరపతి వెంకన్నా ! మన ఇల్లు విడిచి పెట్టి పోయాక దిగులు పడ్డావా ఏంది ? నా కళ్ళు కొలిపోతే ఇట్లా శల్యమై పోయా వేమి నాయనా ! " అని చేత్తో నిమిరింది లక్ష్మమ్మ.

ఎద్దు మొఖంలో మొఖం పెట్టుకొని నిలబడే ఉన్నాడు రమణయ్య.

"నిన్ను చేతులారా ఆ పడమటి వాళ్లకి అమ్ముకొని పాపం ఒడిగట్టుకొన్నాం. ఈ యేడు నెలలూ ఎంత దిగులు పడ్డావో, మేతా నీళ్ళూ అమరక ఎట్టా అయిపోయావో ఏ వూరునుంచి వచ్చావు వెంకన్నా ? ఇన్నాళ్లు ఎవరింటికాడ ఉండావు నాయనా" అని ఎన్నెన్ని ప్రశ్నలో అడుగుతోంది లక్ష్మమ్మ.

ఇంతలో వీధిలో ఇద్దరు పరాయి మొగవాళ్లు ఎవరో లక్ష్మమ్మని పిలిచారు. ఆమె దొడ్లో ఉన్నదని తెలిసి ఇద్దరూ మనుష్యులూ దొడ్లోకి వచ్చారు.

"మేం మాదిగలం. మాది సీకాయకా గొల్లు. ఈ ఎద్దుని మేం మొన్నటి దినం కోట పాడులో ఝానాది రెడ్డి దగ్గర రెండు వరాలకి కొన్నాం" —

"మీరు మాదిగవాళ్ళా ? అయ్యో, నా వెంకన్న కేంగతి పట్టిందే —" అని లక్ష్మమ్మ గొల్లుమనింది.

"మా దగ్గర కొన్న పడమటి బేరగాళ్లీ యెద్దుని కోట పాడులో ఏభయి అయిదు రూపాయలకి యానాది రెడ్డికి అమ్మివేసి పోయారంట ! కాని ఆ రెడ్డికాడికి పోయి నేళమంచీ ఎంత మేపినా ఈ ఎద్దు ఎక్కిరాక ఆ రోజు కారోజు చిక్కి ఎండిపోతూ వచ్చిందంట ! దానితో తెగులట్టుకొని పీనుగయిందంట. దీని కా రెడ్డి ఎన్నెన్ని మంద

మాకులో పెట్టి వైద్యాలు చేయించి చేయించి కార్యం లేక ప్రాణం విసిగి దీనితో చరపడ లేక మొన్నటి రోజున దీన్ని మాకు రెండు వరాల కమ్మివేశాడు. దీన్ని తీర మేము తోలుకొని ఇంటాటికి పోతూవుంటే, నిన్న రాత్రి వేళ ఇది మమ్మల్ని తప్పించుకొని పారిపోయింది. ఇది మీ వూరి ఎద్దని మాకు తెలుసు. అందువల్ల ఈడకే పోయి ఉంటదని మే మిద్దరం అపరేత్రికాడ లేచి వెతుక్కుంటూ వచ్చాం. చూడండి. అవెన్ని కున్నన్ని మరులు మానవుడికి ఉంటాయా ?'' అని మాదిగ లిద్దరూ ఎద్దు వృత్తాంతం అంతా చెప్పారు.

ఈ విషయం అంతా చెవులో వేసుకొంటూ ఉండిన రమణయ్యా, లక్ష్మమ్మా కొయ్యబారిపోయారు.

వెంకన్న శిరస్సు రమణయ్య బాహువల్లర్లలోనే చిక్కుకొని వుంది. రమణయ్య కన్నీటి ధార కాలువలు కట్టుతోంది. లక్ష్మమ్మ తేపతేపకు ముక్కు తుడుచు కొంటూ ఎద్దు దగ్గిరనే నిలబడింది. గెడ్డం కింద కర్రలు పోటించి, మాదిగ లిద్దరూ చూస్తూ నిలబడ్డారు.

గుంటలు కట్టిన నేత్రాలు రెండూ ఒక్కసారిగా, నల్లగుడ్లు మరుగు పడేటట్టుగా గిర్రున తిప్పాడు వెంకన్న. రమణయ్య తన రెండు కళ్లూ విప్పి ఎద్దు కళ్లలోకి చూశాడు. నిలబడిన ఆ ఎద్దు ముందు కాళ్ళు రెండూ ముడిచి కింకిది మోకరించింది. దాని మెడ విడవ కుండానే రమణయ్య కూడా మోకరిల్లాడు. ఎద్దు నంది వాహనం లాగ పండుకొన్నది. ఎద్దు తల తన ఒడిలో పెట్టుకొని కూర్చున్నాడు రమణయ్య. ఎద్దు కళ్ళు రెండూ మూసేసింది.

———

# 2. పొగడదండ

—కొమ్మూరి పద్మావతీ దేవి

"సీతా ! సీతా ! " అంటూ పున్నమ్మ వీధి గుమ్మంలో నిలబడి అటూ ఇటూ చూస్తూ పిలుస్తోంది.

"అబ్బబ్బ ఏంపిల్ల ! అందరూ వస్తారేగాని, అర ఘంట అయింది, ఇదిమాత్రం రాదే ! ఏమే ! సరోజా ! మా సీత కనపడిందా ?"

ఆ కేక విని ఎదురింటిలో వున్న సరోజ "వస్తోందండీ" అంటూ లోపలికి చక్కా పోయింది. ఏం వస్తుందో ! రానీ చెప్తాను అంటూ విసుగ్గా వంట ఇంట్లోకివెళ్ళింది పున్నమ్మ.

సీతకి పధ్నాలు గేళ్లు, అందమయింది. అమాయికురాలు. చిన్న తనంలోనే తల్లీ తండ్రీ పోవడంవల్ల మేనత్త పున్నమ్మ దగ్గరే పెరుగుతూంది. పున్నమ్మ పంచప్రాణాలు సీత మీదే పెట్టుకుంది. తనకి ఉన్న ఆస్తి సీతకి ఇచ్చి వో ఇంటిదాన్ని చేసి మరీ ప్రాణాలు వదలాలని పున్నమ్మ ఆఖరు కోరిక.

ఒక చేత్తో పుస్తకాలూ, ఇంకో చేత్తో ఏదో కాగితము పొట్లమూ పట్టుకుని ఒక్క పరుగున వచ్చింది సీత. "ఏమిటే ఇంత సేపు ? " అంది కోపంగా పున్నమ్మ.

"ఎంత సేపయిందేం ? వస్తూనే ఉన్నాను." అంటూ పుస్తకాలు కింద పెట్టే లోగా చేతిలో పొట్లం జారింది.

"అవేమిటే ?"

"పూలు"

"ఏం పూలు"

"పొగడ పూలు"

ఆ మాటతో అత్తకోపం చల్లారింది. "ఇవి ఏరుకుంటూ కూచున్నావా ! నీ కోసం ఎంత సేపటినుంచో చూస్తున్నాను," అంది. అత్త మాటలు వినకుండానే "ఆకలే ! ఏం చేశావు ?" అంది సీత. ఆకలనగానే పున్నమ్మ ఆలస్యం అంతా మరచి పోయి వంటింట్లోకి పిలుచుకు వెళ్ళింది.

౨

ఆ నాడు మొదలు ప్రతి రోజూ సాయంత్రము సీత బడినుంచి ఆలస్యంగా రావడము పొగడ పూలు తేవడము ప్రారంభించింది. ''ఎక్కడివే ఇన్ని పూలు'' అంది పట్టలేక పున్నమ్మ ఒకసారి.

''ఆంజనేయులు గుడిలో చెట్టు ఉంది అత్తా,'' అంది ఆలోచనగా సీత.

''నువొక్కదానివే ఏరుతున్నావా.'' అంది కళ్లెర్రచేసి పున్నమ్మ.

ఇంతలో ఎదురింటి సరోజ ''సీతా! రేపటి పాఠాలు ఏం చదవాలో చెబుదూ,'' అంటూ ఇద్దరి మధ్యన చతికిల పడింది. అత్త మాటలకి అడ్డు వచ్చింది కదా అనే సం సంతోషంతో సీత నవ్వింది. ''సరోజా ! నువ్వూ ఏరుతున్నావా?'' అంది పున్నమ్మ మళ్ళీ, ''లేదత్తా ! సీత మాత్రం ఏరిందా ?'' అంది సరోజ. ఆ మాట విని సీత కళ్లెర్ర చేసి చూసింది సరోజని. ''దానికిష్టం ! తెచ్చుకుంది'' అంటూ మాట మార్చింది సరోజ.

పున్నమ్మ అలా వెళ్లగానే సీత నవ్వుతూ ''నా కిష్టం గనుక తెచ్చుకున్నాను, నువ్వూ అత్తతో పాటు అడ్డు తగులుతావా ?'' అంది. అది కాదే ! పూలు వద్దన్నావా, అతనివ్వడాన్నిగాని ! నీకు తెలియదుగాని ఈ ఊరికంతా పెద్ద రవుడీ అతను, నీకు తెలుసా?'' అంది సరోజ.

ఆ మాట విని ఉలిక్కి పడింది సీత , చేతిలో పూల దండ జారింది.

''రేపు ఇస్తే వద్దని చెప్పు,'' అంటూ లేచింది సరోజ.

''చదువుకోండి,'' అంటూ కేకలేస్తూ పున్నమ్మ వచ్చింది.

౩

ఆ రాత్రి ఆలోచనలతో సీతకి నిద్ర రాలేదు. మర్నాడు సీత బడినుంచి వస్తూ మధ్య మధ్యన ఎవరూ రావడమూ లేదు గదా అనే భయంతో వెనక్కి చూస్తూ వస్తూ ఉండగా, ఎవరో పక్కగా వచ్చి, ''సీతా!'' అనగానే అదిరిపడి చూసింది. ఇంత చనువుగా తన్ను పేరు పెట్టి పిలిచిన అతన్ని చూడగానే మరింత భయ పడింది. సరోజ చెప్పిన రవుడీ అతనే గదా అని జ్ఞాపకం వచ్చి వణుకుతూ అతన్ని చూసింది. ఆ తొందరలో చేతిలో పుస్తకాలు చిందర వందరగా రోడ్డుమీద పడ్డాయి''

పుస్తకాలన్నీ తీసి సీత చేతికి అందించాడు అతను.

''ఇవిగో పూలు సీతా ! సంపెంగలుకూడా,'' అన్నాడు నవ్వుతూ.

అతని నవ్వు ముఖాన్ని చూడగానే సీత భయం పోయి కళ్ళు పెద్దవి చేసి తేరి పార చూచింది ! మళ్ళీ సరోజ మాటలూ, అత్త అరుపులూ జ్ఞాపకానికి వచ్చి 'వద్దు అంది' మెల్లిగా, ముందుకు అడుగువేస్తూ.

"ఎందుకు వద్దూ" అంటూ పూల పొట్లం చేతిలో పెట్టాడు అతను. మనస్సులో తీసుకోవాలని ఉన్నా చెయ్యి వెనక్కి తీసింది. "వద్దు వద్దు" అంటూ లొందరగా తోసుకు వెళ్లడంలో, కాగితం చిరికి పూలన్నీ కింద పడిపోయాయి. ఆ పూల మీద నుంచే పరుగెత్తుకు వెళ్లింది సీత. ఆ ధూళిలో సీత కాలికింద నలిగిన సంపెంగను మాత్రం అతను తీసుకుని నిట్టూరుస్తూ వెనక్కి వెళ్లాడు.

೪

ఆ ఊరికంతా శంకరం అంటే హడలు, ఇరవై ఏళ్లే ఉన్నా 'పెద్ద రవుడి' అని అతనికి పేరు. వీథిలో వస్తున్నాడా అంటే ఆడ పిల్లలికి భయం. శంకరం అంత దూరంలో ఉండగానే, అతని అత్తరు వాసన గుర్తించి వాళ్ళు తప్పుకునే వారు. ఏం చేశాడో ఏం చేస్తాడో, ఎవరూ చెప్పరు, గాని శంకరం అంటే మాత్రం ఎవ్వరికీ మంచి లభిప్రాయం లేదు. వో రోజు గుడి పక్కగా వెళ్లుతూ పొగడ చెట్టు కింద పూవులు ఏరుకుంటున్న సీతని చూడగానే అక్కడనుంచి వెళ్లలేక అలాగే చూస్తూ నిలబడి పోయాడు.

ఆ రోజు నుంచి సీత పూలు ఏరుకునే వేళకు సరీగ్గా అతనూ ఆ పక్కగా వచ్చి సీత అక్కడనుంచి కదిలే వరకూ చూశేవాడు.

ఒకరోజు సాయంత్రము సీత పూలు కోస్తూ ఉండగా, కంట్లో ఏదో పడి బాధ పడడము చూశాడు శంకరం. ఇంక దూరంగా ఉండలేక దగ్గరగా వెళ్లి "ఏంపడింది" అన్నాడు మెల్లిగా జంకుతూ, అతన్ని చూసి సంకోచించకుండానే "కంట్లో ఏదో పడింది' అంది సీత లేని నవ్వు తెచ్చుకుని.

"ఏదో! ఊదుతాను పోతుంది" అంటూ తల పట్టుకుని కన్ను తెరవమని ఊదాడు శంకరం. ఎలాగయితేనేం కంట్లోంచి ఒక చిన్న చీమను బయటికి తీస్తూ "ఇంత పెద్ద కళ్లయితే పడతాయి," అన్నాడు నవ్వుతూ శంకరం. సీత సిగ్గు పడింది, అతను కోసి ఇచ్చిన పూలన్నీ తీసుకుంది. ఎందుకోగాని అతనంటే తెలియని ఇష్టం ఏర్పడ్డది. ఆ రోజునుంచీ అతను పూలు ఇవ్వడము సీత పుచ్చుకోవడమూ అలవాటయింది. అంచేత 'వద్దు' అని ఆ సాయంత్రం సీత వెళ్లగానే శంకరం ఆ చెట్టు కిందే చతికిలబడి ఆలోచనలు ప్రారంభించాడు.

ప్రతి సాయంత్రం సీత నవ్వుముఖము చూడందే అతనికి నిద్ర పట్టేది కాదు.

త్వరగా సాయంత్రం అయేదాకా చిరాకు పడిపోయేవాడు. అలాంటిది సీత అలా వెళ్లగానే, సీతకూడా అందరిలాగే అతన్ని చెడ్డవాడని అనుకుంటుందని ఆఖరుకి నిశ్చయిం చుకున్నాడు. ఆ దురభిప్రాయం పోగొట్టాలని అనుకుంటూ ఇంటికి వెళ్లాడు.

౫

సీత ఇంటికి రాగానే పూలు తేనందుకు పున్నమ్మ సంతోషించింది. సీత మాత్రం చిరాకుగానే ఉంది. ఆలోచనగా పడుకున్న సీతని దగ్గరగా వచ్చి పలకరించింది సరోజ.

"అన్నట్లు పూలు ఇచ్చాడా ! ఏం జరిగింది ! ఏ మన్నావు ?" అంటూ సరోజ ప్రశ్నల వర్షం కురిపించింది చెవిలో.

"వద్దన్నాను," అంటూ దిండులో ముఖం దాచుకుంది సీత.

"ఏడుస్తున్నావేమిటే, నిన్నేమన్నా చేశాడా ?" అంది సరోజ భయంతో. "నీ మొహం అతను చాలా మంచివాడు" అంటూ ఆ మాటలు మరిపించి పంపింది సరోజను.

దాచుకున్న దండలన్నీ తీసి తెల్లవారగానే చూసుకుంటున్న సీతని పున్నమ్మ గుడికి రమ్మంది. సీత జంకుతూ పున్నమ్మ వెనకలే అడుగులు వేస్తూ ఒక వేళ అతను వచ్చి పలకరిస్తాడేమో అన్న బెదురుతో వెళ్ళింది.

౬

పున్నమ్మ గుడి లోపలికి వెళ్లింది. సీత మాత్రం పొగడ చెట్టు కిందికి వచ్చి, కిందటి రోజు పూలన్నీ కిందపడిన చోటు గుర్తించి, వాడి పోయి మన్నులో కలిసిన పూలని చూస్తూ, అందులో వదిలిపోయి రెక్కలు విరిగిన సంపెంగ కాలికి తగలగానే "ఇవిగో సంపెంగలు," అన్న అతని మాటలు తలుచుకుని, అటూ ఇటూ చూసి, ఆ సంపెంగ తీసి, తల్లో పెట్టుకుంది.

"రావే పోదాం," అంటూ పున్నమ్మ పిలవగానే కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి వెళ్ళి పోయింది.

శంకరం అక్కడే ఉన్న మొండి గోడ మీద పొగడ చెట్టు గుబురు వెనకాలనుంచి సీతని చూస్తూనే ఉన్నాడు.

ఆ రోజు బడినుంచి మామూలు దారిని గుడి పక్కగా కాక, ఇంకో దారిని వస్తుంది సీత. వో సందు మలుపు తిరగగానే శంకరం ఎదురయ్యాడు. అతన్ని చూడగానే అదుర్దాగా మూలగా ఒదిగి నిలబడింది. ఆ కంగారులో చేతిలో పుస్తకాలు జారి పక్కనే ఉన్న కాలవలో పడ్డాయి. "అయ్యో!" అంటూ తీయబోయింది సీత.

"వద్దు నేను ఇస్తాను, ఉండు," అని శంకరం ఆపాడు.

"పుస్తకాలన్నీ బురద అయ్యాయి, అత్త తిడుతుంది" అంటూ, ఇంక మాటా డలేక బావురుమంది సీత. ఆ సందులో వెళ్తున్న ఒకరిద్దరు ఆగారు సీత ఏడుపు విని.

"ఇలారా !" అంటూ సీత చెయ్యి పట్టుకుని ఆ సందులోంచి అవతలకి పిలుచుకు వెళ్లాడు శంకరం. అతను రమ్మనగానే బెరుకు లేకుండా కూడా వెళ్లింది సీత. ఆ దగ్గిర లోనే ఉన్న వో గుడిసెలోకి పిలుచుకు వెళ్ళి, "వెంకన్నా!" అని పిలవగానే అరవై ఏళ్ళ ముసలి అతను "బాబయ్యా!" అంటూ అతి భయ భక్తులతో వచ్చి శంకరం ముందు నిలబడ్డాడు. ఆ సందులో కాలువలో పుస్తకాలు తెమ్మని శంకరం అతన్ని పంపాడు.

ఇంక సీత ఏడుపు మాత్రం ఎక్కువయిందే గాని తగ్గలేదు. కళ్ళు వాచిపోయాయి. శంకరం ఎంత వోదార్చినా సీత సమాధానపడలేదు సరికదా ముఖం మీాద చేతులు కుని ఏడుస్తూంది.

"సీతా ! ఇలా చూడు ! అబ్బా ఏడవకు ! నీకు పుస్తకాలు తెచ్చి ఇస్తాగా, నవ్వు! నవ్వవూ? నవ్వాలి," అంటూ శంకరం లాలించడం మొదలు పెట్టాడు.

"కొత్తనా?" అంది సీత అతన్ని చూసి.

"దొంగ! ఇలా చూడు! ఒక్క సారి నవ్వు, చాలు. ఏదీ?" అని శంకరం చేతులు పట్టుకున్నాడు.

'ఊహుఁ' అని తల తిప్పింది సీత.

"ఏదీ నా సంపెంగ, నీ జుట్టులో ఉంది కాదు!" అన్నాడు. ఆ మాట వినగానే ముసిముసి నవ్వులు నవ్వింది సీత. సగం మన్ను అయిన పుస్తకాలని తీసుకు వచ్చాడు వెంకన్న. అవన్నీ తుడిచి చేతికి ఇచ్చి, ఇంటికి వెళ్ళమన్నాడు శంకరం.

సీత నవ్వుతూ గుడిసె ముందుగానే "వెంకన్నా అందాకా వెళ్ళూ" అని సీత దగ్గిరగా వచ్చి జేబులో దాచిన పూలు చేతికి ఇచ్చి. "వద్దనకు, నే నివ్వనులే వెంకన్న ఇస్తాడు ఏం ?" అంటూ సాగనంపాడు శంకరం.

ఆలస్యానికి ఏదో సాకులు చెప్పి పుస్తకాలు బురదలో జారాయని అబద్ధాలు చెప్పింది అత్తకి సీత. "అబ్బా వాడిన కొద్దీ వాసన అత్తారు పూలు ! నా గది అంతా వాసనే" అంది సీత ముందుగా తానే, అవును అంటూ ఆ సంగతే మరచిపోయింది. పున్నమ్మ శంకరం చెడ్డవాడు కాదని అబద్ధాలు ఆడిందనీ, సీత నిశ్చయించుకుంది.

"నే నివ్వనులే, వెంకన్న ఇస్తాడు," అన్న అతని మాటలు మరీ మరీ తలుచుకుని లోలోపల పొంగిపోతూ అతనెంత మంచివాడో అనుకుంది.

౭

సీతకి కష్టం కాగూడదనే నిశ్చయంతో శంకరం వెంకన్న ద్వారా సీతకి పూలు అందజేస్తున్నాడు, స్నేహితురాలు ఇచ్చిందని అత్తతో చెప్పేది సీత, సరోజ మాత్రంసీతని

వో కంట కనిపెడుతూనే ఉన్నది. అత్తకి చెప్తానని సరోజ సీతని అప్పుడప్పుడూ బెదరించేది కూడాను. బతిమాలుకుని ఈ సంగతి బయటపడకండా చేసుకుంది సీత. ఇలా ఒక వార మయే సరికి పూల దండలతో పెట్టె నిండి పోయింది. సీత మనస్సుని మాత్రం ఏదో భాధిస్తూనే ఉంది.

ఒకనాటి సాయంత్రం దండ తీసుకుంటూ వెంకన్నని అడిగింది సీత "బాబుగా రున్నారా ?" అని.

"జ్వరంగా ఉందమ్మా," అన్నాడు.

"ఎన్నాళ్లనించీ," అంది ఆదుర్దాగా.

"రెండు రోజుల్నించీ," అంటూ వెళ్ళాడు వెంకన్న.

పూల దండ చేత్తో తిప్పుతూ ఆలోచనలతో సీత ఇంటికి వచ్చింది.

గుమ్మంలో సరోజ నిలబడింది.

"మరీ చిత్రంగా మారి పోయావే సీతా ! మా యింటికి రావడమే మానేశావు ?" అంది సరోజ చేతులు తిప్పుతూను, జవాబు చెప్పకుండానే సీత ఇంట్లోకి వెళ్లి పడుకుంది.

"ఆ శంకరం కోసమే ఈ బెంగంతా ?" అని సరోజ మెల్లగా సీత చెవిలో అంది.

"ఊరుకోవే, ఎప్పుడూ ఇదే గొడవ," అని సీత విసుక్కుంది.

"ఎందుకలా ఉన్నావు ?" అత్తతో చెప్పనా ! చెప్పనులే, పూలు ఇవ్వలేదా ఇవాళ ?" అని నవ్వుతూ సరోజ వెళ్ళిపోయింది.

ఎందుకో జడ రిబ్బను తీసి ముక్కలు ముక్కలుగా చించి పారేస్తూ సీత కూచుంది ?

౮

మామూలు వేళకి వెంకన్న సీతకి పొగడ దండ అందించాడు. సీత ఉండలేక "బాబు గారికి జ్వరం తగ్గిందా ?" అంది మెల్లిగా.

"తగ్గిందమ్మా గుడికి వస్తారు రేపు సాయంత్రం," అంటూ వెంకన్న వెళ్ళి పోయాడు.

ఎప్పుడు వస్తారో అడగ లేదే అనుకుంటూ ఇంటి దారి తీసింది సీత.

అత్తకోసం దీపం దగ్గిర కూచొని పుస్తకం తీసింది. కాని చదవాలని దృష్టి ఉంటేగా ! ఆ రాత్రి చదువు లేదు, నిద్రా లేదు. మర్నాడు సాయంత్రం మామూలుగా అత్తకి అబద్దాలు చెప్పి గుడికి దారి తీసింది. సీతకోసం చూస్తున్న శంకరం ముందుకు వచ్చి కోనేరు వైపు దారి తీశాడు. అక్కడ చిన్న అరుగు మీద కూచున్నారు. సీత సందేహిస్తూ నిలబడింది.

"కూచో సీతా ! కూచోవూ, నా సంగతి అడిగావని విని వచ్చాను. జ్వరం తగ్గలేదు. ఇంకా తెలుసా ! అడిగావా సీతా ? " అన్నాడు నవ్వుతూ "అడిగాను," అంటూ అతని పక్కనే సీత కూచుంది. జేబులోంచి పొగడ దండ తీసి శంకరం సీత ఒళ్ళో పెట్టాడు. సీతకి ఒళ్ళు తెలియ లేదు. ఎందుకీశంకరంషర్టు చేతి గుండీలని తిప్పుతూ అతని కళ్లలోకి చూసింది.

"సీతా ! నన్ను మరచిపోవు కాదూ ?"

"త్వరగా వెళ్లాలి. అత్త కోపడుతుంది," అంది సీత.

"ఒక నిమిషం ఇలానే కూచో సీతా ! ఇలా దగ్గిరగా, సీతా ! నువ్వంటే నాకెంత ఇష్టమో తెలుసా ?"

"అతని చేతిని దగ్గిరగా తీసుకుంది. సీత ఆ మాట వినగానే ఏమయిపోయాడో శంకరం, సీతని మరీ దగ్గిరగా, దగ్గిరగా తీసుకుని "నీవు ఇంకెవ్వరినీ పెళ్ళి చేసుకోకూడదు సీతా," అన్నాడు శంకరం.

ఇంతలో ఏదో అలికిడి అయి సీత లేచి తొందరగా ఇంటివైపు నడిచింది. ఇంటి పనులన్నీ ఆ రాత్రి ఎప్పటికంటే ముందే ఎంతో బాగా చేసి సీత అత్త దయ సంపాయించుకుంది.

౬

పున్నమ్మ అసాధ్యురాలు . ఎలా పసికట్టిందో ఏమో, ఎవరన్నా చెప్పారో ! స్వగ్రామమైన సంతమాగులూరిసికి ప్రయాణం కట్టింది. సీత గుండెల్లో రాయి పడిపోయింది.

ఏం చేస్తుంది ?

ఆ సాయంత్రం శంకరాన్ని కలుసుకుంది. తనఊరి ప్రయాణం సంగతి ఎత్తలేదు. చెబితే బాధ పడతాడని, ఆపుతాడనీ అల్లరవుతుందనీ అతని అప్పటి స్థితి చూడలేకో అంతబాధా తానే అనుభవించి ఊరుకుంది.

శంకరానికి మాత్రం ఏం తోచిందో ? "ఏం సీతా ఇవాళ అలాగ ఉన్నావేం ?"అని అడిగాడు.

"ఏమీలేదు," అని ఇంక ఉండగట్టలేక సీత ఏడవడము మొదలెట్టింది.

ఏమీ అర్థం కాక శంకరం మళ్లీ మళ్లీ అడిగాడు బతిమాలుకున్నాడు, బుజ్జగించాడు.

"రేపు రెండు దండలు తెస్తాను తెలుసా ! ఒకటి నేను నీ మెళ్లో వేస్తాను ! రెండవది నీవు నా మెళ్లో వేయాలి,!" అన్నాడు శంకరం నవ్వుతూ. సీత నవ్వి అలాగే అంది.

ఆ కొత్త చీకట్లో ఆ నవ్వులో వెలితీ వేదన శంకరానికి కనపడలేదు.

"సీతా ! రేపు వస్తావు కాదూ, త్వరగా రా ?"

"ఆ".

౧౦

సంతమాగలూరులకి తాతగారి ఇంట్లో తోచకుండా ఉంధి సీతకి.

ఎప్పుడు పెండ్లి సంబంధాలు సంగతే ఇంట్లో అందరూ మాట్లాడుకోవడం చూసి సీతకి మరీ మతిపోవడము మొదలు పెట్టింది.

సీత మనస్సులో బాధ గుర్తించే వారెవరు ? గుర్తించినా తీర్చేవారెవరు ?

అనుకోకుండానే పెండ్లి చూపులు జరిగాయి. పెండ్లి కొడుకు ఎవరైనా సరే అన్న నిశ్చయంతో నిస్పృహతో కొయ్యబారి పోయింది సీత.

"మా సీత అమాయికురాలు, మంచి ఇంట్లో పడుతుంది" అంటూ పున్నమ్మ అందరితో చెప్పింది.

పెండ్లి నిశ్చయమయిందని తెలియగానే సీత మరీ బెంగ పెట్టుకుంది. హడావిడిగా ఒక్క రోజులో సీత పెళ్ళి జరిగింది. ఎలా జరిగిందో ఏమిటో ఏం తెలియకుండా యంత్రపు బొమ్మలాగా పున్నమ్మ ఏం చేయ మన్నా చేసింది సీత. పొగడ దండమాత్రం తలలో పెట్టుకుంది , పెళ్ళికొడుకు కాస్త చదివిన వాడు, బాగా డబ్బు కలవాడు, అదే పున్నమ్మకి కావలసింది.

"అబ్బ ! మూడు ముళ్ళూ పడ్డాయమ్మా మా సీతకి," అంటూ చాటంత ముఖంతో ఆనంద పడింది పున్నమ్మ. సీత అత్తవారి ఇల్లు తాతగారి ఇంటి దగ్గిరే అని బంధువులు అందరూ మరీ సంతోషించారు.

ఆస్తి ఉందిగాని పెళ్ళికొడుకు పిల్లకు తగినవాడు కాదు. అదీ గాక ముప్ఫయి ఏళ్ళు ఉన్నాయని అందరూ చాటుగా అనుకున్నారు.

"నీకు నచ్చిన వాడిని తెచ్చానా ? మోయలేనన్ని నగలు," అంది పున్నమ్మ వోరోజున సీతతో.

"మన ఊళ్ళో సెట్టిలాగున్నాడు," అంది సీత తలవంచుకుని. ఆ మాటకు ఆ రోజంతా గింజుకుంది పున్నమ్మ.

వంటెడు నగలతో, పట్టు చీరెతో సీత కళకళలాడుతూ కనపడింది అందరి కళ్ళకీని.

"ఎంత నెమ్మది, వంచిన తలే ఎత్తదమ్మా !" అనుకున్నారు అత్తవారు. ఎవరు ఎన్ని అనుకున్నా మంత్రాలతో ఎన్ని ముళ్ళు వేయించినా సీత మనస్సులోంచి శంకరం పోలేదు. అతను భర్త కాలేదనే లోబాధతో లోలోపల కృషిస్తూనే ఉంది సీత.

పెళ్ళి అయిన మూడు నెలలకి మళ్ళీ గుంటూరుకి సీతని పిలుచుకువచ్చింది. పున్నమ్మ. ఊరుచేరిన ఉదయం సరోజ ఇంట్లోనే ఉండిపోయారు. పెళ్ళి కబుర్లన్నీ పున్నమ్మ సంబరంతో ఇరుగు పొరుగు వారికి చెప్పింది. సరోజ మాత్రం సీతని చూడగనే గ్రహించింది. సరోజ ఇంకా బడికి వెళుతూన్నందుకూ సీత సంతోషించింది.

ఎవ్వరూలేని సమయం చూసి సీత సరోజని అడిగింది.

"అతను ఎప్పుడన్నా కనిపించాడా, సరోజా ?"

శంకరం అని గ్రహించి సీత దగ్గరగా వచ్చి రహస్యంగా "కనిపించడంమేమిటే ? బడిచుట్టూ తిరిగి తిరిగి పాపం చివరకి ఆ పొగడ చెట్టు కింద కూచుంటున్నాడు."

"నిజంగా ?" అంది ఆదుర్దాగా సీత.

"నీకు పెళ్లయిందని తెలుసు. ఎవరు కనిపించినా సరే 'నా సీతకి పెళ్ళయిందా ? ఇవిగో దండలు,' అంటూ పిచ్చిగా తిరుగుతున్నాడు.

"తిరగడమే?" అంది సీత కన్నీళ్ళతో.

"తిరగడమేమిటి ! ఇల్లువాకిలి అంతా వదలి ఆ చెట్టుకింద పడివుంటున్నాడు. ఎవ్వరూ ఆ పక్కకే వెళ్ళరు. అందరికీ భయం అతనంటే," అని సరోజ తల వంచుకుంది.

సీత ఇంక వినలేక సరోజ ఒళ్ళో పడి ఏడ్చింది.

ఎలా సమాధాన పరచాలో తెలియక సరోజ కూడా ఏడుపు ప్రారంభించింది.

"మూడు నెలలకే అంత ఏడుపులా ? ఆడ పిల్లలు కారు లే !" అంటూ పున్నమ్మ వచ్చింది.

ఆ రోజంతా సీత లేవలేదు. సరోజకి తప్ప సీత బాధ ఇంకెవరికీ తెలియదు. ప్రయాణపు బడలిక అని పున్నమ్మ అనుకుంది.

○○

సీత శంకరాన్ని చూడాలనే ఆశతో "గుడికి వెళతాను, అత్తా," అంది.

"ఒక్కదాని వీనా ? వద్దు పిచ్చివాడున్నాడుట, అందరం వెళదాంలే," అంది పున్నమ్మ. ఆ మాట విని నీరైపోయింది సీత.

ఆ సాయంత్రం మూడు గంటలకి పళ్లెంలో పూలు, పళ్ళు, కొబ్బరి కాయ పెట్టి సీత చేతికి ఇచ్చి సరోజతో పున్నమ్మ గుడికి వెళ్ళింది.

పొగడ చెట్టు కింద వంగి నేల మీద పూలు గుచ్చు తున్న శంకరాన్ని సీత చూసింది. "అతనే," అని సరోజ చేయి చూపించింది.

నేలమీద మన్నంపాతా పూలు అనుకొని పోగు చేస్తున్నాడు శంకరం.

"అడుగో పిచ్చివాడు త్వరగా రండి," అంది పున్నమ్మ తొందరతో.

ఆ మాట విని సీత చేతిలో పళ్లెం వదిలేసింది. పళ్లెం చప్పుడుతో శంకరం తలెత్తి చూశాడు.

కిందపడిన పూలు తీస్తు పున్నమ్మ సీతను విసుక్కుంటూంది. సీత మాత్రం శంకరాన్ని తప్ప ఇంకేమీ చూచే స్థితిలో లేక అలానే నిలబడిపోయింది.

"మతిపోయిందా కదలదేం ? పదండి," అంది పున్నమ్మ. పున్నమ్మ కేకతో శంకరం ముందుకు వచ్చి.

"ఆ . . . . నావి ఆ పూలన్నీ. ఏరకండి. చంపేస్తా," అంటూవచ్చాడు.

"తీసుకో నీవయితే," అంటూ వణికింది పున్నమ్మ. సరోజ పున్నమ్మ వెనకాల దాక్కుంది.

"ఈ చెట్టు పూలన్ని నావి," అంటూ కింద పూలు మన్ను అంతా పోగుచేస్తూ శంకరం సీత పాదాలని చూసి లేచాడు.

"నా సీతకి పెళ్ళయిందా?" అన్నాడు పెద్దగా నవ్వుతూ. ఆ నవ్వుతో అందరూ భయపడి ముందు అడుగు వేశారు. సీత మాత్రం కదలకండా నిలుచుంది అతన్ని చూస్తూను.

శంకరం దగ్గిరగా వచ్చి, "నా సీతవా నువ్వు?" అన్నాడు చెయ్యి పట్టుకుని.

పున్నమ్మ "అయ్యో రావే" అని అరిచింది. ఆ అరుపుతో అందరూ గుంపు కూడారు.

"నా సీతవే ! ఇవిగో పూలు, ఎన్నో వున్నాయి ఇంకా. ఇవిగో రెండు దండలూ నా మెళ్లోనే ఉన్నాయి," అంటూ అక్కడ ఉన్న మన్ను, గడ్డి అంతా సీత తలనిండా పోశాడు శంకరం.

"రావే రావే కదలవేం," అని పున్నమ్మ ఏడుపు ప్రారంభించింది. పున్నమ్మ అరుపులు విని శంకరం సీతని ఎత్తుకొని కోనేటి దగ్గిరికి పారి పోయాడు. సీత రెండు చేతులతో అతని కంఠాన్ని చుట్టి వేసుకుంది. తిన్నగా ఆ గట్టు దగ్గరికి వెళ్ళి ఆ రాయిమీదే కూచుని తన ఒళ్ళో సీతని దాచుకున్నాడు శంకరం.

ఇంతలో జనం మూగారు. అరుస్తున్నారు.

పున్నమ్మ "రావే తల్లీ !" అని ఒకటే ఏడుపు.

ఆ గోల వినకుండానే "ఏదీ ! నవ్వు సీతా ! వచ్చావా?"

ఇవిగో రెండు దండలు. ఒకటి నాకు వెయ్యి !" అంటూ సీత ముఖం నిండా

ముద్దులతో నింపేశాడు శంకరం. సీత భయంతో "వదులు, వాళ్ళు కొడతారు నిన్ను," అని ఒర్పొంచి లేవపోయింది.

"ఆ నిన్ను వదలను. నా సీతవి, నా కోనేరు, నా కోనేరు, నా చెట్టు వెళితే రాను," అంటూ మరీ దగ్గిరగా గట్టిగా తన చేతుల్లో బిగించుకుని గుండెలకి అదుముకుని వెర్రి సంతోషంతో ఉన్నాడు శంకరం.

పోలీసులు, జనము అంతా గుంపుగా అతని చుట్టూ చేరారు. ఆ పెద్ద గుంపు చూసి సీత అతని చేతుల్లోంచి తప్పించుకుని ధబాలుమని కోనేటిలోకి దూకింది. జనం అంతా నీటిఒడ్డుకి చేరారు గాని సీత మాత్రం తేలలేదు. పుష్పమ్మ ఏడుపుతో కోనేరంతా ప్రతిధ్వనించింది. అంతేగాని సీత మాత్రం దొరకలేదు.

పిచ్చి శంకరం మాత్రం ఎప్పుడూ నవ్వుతో ఆ పొగడ చెట్టు కిందే కూచుని కోనేటి వంకే చూస్తూ ఉంటాడు. ఎంత మంది ఎన్ని చిన్న రాళ్ళు రువ్విన హేళన చేసిన శంకరం పొగడ పూల దండలు కట్టడం మాత్రం మానలేదు, ఇంకా సీత వస్తుందనే అతని ఆశ !

# 3. శకుంతల పునరాగమనం

కన్నడమూలం : శ్రీ 'శ్రీనివాస'

అనువాదం : తిరుమల రామచంద్ర

['మాస్తి', 'శ్రీనివాస' పేర్లతో కన్నడుల అభిమానాన్ని చూరగొని, 'కన్నడ కథా పితా మహుడ' ని ప్రసిద్ధి గన్న రాజ సేవాసక్తి శ్రీ మాస్తి వెంకటేశ అయ్యంగారు జూన్ 7వ తేదీన కోలారు జిల్లా మాస్తి అనే గ్రామంలో జన్మించారు. మైసూరు సివిల్ పరీక్షలో ఉన్నత స్థాయిలో కడతేరి, 1914 లో అసిస్టెంటు కమిషనర్ (అసిస్టెంటు కలెక్టర్)గా నియమించ బడ్డారు. సుమారు 30 సంవత్సరాల పాటు మైసూరు ప్రభుత్వంలోని వివిధశాఖలలో ఉన్నతాధికారిగా పనిచేసి, ఉద్యోగం నుంచి విరమించారు. జీవన వృత్తి ప్రభుత్వోద్యోగమైనా సాహిత్యం వీరి జీవితమైంది. ఏదో వినోదం కోసం పూనుకున్న సాహిత్యోద్యమం నేడు ఆయన జీవితాన్నంతా ఆవరించింది. ప్రతిభ, అభ్యాసం లేక వృత్తి పరిశీలనం—ఈ మూడు వీరి రచనల్లో ముప్పిరి గొని, ముచ్చటగా గోల్పుతాయి.

శ్రీ మాస్తి ముఖ్యంగా కవుకులు. కన్నండలో చిన్న కవుల పితామహులని ప్రసిద్ధి కొన్నవారు. కాని, వీరు చేపట్టని సాహిత్య శాఖ లేదు. భావగీతాలు, కావ్యనాటక విమర్శ. ప్రబంధం నవల, యుదాలాపల, జీవిత చరిత్ర—అన్నిటిలోను సిద్ధ హస్తులు. కేవలం భావ గీతాలు వ్రాసి పేరు పొందిన వారున్నారు: చిన్న కథలు, నవలలు వ్రాసి ఖ్యాతి పొందినవారున్నారు : నాటకాలు రచించి వాసిగన్నవారున్నారు — కాని అన్ని సాహిత్య రీతులను రచనలు చేసి గుణంలోను, గణంలోను సిద్ధి పొందిన ఇద్దరు కన్నడ మహా కవులలో వీరొక్కరు.

వీరు పెక్కు సంవత్సరాలు "జీవన" అనే కన్నడ మాస పత్రికను నడిపి కన్నడ సాహిత్య పరిషత్తు అధ్యక్షులుగా ఉండి, కన్నడ ప్రాంతం మూరు మూలల కూడా పేర్కొనిరి, కన్నడపు కస్తూరి గుమ గుమలను ప్రచారం చేసి, కర్నాటక ఏకీకరణకాదాళిని మోగించారు, కన్నడ వీరాభిమానిగా పెక్కు రీతుల కన్నడ దేశ భాషలకు సేవచేసి, కన్నడుల కృతజ్ఞతకు పాత్రులు అయ్యారు. కర్నాటక విశ్వ విద్యాలయం వీరి ప్రతిభా పాండిత్యతకు మెచ్చి డాక్టరేట్ బిరుదముతో సన్మానించిరి.]

మాలినీ నదీ తీరంలో కణ్వ మహాముని ఆశ్రమ సమీపం. హస్తినా పురినుంచి ఆశ్రమానికి వచ్చే వారిలో ఇద్దరు యువతులు నెమ్మదిగా మాట్లాడుకుంటూ, ఆశ్రమం నుంచి నడిచి వెళ్లుతున్నారు. వారిలో ఒక యువతి "ఈ దినమన్నా వస్తుందో రాదో ! ఈ వేళకు రావలసిందే", అన్నది. మరొక యువతి "సామాన్యమా ! గొప్ప రాజ్యానికి

రాణి గదా ! అన్నిటిని సర్దుకొని రావడం సులభమా ? ఈ వేళ కాకపోతే రేపైనా వస్తుంది వస్తుంది." అన్నది. మొదటి యువతి "మన శకుంతలను చూద్దామని నాకు మహా ఆశగా ఉంది. చూచి ఏడేళ్ల పైనే అయింది కదూ ! ఇప్పుడెలా ఉందో ! అబ్బాయినైతే మనం చూడనే లేదు." అన్నది. ఆమె జతగత్తె "నాకు చాల ఆశే. ఈ ఏడు సంవత్సరాలూ ఆమెను ఎన్ని సార్లు కలల్లో చూశానో! మన శకుంతల కూడ మనను తప్పకుండా ఎన్నోసార్లు తలచుకొనే ఉంటుంది." అన్నది.

మొదట మాట్లాడిన యువతి అనసూయ: రెండవ యువతి ప్రియంవద. వారిద్దరూ రాణి శకుంతల రాకకు ఎదురు చూస్తూ ఉన్నారు. ఆమె వెనుకటి దినమే రావలసింది. కాని రాలేదు. నేడు వస్తానని చెప్పి కబురు పంపింది. రాణికి ఆశ్రమ ద్వారంలో స్వాగత మివ్వడానికి ఆశ్రమ ప్రతినిధులు నిరీక్షిస్తూ నిలబడి ఉన్నారు. ఆమె చిన్ననాటి చెలికత్తె లిద్దరూ ఆమె వచ్చే వరకు వేచి ఉండడానికి మనసొప్పక నెమ్మదిగా ముందుకు సాగారు. రాణి రథంలో వచ్చేటప్పటడు ఐదు నిమిశాలకు ముందుగానే రథంలో ఆమెను చూడాలని వారి ఆపేక్ష.

వచ్చే వారికోసం ఎదురు తెన్నులు చూస్తు కాలం గడపడం చాల వెసట పుట్టించేమని. వీరేమో శకుంతలలో పది పదిహేడేండ్ల పాటు అక్క చెల్లెండ్ల వలె పెరిగిన చెలికత్తెలు: శకుంతలకు సగం ప్రాణంలా ఉన్నవారు. ఆమెను ఏడు సంవత్సరాల క్రితం దుష్యంతుని వద్దకు పంపినప్పుడు చూడడమే. ఇటీవల ఆమెను చూచే అవకాశం కలుగ లేదు. శకుంతల ఆశ్రమంనుంచి వెళ్లిపోయిన నెల రోజులకు గౌతమి, శార్ఙ్గరవ శారద్వతులూ తిరిగి వచ్చారు. శకుంతలకు జరిగిన అవమానం సంగతి వారినుండి విని ఆశ్రమ వాసులందరు బాధ పడ్డారు. శకుంతలను మేనక పిలుచుకొని పోయినది, ఆమె మరీచి మహర్షి ఆశ్రమంలో మగ పిల్లవానిని కని సుఖంగా ఉన్నదన్నదీ వీరికి తెలియనే తెలియదు. కణ్వ మహామునికి తెలిసిందేమో, ఆయన ఈ విషయాన్ని ఎవరితోనూ అనలేదు. గౌతమి దేవి ఒక మారు "అమ్మాయి సురక్షితంగా ఉందా ? ఏలాగయినా వార్త తెప్పించుకొంటే నా మనస్సుకు దుట పడుతుంది" అని కణ్వ మహామునితో అన్నది. దానికి మహాముని "అమ్మాయి సుఖంగా ఉంది. కాని, ఇప్పటి అనిష్టం తొలగడానికి కొన్ని దినాలు గడవాలి. అప్పటికి అంతా సరిపోతుంది. అంతవరకూ చింత పడి ప్రయోజనం లేదు. ఇప్పటికి ఆమె యోగక్షేమాలు మనను వాటంతట అవే తెలుస్తాయి," అని సమాధాన మిచ్చారు. తక్కిన వివరాలను గురించి ఆయనను ఎవరూ అడిగే టట్టూలేదు : ఆయన వాటిని గురించి వీరితో చర్చించే వాడు కాడు. ఈ విధంగా దాదాపు ఆరేళ్ల గడచిన తర్వాత, ఒకనాడు రాజభటుడొక్కడు చక్రవర్తి పంపిన మర్యాదలతో పాటు ఆశ్రమానికి వచ్చి , దుష్యంత చక్రవర్తి హేమ కూటంలో శకుంతలా దేవిని చూచిన సంగతి, అక్కడినుంచి ఆమెను కుమార భరతునితో సహా హస్తినాపురికి పిలుచుకు వచ్చిన సంగతి కణ్వ మహా ముని సన్నిధిలో నివేదించాడు. ఆ నాడు ఆశ్రమ

వాసుల ఆనందం అంతా ఇంతా అని చెప్ప తరం కాదు. కులపతి కణ్వ మహా ముని ఐదు సంవత్సరాలుగా నవ్వి నదిలేదు ; ఆనాడు ఆయన ముఖంపై నవ్వు నాట్యమాడింది. ఆ నాటి సాయంకాలం ప్రియంవద, అనసూయ తమ పసి పాపను ఆశీర్వాదం కోసం హేమంతానికి తీసుకుని వచ్చినప్పుడు కులపతి వారిని చేతితో పుణికి ముద్దు పెట్టు కున్నారు, మందహాసం చేశారు; ఆ పొద్దంతా ఆయన మాటలలోను, చేతలలోను నూతన నోత్సాహం కనిపించింది. సంయమి ఆయన ఆయనకే అలా ఉంటున్నప్పుడు తక్కినవారి మాటేమిటి ? అందరికి మితి మీరిన సంతోషం ! ఆశ్రమంలోని మృగాలు, పక్షులూ అందరికన్న హెచ్చుగా సంతోషించాయి. ఆ దినం వాటికి కావలి అమృు తక్కువ, ఇదే పండుగో , పబ్బమో అని వాటి ప్రాణానికి అనిపించి ఉంటుంది. అంతేకాక సాత్వికుల వద్ద ఉన్న మృగాలు ఇతరుల సుఖ దుఃఖాల జాడను సహజంగా గ్రహించ గలుగుతాయి. పూర్వంనుంచి ఆశ్రమంలోని పుట్టి పెరిగి, ఋషులతో పాటే పండబారి వారి తపః ప్రభావంలో భాగ స్వాములయినట్టున్న వృక్షాలు ఆ నాడు ఆశ్రమ సహజమైన గాంభీర్యం తో నూతనల్లాసం సూచించే మృదుమదుర ధ్వని చేశాయి. "కులపతి పెంపుడు కూతురు సుఖంగా ఉన్నది. భర్తతోపాటు నగరంలో ఉన్నది. ఒక రాజ్యానికి రాణిగా ఉన్నది. భావి చక్రవర్తిని అల్లారుముద్దుగా పెంచుతున్నది." అనే భావం ఆశ్రమహృదయంలోనూ అక్కడి తక్కిన జీవనంలోను, తపోవనానికి వీచే గాలిలోను, వెలుతురు లోను—అంతటా సందారింది. 'కులపతి రాజ భటుని ఆనాడు ఆశ్రమంలోనే నిలుపుకొని, మరునాడుతగు మర్యాదలతో, రాజుకు, కుమార్తెకు ఆశీస్సులు తెలుపవలసిందని ఆజ్ఞాపించి పంపించారు. ప్రయాణంతో చేరే హస్తినాపురం లో శకుంతల సుఖంగా ఉంది. అని తెలిసిన వెంటనే అనసూయ ప్రియంవదలకూ, గౌతమి దేవికి ఆమెను చూడాలనే ఉబలాటం ఉప్పొంగింది. కులపతి కణ్వ మహామునికీ ఆశ కలిగే ఉంటుంది, ఆ నాడు ఆమె వెంటవెళ్లి నిష్కారంగా మాట్లాడి, ఆమెను అక్కడ ఒంటరిగా దిగ విడచి వచ్చిన శార్ఙ్గరవునికీ, శరద్వతునికీ కుతూహలం కలిగే ఉంటుంది. కాని, మగవారు ఇలాటి సందర్భాలలో తమ మనస్సు లోని మాటను — ఆవును — నోటితో చెప్పరు, ఆడవారు చెప్పకుండా ఉండరు. ప్రియంవద అనసూయను ప్రోత్సహించింది. అనసూయ అవ్వ గౌతమి దేవిని ముందుకు తోసింది. ఆ వృద్ధ తాపసి శకుంతల సంగతి ప్రస్తావించడానికి నెపం దొరికింది కదా అనే సంతోషంతో, ఒక నాటి సాయంకాలం కులపతితో "మన అమ్మాయి ఎలా ఉందో పోయి చూచి వద్దామని ఆశవుతున్నది. పోయి రావచ్చునంటే పోయి వస్తాను," అన్నది. కులపతి "నీవు వెళ్లి రావడానికి అడ్డు ఏముంది ! కాని, పిల్లలూ వెళ్లి రావాలని ఆశ పడవచ్చు. వారిని వదలి పెట్టి వెళ్లిరావడం మంచిదా ?" అన్నారు. "వాళ్లను కూడా వెంట తీసుకొని వెళ్ళ తాను," అన్నది గౌతమి. "పిల్లలు చాల పసివారు, తల్లులేమో యువతులు. అంతేకాక, రాణీ రాజుల సమీపిక్షానికి, పిలిపించికోకుండా తమంతట తాము వెళ్లడం ఆశ్రమ నివాసులకు తగదు. చూద్దాం !" అన్నారు కులపతి. వృద్ధ తాపసికి, చెలికత్తెలకూ ఆశా భంగమైంది. కాని, ఇది జరిగిన రెండు వారాలకు

శకుంతల పెద్దలకు పిన్నలకు, తన పెంపుడు జింకకు, ఆవుకు, మ్రి చెట్టుకు మల్లికా లతకు — ఒక్క ప్రాణిని కూడ వదలకుండా, అందరికీ మంగళ ద్రవ్యాలు, బహుమతులు పంపి, తను మూన్నాళ్ళ తాలి ఆశ్రమానికి వస్తానని చెప్పి పంపింది. ఆమె ఆ క్రిందటి రోజు రావలసింది. అందరూ ఎదురు చూస్తూ కాచుకుని ఉన్నారు. ఈ లోగా, రావడం కొంచెం ఆలస్యమౌతుందని. మరుసటి రోజు ఆశ్రమం చేరుతానని తెలుప వలసిందిగా రాణి మరొక వార్త పంపింది. అందువల్లనే నేడు వీరంతా ఆమె రాకను నిరీక్షిస్తూ, నేడైనా వస్తుందో , రాదో — అని ఆలోచిస్తూ ఉన్నారు.

శకుంతలని చూడాలని చెలికత్తెలకు, గౌతమి దేవికి కుతూహలం కలిగినట్లే, శకుంతలకూ తన తండ్రిని , అవ్వను, చెలికత్తెలను, మాలినీ తీరంలోని ఆశ్రమాన్ని చూడాలనే ఉత్కంఠ తీవ్రంగా ఉంది. వలచిన మగడు నిరాకరించగా వెళ్ళి హేమకూటంలో ఆరేళ్ళు గడిపి, పద్దెనిమిదేళ్ల నవయువతి ముప్పై అయిదేళ్ల మహిళ వలె జీవిత భారానికి కుంగి పోయింది. భర్త వచ్చి తన తప్పును ఒప్పుకొన్నప్పుడు, ఆమెలో రోషానికి స్థానమే లేక పోయింది. ఆ మీదట, కుమారునితో సహా హస్తినా పురి రాణిగా తిరిగి వచ్చినప్పుడు కూడా ఆమె మనస్సు ఉత్సాహంతో ఉబ్బి పోలేదు. ఒక దశ దాటిన తర్వాత మనస్సు ఎంతటి సంతోషంతోనైనా ఉబ్బి పోవడం మరచి పోతుంది. ఆమెకు జీవితంలో శుభ సమయం మరల తల ఎత్తినప్పుడు, తనకు సుఖం కలిగిందనే భావంకంటే, 'తన తండ్రికిక చింత లేదనీ, తన చెలికత్తెలకిక విచారం లేదని, తన అవ్వ ఇకతనను గురించి యోచన చేయవలసిన అవసరం లేదనీ, తన కుమారుడు జన్మతః పొందవలసిన పదవి వాడికి ప్రాప్తిస్తుందనీ తన నడవడితో అది వానికి తప్పి పోయే ప్రమేయం లేదుదనీ—ఈ భావాలే ప్రముఖంగా మనస్సులో వ్యాపించి ఉన్నాయి. కనుక, ఆమె సాధ్యమైనంత త్వరలో తనవారిని చూచి , వారి కష్టసుఖాలు విచారించి, తన కష్ట సుఖాలను ప్రత్యక్షంగా చెప్పాలని కుతూహల పడింది. ఊరికి వచ్చిన వెంటనే ఆశ్రమానికి వెళ్ళాలనే సంగతి యెత్తాలనే ఆమె అనుకుంది. కాని, ఇంకా కొత్త : తనవారిని చూడాలనే అభిలాషను అంత త్వరగా తెలుపడానికి సంకోచపడి ఊరుకుంది. తాము సుఖంగా హస్తినా పురి చేరిన సమాచారం చెప్పిపంపినప్పుడు మాత్రం చెలికత్తెలకు, పెద్దలకు విడివిడిగా ఒకొక్క వార్త సంపింది. రాజ భటులు తిరిగి వచ్చినప్పుడు, వారినుంచి ఆశ్రమ వృత్తాంతం తెలుసుకొన్నది. అనసూయ శరద్వతుని, ప్రియంవద శార్ఙ్గరవుని పెండ్లాడినట్టు వారి మాటలను బట్టి ఆమె ఊహించింది. ఇది జరిగిన పెక్కునాళ్ల తర్వాత కణ్వాశ్రమానికి వెళ్లాలనే మాటను రాజు దగ్గర ప్రస్తావించడానికి సాహసించింది. తప్పకుండా వెళ్ళి రావలసిందే. కాని ఇప్పుడు నేను అక్కడికి రావడం మంచిది కాదు. మునుపు నేను ఆ పుణ్య భూమిలో అడుగు పెట్టినప్పుడు కులపతికి అపరాధం చేశాను. ఇప్పుడే వారిని చూడడానికి నాకు ధైర్యం చాలడం లేదు. నీవు వెళ్లి రావచ్చును." అని రాజు అన్నాడు. శకుంతల చిరునవ్వుతో "అప్పుడు మీరు చేసిన అపరాధం ఇప్పుడు మా

నానగారికి ప్రియంగా పరిణమించింది. ఇంతకూ ఆయన ఆలా క్రోధం మనస్సులో పెట్టుకుంటారా ?'' అన్నది. నేను సంకోచ పడుతున్న వారి మనస్సులో క్రోధ మున్నదని కాదు. నేను తప్పు చేశాననే భావం ఇంకా నా మనస్సునుంచి తొలగి పోలేదు. నేను నిన్ను కొంత కాలం సరిగా చూచుకొన్న మీదట వారి వద్దకు వెళ్ళడానికి ధైర్యం కలుగుతుంది,'' అన్నాడు దుష్యంతుడు. ''అయితే నేనూ అంతవరకూ ఆశ్రమానికి వెళ్లను. మా నాన్నగారు చెప్పినట్లే కానియండి'' అన్నది శకుంతల. నాన్నగారు చెప్పినదేమిటో రాజుకు తెలీదు. ''ఏమి చెప్పారు ?'' అని ప్రశ్నించాడు. శకుంతల ''ఏడేళ్ల క్రితం నేనిక్కడికి బయలు దేరినప్పుడు 'ఈ ఆశ్రమానికి మరల రావడం ఎప్పుడో ? ''అనే సరికి, నీ భర్తతో తపస్సుకు తరలి వచ్చినప్పుడు,'' అన్నారు నాన్న గారు'' అన్నది. కణ్వ మహాముని ఆ సందర్భంలో ''నీ కుమారునికి పట్టం కట్టి, నీ భర్తతో తపస్సుకు తరలి వచ్చినప్పుడు,'' అని అన్నారు. ''కుమారునికి పట్టం కట్టి' అనే మాటను శకుంతల రాజుకు చెప్ప లేదు. జీవితం ఆమెకు జాగరూకతను నేర్పింది. రాజు తన్ను ప్రేమించాడు., కుమారునికి అన్యాయం చేయలేడు, కాని, ఏ విషయంలోనూ అతినిశ్చయంకూడదు. కణ్వ మహాముని మాటలకు రాజు ''అది ఆశ్రమంలోనే వసించడానికి వెళ్లడం ఎప్పుడన్న అర్థంలో చెప్పిన మాట —వెళ్లి చూచి రావడానికి ఆ మాట అన్వయించదు. వెళ్లి వారి మనస్సును సమాధాన పెట్టు,'' అన్నాడు. ''అయితే నేను మీ రాయ బారినా ?'' అని అడిగింది శకుంతల. ''నీవు ఈ మాట పరిహాసానికే అంటున్నవు. కాని, అదే నిజం'' అన్నాడు రాజు. ఇంత జరిగిన మీదట రాణి తండ్రి ఆశ్రమానికి తాను రానున్నానని వర్తమానం పంపింది.

ఆశ్రమానికి వెళ్ళడానికి ఒక దినం నిర్ణీతమైంది. ఆ నాటి ఉదయమే శకుంతల దేవ పూజ సమాప్తి చేసి, తను ఆశ్రమానికి వెళ్లి వచ్చే సంగతి సవతి అయిన హంస పదికకు తెలుపడానికి బయలు దేరింది. హంసపదిక శకుంతలకు నాల్గేళ్ళ ముందు నుంచి రాజు మనస్సును పలచుకొన్న రాణి: గంధర్వ రాజ పుత్రి. చెలువ, తేజస్విని. ఆ చెలువమూ, తేజమూ నాలుగేళ్ళు నగరును పాలించాయి. ఆ మీదట ఒక నాడు వేటకు వెళ్లి వెనుదిరిగిన రాజు అన్యమనస్కుడై ప్రియురాలి ఎదు అంతఃపురంలో ప్రవర్తిం చాడు. ఇది ఆ కాలంలో రాణులకు సర్వసాధారణమైన అనుభవం. రాజు ఎవరినైనా చూచాడేమో — అని ఆమె సందేహించ సాగింది; ఆయన వెంట వెళ్ళిన పరిజనాన్ని అడిగినది. ఆమె సందేహం సత్యమైంది. ఆశ్రమంలో రాజు ఏదో ఒక రీతిగా మారి పోయాడు, రాణి యెడల మరల ప్రేమ చూప లేదు. కొంత కాలం గడచిన పిదప గర్భిణి అయిన ఒక మహిళ హస్తినాపురికి వచ్చి, రాజు తనని పెండ్లాడినాడని చెప్పడం, అటు తర్వాత చరిత్ర హంసపదిక జీవితాన్ని మరింత చింతామయం చేశాయి. ఇలా కొన్నేళ్ల తర్వాత నిరాకృతయై పోయిన ఆ శకుంతల రాణిగా తిరిగి వచ్చింది. ఆమెతో పాటు కొడుకు కూడా వచ్చాడు. ఇక తను జీవితంలో పరీక్షించ వలసిన సుఖమేమీ లేదని

హంసపదిక మనసు దిట్టము చేసుకొన్నది. శకుంతల తన్ను చాల తిరస్కారంతో చూస్తుందని అనుకొన్నది. కాని, శకుంతల వచ్చిన మరునాడే ఆమె జీవితంలో మరల ఒక ఆనందపు సందర్భం మోసుకొచ్చింది. శకుంతల కుమారుని గన్న పట్ట మహిషి అని నగరులో రాజాజ్ఞ చాటించారు. నిజానికి తక్కిన రాణీ వాసమంతా ఆమెకు మర్యాద చూపడం సంప్రదాయం. అయినా, శకుంతల తనే హంసపదిక వద్దకు వచ్చి నమస్కరించి, "మీరు నాకంటె పెద్దవారు. నేను ఏమీ తెలియని చిన్నదాన్ని. నన్ను చెల్లెలిగా భావించాలి. తెలియని వన్నీ తెలపండి," అని వినయంగా అడిగింది. ఈమె ప్రవర్తన చూచి హంసపదిక నివ్వెర పోయింది. ఆమె శకుంతలను దగ్గరికి లాగుకొని, కౌగిలించుకొని, "ఇదేమిటె చెల్లీ ! ఏమిటి నీవనే మాటలు ? రాజు నీ గీచిన గిరి దాటడు. మేము నిన్ను అంటి పెట్టుకొని ఉండాలే కాని, నీవు మమ్మల్ని అడగవలసినదేముంది ?" అన్నది. శకుంతల "నాకు రాజానుగ్రహమూ కావాలి, అలాగే నా అక్కగార్ల అభిమానమూ ఉండాలి," అని సమధాన మిచ్చి, ఆమె మనస్సును చూరగొన్నది. అప్పటి నుండి వీరి మైత్రి దినే దినే పెరుగుతూంది. శకుంతల తండ్రి ఆశ్రమానికి వెళ్లే నాడు, వెళ్లి వస్తానని చెప్పి రావడానికి హంసపదిక దగ్గరికి పోయినప్పుడు హంసపదిక "ఎక్కడ ఎన్నాళ్ళుంటావు ? ఎప్పుడు తిరిగి రాక ? అక్కడ ఎవరెవరున్నారు ? ఆశ్రమం ఎలా ఉంటుంది ?" మొదలయిన ప్రశ్నలు వేసింది. ఆ ప్రశ్నలను బట్టి ఆమెకూ ఆశ్రమానికి వద్దామనే అభిలాష ఉందని శకుంతలకు తోచింది. "అక్కయ్యా ! మీరుకూడా నాతో రండి" అని ఆమె హంసపదికను అడిగింది. "నీవు నీ వారి వద్దకు వెళ్లి వచ్చేటప్పుడు మధ్య నేను వచ్చి ఇబ్బంది పెట్టకూడదమ్మా ?" అన్నది హంసపదిక. శకుంతల ఆమెను రావాలని బలవంత పెట్టి ఒప్పించి, రాజు వద్ద, రాజమాత వద్ద తామిద్దరూ ఆశ్రమానికి వెళ్లి రావడానికి అనుమతి పొందింది. ఆ దినమే బయలు దేరడానికి హంస పదిక సిద్ధంగా లేనందున మరునటి దినం తరలి వెళ్లడానికి నిర్ణయించింది అందువల్లనే వారి పయనం ఒక దినం ముందుకు వెళ్ళడం, శకుంతల తాను రావడం ఒక్క దినం ఆలస్యమౌతుందని ఆశ్రమానికి కబురు పంపడమూ జరిగింది.

హస్తినా పురి నుంచి కణ్వాశ్రమానికి సాధారణంగా పదినాళ్ల నడక. ఆతురతతో తొందరగా వెళ్లే భాగ్య శాలులకు మూడు నాళ్ల పరుగు. రాణులిద్దరినీ పంపాలంటే తగిన పరివారాన్ని వెంట పంపాలి, రాజు దీనికి తగిన ఏర్పాట్లు చేశాడు. నీవు వారి వెంట వెళ్లాలని మోదకప్రియుడైన తన నర్మసఖుడు మాధవ్యునికి కూడా తెలియ జేశాడు. శకుంతల నిరాకృతి జరిగిన నాటినుంచి మాధవ్యునికి ఒక్కనాడన్నా సుష్టుగా భోజనం దొరికిన జ్ఞాపకం లేదు. భోజనం దొరికినా జ్ఞాపకం ఉండడం కష్టం, ఇప్పుడు భోజనమూ లేదు. శకుంతల వచ్చిన తర్వాత వీనికీ వడ దెబ్బకు కాలిన నేల మీద వాన కురిసినట్టయింది. పన్నెండేళ్ల క్షామం ఆమె వచ్చిన నాడే, ఉన్నదున్నట్టుగానే మఖాయమైంది. రాజు ప్రతి నిత్యం "మాధవ్యునికి ఈ పిండి వంటలు చేయించి పెట్టి

కూడదు, ఆ పిండి వంటలు చేయించి పెట్టరాదూ ?" అని పురమాయించడం ప్రారంభించాడు. ఇప్పుడు, అదనంగా, శకుంతల పెద్ద రాణి ఆశ్రమానికి వెళ్లాలి అన్నప్పుడు తనూ వారి తో పాటు వెళ్లాలని రాజు ఆనతిగా, మాధవ్యుని ఆనందానికి అంతూపంతూ లేక పోయింది. తను రాజుకు ప్రతి నిధిగా వెళ్ల తా నన్నది. ఈ ఆనందాన్ని కొక కారణం. మునుపు అక్కడికి వెళ్లినప్పుడు, ఎవడో యః కశ్చనలాఎవరి తోనూ మాట్లాడక, కుల పతికి దర్శన మివ్వక తిరిగి రావడమైంది. ఈ సారి వెళ్లితే, తను ఎంతటి ప్రజ్ఞా శాలి అయిందీ, రాజ పరివారంలో తన స్థానం ఎంత ముఖ్య ముఖ్యమైంది చూపించడానికి అవకాశం కలిగిందనేది మరొక కారణం. దీనికి తోడు భరతుడు వెంట ఉండడం వల్ల ఆటలకు కావలసినంత వీలు. మాధవ్యుడు ఒక రథ మెక్కాడు. రాణులు మరొక రథ మెక్కారు. కొందరు మాత్రమే అంగరక్షకులు వెంటరాగా, హస్తినాపురి నుంచి పయనమయ్యారు.

బయలు దేరేటప్పుడు కుమార భరతుడు రాణుల రథంలో కూర్చున్నాడు. కుమారు డక్కడ కూర్చునేటప్పుడు మాధవ్యుడు దగ్గరికి వచ్చి "రథం కదిలి కొంచెం దూరం వెళ్లిన తర్వాత నా రథ మీదికి రా. ఆడుకొందాము అని," అతని చెవిలో గుసగుసలాడాడు. భరతుడు 'ఊ' అని తలఊపాడు, సంతోషంతో ప్రయాణం రెండు గడియలయేటప్పటికి అతనికి ఆడవారి రథంలో కూర్చొనడం విసుగు పుట్టింది. "నేను మాధవ్యుల రథం లోకి వెళ్లతాను" అన్నాడు. రథాలను ఆపి, కుమారుని ఆ రథంలో కూర్చో బెట్టారు. రాణులకుకూడా దీని వల్ల అనుకూలమే, శకుంతలకు తన కుమారుడు దగ్గర ఉండాలనే ఆశ , కాని అతడుంటే తను అక్కయ్యతో పిచ్చ పట్టి మాట్లాడడం సాధ్యం కాదు. అయినా, ఆమె అటు మాధవ్యుని రథంలో కూర్చున్న కుమారుని మధ్య మధ్య మమతతో చూస్తూ, ఇటు పెద్ద రాణితో మాట్లాడుతూ ప్రయాణం సాగిస్తూంది. ఆ రథంలో మాధవ్యుడు అన్ని జాతుల పశు పక్షుల ధ్వనులూ అనుకరిస్తూ కుమారుని సంతోష పెడుతున్నారు. అంతకు ముందు ఏడు రోజులనుంచి అతనికి, భరతునికీ ఇదే పని. మాధవ్యుడు ఈ అనుకరణలో కడు చతురుడు. ఆయన సింహంలాగా గర్జించినప్పుడు గుర్రాలు బెదిరి దౌడు హెచ్చించాయి. ఇలాగే కాకి, కోకిల, చిలుక, గోరు వంక, పులి, నక్క , తోడేలు, మొదలయిన వాటిని అనుకరించి భరతుని మెప్పించాడు.
వంక, పులి, నక్క, తోడేలు, మొదలయిన వాటిని అనుకరించి భరతుని మెప్పించాడు.
"గాడిద లాగా వోండ్రపెట్టు," అని కోరాడు భరతుడు. రోజూ అదే పనిగా కోరితే మాధవ్యుడు ఇలా వోండ్ర పెట్టేవాడు. ప్రయాణంలో రథంలో కూర్చుని గాడిద లాగ వోండ్ర పెట్టడం ప్రారంభిస్తే జనం ఏమనుకుంటారు ? కనుక ఇప్పుడు వద్దూలే. రాణులున్నారు" అని మాధవ్యుడు భరతుని మనస్సు మార్చడానికి ప్రయ త్నించాడు. కాని భరతుడు ఊరికే వదిలి పెట్టే బాలుడు కాడు. "మన రథాన్ని ముం ముందుకు తోలమను: తర్వాత వోండ్రపెట్టు" అని మొండి పట్టు పట్టాడు. మాధ

ప్యునికి ఒక్క క్షణం మనస్సుకు చించుకొని పోయింది. కాని, వెంటనే, ఇది పెద్దవారు చెప్పదగ్గ కపటపు మాట కాదు. కల్లకపటం తెలియని పసివాని మనస్సునుంచి వెలు వడిన మాయ మర్మం లేని మాట గదా అను కొన్నాడు. రథాన్ని కొంచెం ముందుకు సాగించమని చెప్పి, నెమ్మదిగా వొం(డ పెట్టి కుమారుని కోరిక తీర్చాడు. ఇలా వీరు మార్గాయాసం అనేది తెలియకనే ముందుకు సాగి పోయారు.

మరుసటి దినం సాయంకాలం వీరు ఆ(శమ సమీపానికి చేరారు. ఆ(శమం సమీపించగానే భరత కుమారుడు రథం వడిగా తోలమని సారథితో అన్నాడు. "మనం ముందుగా వెళ్లి అమ్మవాళ్లు వస్తున్నారని చెబుదాం"—అనేది అతడు నోటితో చెప్పిన కారణం. అసలు కారణమేమిటంటే, తను ముందుగానే ఆ(శమం చూడాలి అక్కడ అందరినీ పలుకరించి పరిచయం చేసుకోవాలన్న కోరిక. ఆ రథ సారథి యువకుడు. రెండో రథంకంటే ముందుగా వెళ్లాలని వానికి అభిలాషే. కనుక వారి రథం రెండో రథంకన్న అర్థ పరువు ముందుకు వెళ్లింది. అందువల్ల రాణిని అందరికన్న ముందుగా చూచి స్వాగతమివ్వాలని వస్తున్న అనసూయ, (ప్రియంవదలకు మొదట భరతుని రథం ఎదురైంది. - చెలికత్తెలు దూరంనుంచే రథం చూశారు. దానిలో మాధవ్యుడు మా(తం కనిపించడం వల్ల, వారు, ఎవరో మగవారున్న రథం అని, దారి వదలి పక్కకు తప్పుకున్నారు. "వీరెవరు బాబాయి ?" అని భరతుడు మాధవ్యుని (ప్రశ్నించాడు. "రాణి గారి చెలికత్తెలు లాగుంది," అన్నాడు మాధవ్యుడు. భరతుడు వారిని లేరి పార జూచి "ఔనౌను !" అంటూ రథం ఆపమన్నాడు. రథం అనసూయ (ప్రియంవదలున్న పక్కకే వెళ్లి ఆగింది. కుమారుడు రథంనుంచి దూకి, వీరి వద్దకు వచ్చాడు. ముఖం పోలికలను బట్టి ఈ అబ్బాయి శకుంతల కుమారుడని వెంటనే చెలికత్తెలు (గహించారు. "అవునో ! కాదో ! అబ్బాయి మట్టుకే ఈ విధంగా రావడం కద్దా !" అని వారు ఆలోచిస్తుండగానే, భరతుడు వారి దగ్గరికి వచ్చి, "మీరు మా అమ్మగారి చెలికత్తెలు కదూ !" అని (ప్రశ్నించాడు. (ప్రియంవద "ఔను. అమ్మ గారేరి బాబూ ?" అని అడిగింది. కుమారుడు మరి కొంత దగ్గరికి వచ్చి, "వెనుక రథంలో వస్తున్నారు," అని, " మీ పేరు (ప్రియంవద. ఆమె పేరు అనసూయ కదూ !" అన్నాడు. "నీ కెలా తెలిసింది ?" అని అనసూయ అడుగుతూ అతణ్ని ఎత్తుకుంది. కుమారుడు ఆమె ముఖం పై వేళు ఆనించి "దొడ్డమ్మగారి ముఖం వెడల్పు, మీ ముఖం కోల. అదే గుర్తు " అన్నాడు. "అంత మా(తానే తెలిసిందా ? ఎంత తెలివి తేటలు ?" అన్నది (ప్రియంవద. "అది కాదండీ ! మీ ముక్కు కొంచెం పెద్దది అన్నారు. దాని నుంచికూడా గుర్తు పట్టాను," అన్నాడు భరతుడు. చెలికత్తెలిద్దరికీ నవ్వాగలేదు, కుమారుని చెక్కులు నిమిరి ముద్దు పెట్టు కున్నారు. "తం(డిలాగే ఉన్నాడు. బొద్దుగా పెరిగాడు"—అనుకున్నారు. ఇంతలోగా మాధవ్యుడు వారిని సమీపించాడు, వారిని కుశల (ప్రశ్న చేశాడు. చెలికత్తెలు ఆయనకు తగిన సమాధానం చెప్పి. "రాణి

గారు ఇంకా ఎంత దూరంలో ఉన్నారు ?'' అని అడిగారు. అడుగుతూ ఉండగానే దూరానే మరొక రథం కనిపించింది. ''అదిగో రథం !'' అంటూ అనసూయ భరతుని కింద దింపి ముందుకు అడుగు వేసింది. ప్రియంవద భరతుని ఎత్తుకొని, వెంట వెళ్లింది. శకుంతల దూరంనుంచే వీరి గుంపును చూచి, రథం ఆపమని సూతుని ఉత్తరువు చేసి , రథం ఆగిన వెంటనే తను దిగి, హంస పదికను దింపుకొని, వెంట తీసుకొని చెలికత్తెల వద్దకు వచ్చింది.

ఏడేళ్లు గడచిన తర్వాత మరల సమావేశమైన ఈ సఖుల మనస్సులోని భావ శబలతను ఎవరు వర్ణించగలరు ? అంతకు కొన్ని క్షణాల ముందే ప్రియంవద మనస్సులో ''నేటి శకుంతల నాటి శకుంతల కాదు, రాణి. ఆమెని ఏమని పిలువాలో ! ఏమి మర్యాద చూపాలో !'' అని ఆలోచించింది. రథంనుంచి దిగిన శకుంతలను చూడగానే ఈ ఆలోచనలన్నీ ఎక్కడికి పోయాయో ! ఆమె శకుంతలను 'రాణి !' అని కూడ పిలవలేదు. ''శకుంతలా బాగున్నావా ?'' అని మాత్రమే అన్నది. గొంతు బిగుసుకు పోయింది. కళ్లలో నీరు కళ్లలో ఉండక, కిందికి జారి పడక, కను రెప్పల మధ్యనే బిందువులుగా నిలిచింది. అనసూయ చిన్న పిల్లలా పరిగెత్తి వచ్చి మాటా మంచీ లేక శకుంతలను కౌగిలించుకొని, ఆమె భుజం మీద తలవాల్చి వెక్కి వెక్కి ఏడ్చింది. శకుంతలకూ ఒక్క క్షణం ధైర్యం తప్పింది. కాని, మరుక్షణమే ఆమె మనస్సు దిట్టము చేసుకొని, ''రా, అనసూయా ! ఇదిగో చూడు ఎవరు వచ్చారో !'' అని ఆమె కౌగిలిని వదలించుకుంటూ ప్రియంవదను దగ్గరగా లాక్కుంటూ, హంసపదికకు తన నెచ్చెలులను పరిచయం చేస్తూ'' ''ఈమె మా అక్కయ్యగారు. నన్ను చెల్లెలికన్నా చక్కగా చూచుకుంటూన్నారు.'' అన్నది. ప్రియంవద హంసపదికకు సగౌరవంగా చూస్తూ ''తమరు కూడానూ ఆశ్రమానికి దయ చేయడం చాల సంతోషం,'' అన్నది. పరస్పర, మర్యాద మాటల తర్వాత శకుంతల ''నాన్నగారు, గౌతమి దేవి సుఖంగా ఉన్నారా ?'' అని ప్రశ్నించి, ఇదవ ఆశ్రమంలోని అందరి యోగ క్షేమాలు విచారించింది. మాధవ్యుడు ఒక పక్కన ఉండడం చూచి, మర్యాదకోసం యధాలాపంగా ''మా ప్రయాణం వలన మీకు చాల ఆలస్యమైంది.,'' అంటూ, భరతుని వంక చూస్తూ, ''అబ్బాయి అప్పుడే వీ స్నేహం కట్టాడే ?'' అన్నది. ''ఔను మా. నీవు మొదట్లోనే మమ్మల్నందర్నీవర్ణించి చెప్పి, నా ముక్కు పెద్దది అన్నావటు.'' అన్నది ప్రియంవద. ''శకుంతల కుమారస్నీ చూచి. '' అబ్బాయ్ ! దొడ్డమ్మ గారిని అలా అనవచ్చా !'' అన్నది. ''నేను మొదట్లో అనలేదమ్మా, నన్ను ఏలా గుర్తు పట్టావు—అని దొడ్డమ్మగారు అడిగాక మీ ముఖం పెద్దదిదీ, పిన్నిగారి ముఖం పొడుగు—అన్నాను. ఇంతలోనే తెలిసిం ?—అని దొడ్డమ్మగారన్నారు. లేదండీ. మీ ముక్కు కొద్దిగా, కొద్దిగా పెద్దని అమ్మగారు చెప్పారండీ అన్నాను.,'' అంటూ దారిలోని ఒక రాయిని కాలితో తన్నాడు' భరతుడు. 'అందరూ మళ్లీ నవ్వారు. పిల్లల మాటల కెంత మహిమ '!

స్నేహంతో గాని, దుఃఖంతోగాని పెద్దం కంట్టం రుద్ధమైనప్పుడు, పసి పిల్లల జిలి బిలి పలుకు ఆ ఎంతటి ఉద్వేగాన్నైనా తగ్గిస్తుంది. కన్నవారు పెంచిన వారు చింతా క్రాంతులైనప్పుడు, పసి పిల్లల ఒక్క నవ్వు తీగ వారి హృదయంలో హర్షపు పువ్వులు పూస్తుంది. కాలం గడిచి, పెరిగి పెద్ద వయ్యస్సు మళ్లిన వారు తమ వయస్సంతా అడవి గాచిన వెన్నెలై పోయిందని కుంగి పోయినప్పుడు, ఆకలితో అమ్మ రావురంటూ ఏడ్చే చిన్నారి పాప జీవితంలో కావలసింది చాల ఉందని వారిని హెచ్చరిస్తుంది. ప్రియం వద, అనసూయ మరొకమారు భరతుని ముద్దాడి, వాని చేతులు పుచ్చుకొని నడుస్తూ వెళ్లారు, ఇట్లు శకుంతల, అటు హంసపదిక, మాధవ్యుడు వారి వెను వెంట. ఇలా రాణులు, తాపస స్త్రీలు మాట్లాడుతూ, ఆశ్రమం వైపు నడిచాట. రథాలు వెనుక వచ్చాయి.

శకుంతల ముందుకు అడుగులు వేస్తూనే, తన సువరి ఏతస్థలాలన్నీ ఒక్కొ టొక్కటిగా గుర్తుకు తెచ్చుకుంటూంది. ఇటు వైపున దారి పక్కన ఒక పెద్దమాను. దానిలో ఒక తొర్ర. తొర్రలోనుంచి మాను మొదట్లో పక్కన రాన గింజలు. లటు మాలినీ నది స్నాన ఘట్టంనుంచి వచ్చే దారి. మరికొంత దూరాన ఆశ్రమ వృక్షాల కోసం పైనుంచి తెచ్చిన కాలువ. ఇక్కడ మరొక వైపు జింకల మంద. ఎవరా వస్తున్న వారని వీరిని చూచే జింకలు కొన్ని, ఎవరు వస్తే మనేమిటే — అన్నట్టు తల ఎత్తకనే మేస్తున్నవి కొన్ని. ప్రపంచం ఆనాడు ఉన్నట్టే నేడూ ఉన్నది — అని తోచింది శకుంతలకు. కాని, ఆ నాటి ఉల్లాసం మాత్రం ఆమె మనసులో లేదు. తన్ను సాకిన, పెంచిన స్థలాన్ని చూచి శకుంతలకు సంతోషమే: కాని దాని స్వరూపం అలాగే ఉన్నా, దానినుంచి తనకు ఆ నాటి సుఖం, హాయి కలుగ లేదేది ఒక కొరత. ఈ మనస్థితికి కారణమేమిటో శకుంతలకు అర్థం కాలేదు. అందరూ ఆశ్రమ ద్వారం వద్దకు వచ్చే వేళకు, అక్కడ శార్ఙ్గరవుడు, శారద్వతుడూ, కొందరు ఎని కుమారులు, ముని కన్యలూ వేచి ఉన్నారు. శార్ఙ్గరవుడు ఒక పళ్లెంలో ఫల మంత్రాక్షలు ఉంచుకొని, ఎదురుగా వచ్చి, రాజోచితాశీర్వాదంతో కుమార భరతుని మీద, శకుంతలమీద అక్షతలు చల్లాడు. పిదప శకుంతలతో "కులపతి ఇక్కడ తామే ఉండి రాణిగారికి స్వాగతమివ్వాలని అనుకున్నారు: కాని, సంధ్యాహోమ సమయం అయినందున 'యజ్ఞవాటిలో ఉంటాము. అక్కడికే వారిని విజయం చేయించుకొనిర" మ్మని ఆనతిచ్చి వెళ్లారు" అన్నాడు. శకుంతల శార్ఙ్గరవుని మర్యాదకు చాల బాధ పడింది. కాని, ఆమె వెంటనే అతనితో ధారాళంగా మాట్లాడి, ఈ మర్యాదంతా వద్దని చెప్పేప్పటానికి వీలు లేదు. కుక విని ఊరుకుంది. శారద్వతుటుడు దగ్గరికి వచ్చి "క్షేమమేనా తల్లీ !" అని మెల్లదిగా అడిగి, భరత కుమారుని దగ్గరికి పిలిచి,, 'చక్రవర్తి కుమారులు చాలా చురుకుగా ఉన్నారు," అని శార్ఙ్గరవునితో అన్నాడు. "అంతా కులపతి అనుగ్రహం," న్నాడు శార్ఙ్గరవుడు. అందరూ అక్కడినుంచి యజ్ఞ వాటికకు బయలు దేరారు.

కులపతి హోమాగ్ని ముందు ఆసీనులై ఉన్నారు. వీరు రావడం తెలిసి, లోపలి నుంచి ఒక వటువును పంపి, లోపలికి రమ్మని ఉత్తరువు చేశారు. శకుంతలకు వెంటనే వెళ్లి తండ్రిని కౌగలించుకొందామన్నంత ఆవేశం ఉంది. కాని, ఎదిగిన పిల్లకు, చక్రవర్తి పత్నికి, భావి చక్రవర్తి తల్లికి, ఇది భావ్యం కాదు. ఆమె భరతునితో "రా, తండ్రీ! తాతగారికి నమస్కారం చేయి," అని, "నమస్కరిస్తున్నాను అంటూ తండ్రి ఏదుట మోకరిల్లింది. ఆయన ఆశీర్వాదం పొందిన మీదట లేచి నిలబడి, హంస పదికను చూపుతూ "మా అక్కగారు. నాతో పాటు రావడానికి ఒప్పుకున్నారు. వారు రావడం మీ కందరికి సంతోషకరమని పిలుచుకు వచ్చాను." అన్నది. కులపతి ఆమె మాటలు విన్నట్టు తల పంకిస్తూ, ఆశీర్వాదాక్షతులు వారిపై చల్లి కూర్చోమని సైగ చేశారు. హోమం కొనసాగింది. కులపతి పది పదిహేను నిమిషాలలో సంధ్య హోమం, అగ్నిపూజా సేవాదికం సమాప్తి చేసి వీరిని "కుశల ప్రశ్నవేశారు. భరత కుమారుడు ఇతరుల వద్ద ఆటలాడినట్టు కణ్వ మహామునివద్ద చనువుతో ఆడుకోలేదు, చాల గంభీరంగా ప్రవర్తించాడు. కణ్వ మహాముని హంస పదికను సగౌరవంగా పలుకరించారు. ఆ వేళకు మాలినీ నదికి వెళ్లిన గౌతమీ దేవి కూడా వచ్చింది. "సాయంకాలమంతా కాచుకూర్చున్నాను. నీవువచ్చే వేళకు సరిగ్గా ఏటికి వెళ్లాను చూచావా నేను," అంటూ శకుంతల దగ్గరికి వచ్చింది ఆమె. వచ్చిన వారందరూ ఆమెకు కూడ నమస్కరించి ఆశీర్వాదాలు పొందారు. కణ్వ మహాముని కొంతసేపు రాజసంగతి, రాజకుటుంబం సంగతి మాట్లాడి గౌతమితో "అమ్మాయీ, రాణిగారు ప్రయాణంలో చాల బడలినారూ. అబ్బాయికీ ఆకలి అయి ఉంటుంది. పిలుచుకు వెళ్లి ఉపచారం చేయండి" అన్నారు. తర్వాత ఆయన ప్రియంవద, అనసూయలను చూచి, "రాణిగారికి మీ పిల్లలను చూపించండి' అంటూ నవ్వారు. వారిద్దరూ సిగ్గుతో తలలూపారు. తర్వాత అందరూ విడిది ముఖ మంటపం చేరారు.

సఖులూ, శకుంతలా మాట్లాడవలసిన సంగతులు వందలూ, వేలూ, రాణి హంస పదిక ఇది గ్రహించి, భరత కుమారునికి భోజనం పెట్టిస్తానంటూ గౌతమీ దేవితో పాటు వంటసాలకు వెళ్లింది. ఆశ్రమాన్ని చూడాలనే నెపంతో కుమారుని పిలుచుకొని అటూ ఇటూ తిరిగి పొద్దు పోయి విడిది చేరింది. ఆ వేళకు సఖులు శకుంతలకు తమ సంతానాన్ని చూపి, మరలవచ్చి, ఆమెతో సఖి సహజమైన సౌహార్దంతో, ఉత్కంఠతో ఆ మాట ఈ మాట—ఎక్కడ లేని విషయాలూ మాట్లాడారు. దుర్వాసుని శాపం తాము భయ పడడం, ఆ శాపం ప్రకారమే జరుగడం, కణ్వ మహా ముని వ్యధ పడడం, శార్ఙ్గరవ శారద్వతులు రాజధానినుంచి తిరిగి వచ్చిన మీదట గౌతమీ దేవి వారికి పెండ్లి చేయాలని పట్టు పట్టడం, శకుంతల పెంపుడు జింక ఈనడం, మరల యివ్వడు చూచి ఆయన మాట శార్ఙ్గరవుని హట్టం, శారద్వతుని సరళత, కణ్వ మహా ముని దొడ్డ మనసు, . . . . . . . . . ఇలాగే ఎన్నో మాటలు. భరత కుమారుడు భోజనం

ముగించి రాగానే శకుంతల వానిని గుండెలకు హత్తుకొని పడుకో బెట్టి, హంస పదికతో పాటు భోజనానికి వెళ్లింది. ఇక్కడ వారి సరళ స్వభావం చూచి హంసపదికకు ఆశ్చర్యం భోజనానంతరం అందరూ కొంత సేపు వెన్నెలలో విశ్రమించి, పడుకొనడానికి వెళ్లారు. ఆ రాత్రి శారద్వత శార్ఙ్గరవులు తమ పిల్లల కష్ట సుఖాలు తామే చూచుకోవలసి వచ్చింది. శారద్వతుడు సాధు స్వభావుడు, కనుక అతనికివన్నీ లక్ష్యంలేదు. శార్ఙ్గరవుసిది కాంచెం కటిన హృదయం. అతనికి అంత తొందరగా పెళ్లాడే ఉద్దేశం లేదు. ప్రియం వదకూ ఇంకా కొన్నాళ్లు గడవాలనే మనసు. కాని గౌతమీ దేవి పట్టు పట్టింది. "ఏదిగిన పిల్లను పెట్టుకొని, మసలాగే కదా అని అజాగర్తతో ఉండబట్టే, అప్పుడలా అయింది. ఇక మీ వల్ల మరేదైనా చింత కలిగే లవకాశం ఉండకూడదు. మీరూ ఇప్పుడే తప్పక పెండ్లాడాలి," అన్నది. అనసూయా శారద్వతులు పెండ్లికి ఒప్పుకున్నారు. ప్రియంవద ఇప్పుడు పెండ్లి వద్దు — అన్నది. అప్పుడు అనసూయ "నీవు అక్కవు నేను చెల్లెలును. నీవే పెండ్లి వద్దంటే, నాకు మాత్రం ఏమి తొందర ? కొన్ని నాళ్లు గడవని, జతగా పెండ్లాడుదాము," అని ప్రియంవదతో అన్నది. ఇదంతా చూచి కులపతి ఆ సంవత్సరమే పెండ్లిండ్లు చేశారు. ఇప్పుడు అనసూయకు ఒక ఆడ బిడ్డ. ప్రియంవదకొక మొగ బిడ్డ. స్నేహితురాలి కోసం వారిద్దరూ ఆ రాత్రి విడిదిలోనే పడుకున్నారు. ముగ్గురూ చాలాసేపు ఏదో మాట్లాడుతూ, నిద్ర పోయారు. శకుంతలకు ఆ నాటి నిద్రలో చాల నాళ్లుగా కనిపించని ఎన్నో సుఖ స్వప్నాలు కనిపించాయి. తెల్ల వారి లేవగానే కులపతి ముందుగానే వచ్చి విచారించి వెళ్లారని తెలిసింది. తర్వాత రాణు లిద్దరూ నిద్ర లేచి స్నానాది కాలకృత్యాలు ముగించి, యజ్ఞ వాటికి వెళ్ళి, పెద్దలకు నమస్కరించారు. ఆ మీాదట, శకుంతల తన చెలికత్తెలతో తన పెంపుడు మల్లికా లతను చూడడానికి వెళ్లింది. అది ఏపుగా గుబురుగా పెరిగింది. అదిగో ! అదే సుందర సహకార వృక్షం. ఆ పక్కనే దీర్ఘా పాంగమనే జింక వచ్చి నిలబడిఉంది మొదట దానికి శకుంతల ఆనవాలు చిక్క లేదు. ఆమె పిలిస్తే అది బెదరి దూరంగా పారిపోయింది. సఖులు దానిని పట్టుకొని వచ్చి, దగ్గర నిలుపగా, క్రమంగా శకుంతలను గురించి, కాళ్లు చేతులు నాకి, ఏదో జ్ఞాపకం వచ్చినట్టు చూస్తూ నిలబడింది. దాని పిల్లా అక్కడే ఉంది. దానికీ తల్లికీ వ్యత్యాసం చెప్పేట్టే లేదు. శకుంతల అక్కడి నుంచి కదలి తనను రాజు మొట్టమొదట చూచిన చోటు, తాను ఆయన కూర్చున్న చోటు, తన ప్రేమ లేఖ వ్రాసిన చోటు, మాలినీ తీర స్నాన ఘట్టం — చూచింది. ఆమెకు తన బాల్య గాథ మరల కళ్ల ఎదుట నడచినట్టయింది. ఆ ఉల్లాస మేమిటి ? ఆ ఉత్సాహ మేమిటి ? ఆ సరళ భావన లేమిటి ? నేడు అప్పటికంటే ఎక్కువగా సుఖ సామగ్రి ఉన్నది, అయితే, ఆనాటి సుఖం లేదు, శకుంతల మనసు చిన్నపోయింది ఆ నాటి ఆమె బ్రతుకు మరొకరి బ్రతుకులాగా కనిపించింది. ఆశలో సుఖంలేదు. ఆశ ఎరుగని సుఖమే సుఖం — అని ఆమె మనస్సుకు తోచింది. అలాగే ఆమె చెలులతో పాటు అక్కడా యిక్కడా తిరుగాడి మరల విడిది చేరింది.

మధ్యాహ్నం శార్ఙ్గరవుడు ఆమెవిడిదికి వచ్చి "ఆనాడు మిమ్మల్ని రాచనగరులో విడిచి వచ్చేటప్పుడు దురుసుగా మాట్లాడాను. అవన్నీ జ్ఞాపకం ఉంచుకోకండి," అన్నాడు. శకుంతల "నన్ను బహు వచనంతో పిలుస్తున్నావా అన్నయ్యా ! ఏన్నటికైనా, ఏమైనా నేను నీ చెల్లెలిని. ఇంతకూ ఆ నాడు నీవు అన్నది అప్పటి సందర్భంలో తప్పుకాదు. ఇప్పుడెలా తప్పవుతుంది ? నీవు నా అన్నవని మాత్రమే నాకు తెలిసిన సంగతి. తక్కినది నాకు జ్ఞాపకమే లేదు," అని అతనికి ధైర్యం చెప్పింది.

సాయంకాలం కణ్వ మహాముని విడిదికి వచ్చి శకుంతల వద్ద కూర్చుని, "నీవు మరొకమారు ఇక్కడికి వచ్చేటప్పుడు, నేను రమ్మన్నానని చెప్పి చక్రవర్తిగారిని పిలుచుకొని రావాలమ్మా ! నా దగ్గరికి రావడానికి సంకోచం వద్దని చెప్పు." అన్నారు. శకుంతల "పిలుచుకొని వస్తాను," అన్నది. తగ్గుత్తికతో.

శకుంతల మరునాడు, తెలతెలవారగానే లేచి, కాలకృత్యాలు ముగించి, తను తెచ్చిన నగలు, నాణ్యాలు, ఉడుగరలు, వస్త్రాలు అందరికీ పంచి పెట్టి, పెద్దలకు. వందనం ఆచరించి, పోయి వస్తానని చెలులకు చెప్పి, మరల హస్తినా పురికి బయలు దేరింది. ఇంతకు ముందు ఆమె ఆశ్రమంనుంచి బయలు దేరిన సందర్భం ఆమెకూ, తక్కినవారందరికీ బాగా జ్ఞాపకం ఉంది. ఆనాడు ఆమె కాలి నడకను బయలు దేరింది , నేడు రథమెక్కి బయలు దేరింది. ఆనాడు గర్భంలో ఉన్న కుమారుడు నేడు పెరిగి శుక్ల పక్ష సప్తమీ చంద్రునివలె ఆమె ప్రక్కన రథంలో కూర్చున్నాడు. అప్పుడున్న శంకా సందేహాలేవీ నేడు లేవు. ఇది తక్కిన వారందరికీ చాల సంతోష కరమైన సంగతి. శకుంతలకు మాత్రం మానసిక స్థితి ఆనాటి స్థితికంటే చాల భిన్నంగా ఉంది. కారణం తెలియకనే ఆమె ఆనాటి వలెనే నేడూ ఉత్కంట్సత అయింది. మరల ఈ ఆశ్రమానికి వచేటట్లయితే, భర్తతో పాటు రావాలి, వచ్చిన మీాదట హస్తినాపురికి వెళ్లగూడదు — అనిపించింది ఆమెకు. నొప్పి తెలియక నవ్విన నవ్వే నవ్వు, నొప్పిని దిగమింగి నవ్వే నవ్వు కాదు—కణ్వ మహాముని పెంపుడు కుమార్తెకు ఇది అనుభవానికి వచ్చింది. నిజమైన సుఖాన్ని వెనుక వదలి పెట్టి వస్తున్నాననే జ్ఞానంతోనే ఆమె రథమెక్కి హస్తినాపురికి తరలింది.

---

# 4. నేను చంపిన యువతి

కన్నడమూలం : శ్రీ 'ఆనంద'

అనువాదం : తిరుమల రామచంద్ర

[కన్నడం చదువు వ్రాత తెలిసిన ప్రతివారికి 'ఆనంద' అనే పేరు చాల ఇష్టమయింది 'ఆనంద' ఎవరు అంటే "నేను చంపిన పిల్ల" (నాను కొంద హుడిగి) అనే కథను వ్రాసిన వారు, అని ఏ కన్నడవాడైనా చెబుతాడు.

'ఆనంద' అనే సాహిత్య నామ దేహంతో ప్రసిద్ధి పొందిన శ్రీ అంజ్జంపురం సీతారాం 1907 ఆగస్టు 22వ తేదీన ఆనవట్టి అనే గ్రామంలో జన్మించి, శివమొగ్గ, బెంగళూరులో విద్య పూర్తి చేసి, మైసూరు ప్రభుత్వం పట్టు శాఖలో పది సంవత్సరాలు పని చేసిన తర్వాత రాజీనామా యిచ్చి, పట్టు తయారీకి, సున్నం తయారీకి ఫ్యాను కొని కొసకు వాటిని కూడా వదలి, రచనా వృత్తిలోనే పూర్తిగా మగ్నులయ్యారు.

వీరు మొదట వ్రాసిన కథ భవతి భిక్షాం దేహి' అది 1922 లో వ్రాసినది నేను చంపిన పిల్ల' (నాను కొంద హుడిగి') రచించింది 1928లో వీరి కథలు ముఖ్యంగా రెండు విధాలు : ఇంగ్లీషు, డచ్, ఫ్రెంచ్, రష్యన్ కథలను భారతీయ వాతావరణానికి పొను పరచినవి కొన్ని : స్వకీయ ప్రతిభతో స్వాను భావంతో నిండినవి కొన్ని. శృంగారం మొదలయిన లలిత భావాలను అత్యంత రమణీయ్య శైలితో మనసు తాకెట్లు చిత్రించడంతో మానవ హృదయంలోని సూక్ష్మాతి సూక్ష్మ రీతులను విచ్చి చూపడంలో వీరు సిద్ధ హస్తులు. ప్రపంచ కథకులలో అగ్ర పంక్తిలో నిలువగల సమర్థులని చెప్పదగినవారు.

శ్రీ ఆనంద ఉత్తమ చిత్రకారులు కూడ. వర్ణ లేఖా చిత్ర రచన వీరి ప్రీతి పాత్రమైన ప్రసంగం.]

ఏడెనిమిది సంవత్సరముల నాటి మాట. వేసవి సెలవుల్లో మన మైసూరు రాష్ట్రమంతా పర్యటించి వద్దామని బయలు దేరాను. మన దేశంలోని పేరు మోసిన శిలాశిల్ప రాతులను ఛాయా చిత్రాలు తీసి, భద్ర పరచుకుందామనే పిచ్చి ఉండేది— లెండివాకు. సోమనాథపురం, బేలూరు, హళెయబీడు మొదలయిన క్షేత్రాలలోని దేవాలయాల వర్ణనలను పుస్తకాలలో చదివి నప్పుడు "ఉండనీ ! చావకుండా బతికి ఉంటే ఒకరోజు కాక పోతే మరొక రోజు వాటిపన్నిటిని కండ్లార చూచి వస్తాను" అనుకునే

వాణ్ని. కనుక నేను పర్యటనకు బయలు దేరినప్పుడు నా ఆ స్వప్నం నిజమయేటట్టు ఉంది కదా ! —అని సంబర పడ్డాను. ఇక్కడ నేను ఇక ముందు చెప్పే విషయం—నా పర్యటనను గురించిన ఉపన్యాసం కాదు—నా పర్యటన మధ్యన, ఒక పల్లెటూరిలో జరిగిన ఒకటి రెండు రోజుల సంగతిని గురించి.

ఆ పల్లెటూరి పేరు నాగవల్లి. నేను అక్కడికి వచ్చే సరికి నా పర్యటన మూడు వంతులు ముగిసింది—అనవచ్చు. అప్పటికి నేను సుమారు నూరు నూటయాభై చిత్రాలను సేకరించాను. అన్నీ నేను స్వయంగా తీసిన ఫోటోలు.

నాగవల్లిలో కరియప్పగారనే వారు చాల ప్రముఖులు. ఆ పల్లెకంతా యజమానిలా ఉండేవారు. నేను వారి ఇంట్లోనే బస చేశాను. కథ ఇక్కడినుంచి ప్రారంభమైందని అనుకోవచ్చు.

నేను ఆ పల్లెను చేరే సరికి రాత్రి సుమారు తొమ్మిది గంటలయింది. నా సామానంతా ఒక సంత బండిలో వేసి, నేను దాని వెంట నడిచి వచ్చాను. రాత్రి పూట ఆ ఎడ్ల బండిలో ప్రయాణం చేయడం నాకు మనస్కరించ లేదు. ఆ రాత్రి ఆ పల్లెలోనే ఉండి పోదామనిపించింది. "దిగడానికి సరైన స్థలం ఏదైనా ఉందా ? " అని బండి వాడిని అడిగాను. వాడు కరియప్ప గారి పేరు చెప్పి. "బాబూ, తమరు ఉత్తరు విస్తే వారి ఇంటికి వెళ్లిచెప్తాను. వారు అన్నీ అనుకూలాలు చేస్తారుబాబు!" అన్నాడు. నేను "కానీ" అన్నాను. ఇక పది బారల దూరం వెళ్లే సరికి వారి యిల్లు తగిలింది. నేను బండి దగ్గర నిలబడి ఉన్నాను. బండివాడు బండి దిగి ఆ ఇంటి వైపు వెళ్లి, ఒకటి రెండు నిమిషాల తర్వాత మరొకరితో పాటు తిరిగి వచ్చి "బాబూ, వీరే కరియప్ప గారు" అన్నాడు. కరియప్పగారు నా దగ్గరికి వచ్చి చాల నమ్రతతో నమస్కారం చేసి. "అయ్యాగారు ! దయ చేయండి, ఇది మీ యిల్లే అనుకోండి" అని అన్నారు. నేనూ వారికి ప్రతి నమస్కారం చేసి, "మీకు ఇబ్బంది కలిగించినట్టుయింది" అన్నాను. దానికి వారు "అయ్యగారూ ! లలా ఎక్కడైనా కద్దా ! నాకు ఇబ్బందేమిటి ? మీరు పెద్ద మనస్సుతో నా ఇంటికి రావడానికి ఒప్పుకున్నారు గదా ! అదే నా పుణ్యం. ఇబ్బంది గిబ్బంది అనకండి. ఇలా దయచేయాలి" అని తమ యింటి వైపు చేయి చూపుతూ, బండి వాణ్ని పిలిచి, "ఒరే తిమ్మ ! అయ్య గారి సామాను అరుగు మీదికి చేర్చరా !" అన్నారు.

మేము వెళ్లి వారి యింటి అరుగు పైన వేసిన చాప మీద కూర్చున్నాము. కరియప్పగారిది పెద్ద సంసారం, భాగ్య భోగాలతో నిండి కలకలలాడే యిల్లు. నేను వెళ్లి కూర్చోగానే, ముగ్గురు నలుగురు పిల్లలు లోపలి నుంచి వచ్చి కుతూహలంతో నా చుట్టు మూగారు. నా హేటు బూటు వారికి తమాశాగా కనిపించి ఉంటాయి !

అరుగుకు ఒక వైపున ఒక గది. ఇంటి నౌకరు ఆ గది తలుపు తీసి, కసుమాడ్చి చాప వేసి ఒక లాంతరు తెచ్చి పెట్టాడు. బండివాడు నా సామానంతా ఆ గదిలో పెట్టి వచ్చాడు. వాడికి ఇవ్వవలసిన అద్దె యిచ్చి పంపించేశాను. "ఇక దుస్తులు తీసి వేయండి అయ్యగారూ !" అన్నారు కరియప్పగారు. నేను లేచి గదిలోకి వెళ్లి, నా సూటు బూటు విప్పి, దోవతి కట్టుకొని, చొక్కా వేసుకొని, అరుగు మీదికి వచ్చాను. ఆ వేళకు ఎవరో లోపలినుంచి వేడినీళ్లు తీసుకు వచ్చి పెట్టారు. చేతులూ, కాళ్లూ, ముఖం కడుక్కున్నాను. అరగంటలో భోజనమైంది. మళ్లీ అరుగు మీద కూర్చుని, తాంబూలం వేసుకుంటూ మాట్లాడుతున్నాము. నా పర్యటన సంగతి వారికి వివరించి చెప్పాను. నేను వారింటిలో బస చేయడం వారికి చాల సంతోషం కలిగించిందన్న సంగతి వారి మాటల్లోనూ, చేతల్లోను తెలిసింది. మాటల సందర్భంలో వారి సంగతి కూడ కొంచెం తెలుసుకున్నాను. చాల స్థితి మంతులు. సాలుకు నాలుగు వందల రూపాయలు సర్కారు శిస్తు కడతారట. ఇంటినిండ జనం. నౌకర్లు చాకర్లు—పాడిపంట, దేనిలోను కొరత లేదు. ఇల్లూ పెద్దది గానే కట్టుకున్నారు, ఆ పల్లెకంతా అదే పెద్దది. అన్నిటికి మించి నా మనస్సులో హత్తుకు పోయింది వారి నిష్కపటమైన నమ్రత. అది వారందరికీ చాల స్వాభావికమనే నాకు తోచింది. మొత్తంమీద, వారి యింట్లో నాకు చాల ఉపచారం జరుగుతుంది అనుకున్నాను.

భోజనమైన తర్వాత చాల సేపు మాట్లాడ లేదు. దారి పొడుగునా నడిచి వచ్చి నందువ కొంచెం అలసటయింది. ఆ సంగతి కరియప్ప గారికి తెలిపి గదిలోకి వెళ్లి దీపం ఆర్పివేసి పడుకున్నాను.

తెల్లవారి మెలకువ వచ్చేటప్పటికి సుమారు ఆరున్నర—ఏడు అయి ఉండవచ్చు. ఆ వేళకే నా గది వెలుపల నీళ్లు సిద్ధంగా ఉన్నవి. ముఖం కడుక్కుని గదిలోనే కూర్చుని ఉన్నాను. కరియప్ప గారు తామే ఒక గిన్నెలో పాలు తీసుకొని వచ్చారు. వారి యింట్లో కాఫీ అలవాటులేదు. నాకు పాలు అలవాటులేదు. ఎలాగో—వారు అంత ఆదరంతో తెచ్చిన దాన్ని వద్దనకూడదని—పుచ్చుకున్నాను. ఆ మీాద, వారినిఅక్కడే కూర్చోమని, నేను పర్య టనలో తీసిన చిత్రాలనుచూపి, వాటినిగురించి నేనుతెలుసుకొన్న విషయాలను చెప్పాను. అది విని వారికి కలిగిన సంతోషాశ్చర్యాలను నేను వివరించలేను. వారు నన్ను చూస్తూ "అయ్యగారూ ! తాము ఒప్పుకొంటే—ఇక్కడే దగ్గర్లో ఒక దేవస్థానం ఉంది—రంగప్ప గుడి—చాల పురాతనంది. చెక్కడం పనితనం గొప్పది ! చాల దూర మేమి కాదు," అన్నారు. ఆ మాటలకు నా చెవులు నిక్క బొడుచుకున్నాయి.

"ఎక్కడండీ !" అని అడిగాను.

"ఇక్కడే, ఇక్కడికి ఒక పరువు దూరంలో మరడి చెట్టు గుట్ట అని ఉంది. దాని పె ్రదట్లోనే."

బేలూరులో తీసిన ఫోటోలు కొన్నిటికి టిప్పణం—వివరణం వ్రాయ వలసి ఉంది. అంతేకాక లక్ష్మికి ఉత్తరం వ్రాయవలసి ఉంది.

"సరే, అలా అయితే, రేపు తెల్లవారే అక్కడికి వెళ్లి వస్తాను, ఇవాళ కొంచెం వ్రాత పని ఉంది" అన్నాను.

"మీ చిత్తం—అలాగే కాని" అన్నారు కరియప్పగారు.

ఆ రోజు చిత్రాలకు టిప్పణం వివరణం వ్రాయడంలోనే పన్నెండయింది. భోజన మైన తర్వాత లక్ష్మికి ఉత్తరం వ్రాయడానికి కూర్చున్నాను. నా పర్యటనలో తీరిక దొరికి నపుడల్లాఆవిడకు ఉత్తరం వ్రాసే వాణ్ని. అన్ని ఉత్తరాలలోనూ నా పర్యటన విషయమే—నేను చూచిన దేవస్థానాలు—దృశ్యాలు, వాటి వర్ణన ఇత్యాది. నా పర్య టనలకి లక్ష్మి తలపు నన్ను నిత్యమూ విడువకుండా వెన్నంటే ఉండేది. ఎన్నో సార్లు "అయ్యో ! ఈ సొబగును చూడడానికి నా లక్ష్మి లేదే ! ఆవిడ నా దగ్గర ఉంటే ఈ శిల్పాల సొబగు ఇనుమడించేది" అనుకొన్నాను. ఆ రోజు నేను నాగవళ్లికి రావడం, అక్కడ కరియప్పగారి సోదరాతిథ్యం—ఉపచారం—వారి పిల్లా జెల్లా సంగతి అంతా వ్రాసి—రేపు మరడి చెట్టుకు వెళ్ల దలచింది తెలిపి—తర్వాత మా సంగతులు కొన్ని వ్రాసి, ఉత్తరం ముగించాను. ఆ పల్లెలో తపాలాఫీసు లేదు. ఒక తపాలా పెట్టె మాత్రం ఉంది. వారానికి రెండు సార్లో, మూడు సార్లో బేలూరునుంచి టప్పా బంట్రోతు వచ్చి ఉత్తరాలు తీసుకోని వెళ్తుతాడట. కనుక్కోగా ఈ సంగతి తెలిసింది. కాని, తపాల పెట్టె ఎక్కడుందో నాకు తెలియదు. నౌకరులెవరైనా ఉంటే వారితో ఉత్తరం తపాల పెట్టెలో వేయిద్దామనుకొని, గదిలో నుండి వెలుపలికి వచ్చాను. నేను వెలుపలికి వచ్చి నప్పుడు గదికి ఎదురుగా ఒక ప్రాయంలో ఉన్న అమ్మాయి అరుగు స్తంభాన్ని ఆనుకుని కూంర్చుని ఉంది. ఇంటి యజమాని కూతురు కావచ్చునని తోచింది. నేను, వెలుపలికి వచ్చి, అక్కడ నౌకరెవరు లేకపోవడం చూచి ఏమిచేయడానికి తోచక నిలబడి ఉన్నాను. ఇంతలోకే నేను చూచిన అమ్మాయి లేచి వచ్చి "ఏం బాబూ! ఏం కావాలి?" అంటూ కొద్దిగా నవ్వు ముఖం పెట్టింది. ఆ పల్లెపడుచు వినయాన్ని, సరళతనూ చూచి నాకు చాల సంతోషమైంది, నేనన్నాను—

"ఏమీ లేదమ్మా ! ఈ ఉత్తరం తపాలాకు పంపవలసి ఉంది. ఆ పెట్టె ఎక్క డుందో నాకు తెలీదు. చెబుతావా ?"

ఆమె నవ్వుతూ, నా వైపురెండడుగులు వేసి, "అదెందుకండీ బాబూ ! అంత శ్రమ తమకు ? ఆ ఉత్తరం ముక్క ఇవ్వండి బాబూ నేను వెళ్లి వేసి వస్తాను" అన్నది.

ఆమె మాటలువిని, ఆమెతో మరి రెండు మాటలాడదామని పించింది ! . . .

"నీకు శ్రమ కాదూ ?" అని అడిగాను.

అయ్యో బాబూ ! అదేం శ్రమండీ ? మీరు పెద్ద మనుషులు !"

"అహా లయితే నీకు శ్రమ లేదు కదా ?"

"లేదు, బాబూ ! ఇవ్వండి ఆ ఉత్తరం ముక్క."

—ఇలా అని రెండు చేతులు ముందుకు చాచింది. నేను ఉత్తరం ఆమె చేతికిచ్చి "నీ పేరేమిటి ?" అని అడిగాను.

"నా పేరు చెన్ని," అని కొంచెం సిగ్గుతో చెప్పి వెళ్ళిపోయింది.

సొగసైన పేరు—అనుకున్నాను. చెన్ని చక్కగా మాట్లాడింది. ఆమె ముఖంలో ఆ నమ్రభావం—కళ్ళల్లో ఆమె హృదయపు నిర్మల ఛాయ— మాటల్లో పల్లె పట్టుల ఒకానొక లాలిత్యం— ఇవి ప్రతిదీ నా మనస్సులో నాటాయి.

ఆ రోజు మధ్యాహ్నం భోజనమైన పిదప కొంచెం కునుకు పట్టింది. మేల్కొనే సరికి సుమారు నాల్గుగంటలయి ఉంటుంది. ముఖం కడుక్కొనటానికి గది నుంచి వెలుపలికి వచ్చాను. మళ్ళ ఆ అమ్మాయి నేను మొదట చూచిన చోటే స్తంభానికి ఆనుకుని కూర్చుంది. నేను వెలుపలికి రావడం చూచి చాచిన కాళ్ళు ముడుచుకొని, ఏదో పర ధ్యానంలో చీర చెరుగు పోగులను లాగడం మొదలు పెట్టింది. నాకు నీళ్ళు కావాలి. అక్కడ అడగడానికి మరెవరూ లేరు. అప్పుడే ఒక సారి ఆమెను పంకరించే ఉన్నాను; కనుక ఇప్పుడు ఆ చనువు తోనే ఆమెకు "చెన్నమ్మా, కొంచెం నీళ్ళు కావాలి, మొగం కడుక్కోడానికి" అన్నాను. "అలాగే బాబూ" అంటూ చిరు నవ్వుతో, ఎంతో సంబరంతో ఇంట్లోకి వెళ్ళింది. చెన్నమ్మ పుట్టుకలోనే చిరునవ్వులో పుట్టినట్టు ఉండేది. నేను చూచి నప్పుడెల్లా ఆమె ముగ్ధ వదనం తేట నవ్వుతో వెలుగొందేది. పట్టణాలలో యువతుల మందహాసాలను పెక్కు సందర్భాలలో చూచాను. కాని, అవి సామాన్యంగా పెద్ద పెద్ద మానులును పెల్లగించి దుమ్ము దుమారం లేపే సుడి గాలి వలే మనస్సులో హోరెత్తించే కెరటాలు రేపి, అల్లకల్లోలం చేసే మందహాసాలు. చెన్నమ్మ చిరు నవ్వు అలాటిది కాదు—అది మృదువుగా అక్కడవీచి, ఇక్కడ వీచి, చిగురు జొంపాలలో దూరి, పూగుత్తులపై పాకి, పరిమళం తీసుకుని వచ్చే చల్లగాలి వలే—హృదయంలో చిరుతరగలుపుట్టించే సరళమైన మందహాసం. సుడిగాలిలో చిక్కుకుంటే వట్టి ధూళి ! కంటూ నోటూ మట్టి ! దానితో సౌరభం లేదు. ఈ పల్లె పడుచు నవ్వుతోనో ? వో ! ఇది మల్లె పూవువంటిది మల్లె పూవుది ఎంత నిర్మలత ! మినలేని పరిమళం ! . . . . . . ఇంత ఆలోచనలో ఉండగా, చెన్నమ్మ నీళ్ళు తెచ్చింది. చేతులూ, కాళ్ళూ, ముఖం కడుక్కొని గదిలోకి వెళ్ళేలో గా చెన్నమ్మ కొంచెం ఫలహారం, ఒక గిన్నెలో పాలు తెచ్చి పెట్టి వెళ్ళింది. ఫలహారం ముగించి, అలా తిరిగి వద్దా మనుకొని, నా పిల్లంగోవిని, చేతి కేమరాను తీసుకుని గదినుంచి బయలు దేరాను. వెలుపలికి వచ్చినప్పుడు చెన్నమ్మ ఆ చోటనే కూర్చుని ఉంది. నేను ఇల్లు దాటి నాల్గడుగు బారల దూరం వచ్చాను. ఏ వైపు వెళుదాము—అని

ఆలోచిస్తూన్నాను. ఇంటి వెనకాల వాళ్ల తోట ఉందని విన్నట్టు గుర్తు వచ్చి అక్కడికే వెళ్లుదామని నిశ్చయించుకున్నాను. కాని, దారి తెలీదు. ఏమి చేయాలి అని ఆలోచిస్తూ సరి చెన్నమ్మనే అడిగి వేల్దామనుకొని, మళ్లీ "ఏమమ్మా ! మీ తోట ఉందట కదూ ! దానిని చూద్దామను కొన్నాను. ఎలా వెళ్లాలో చెబుతావా ?" అని అడిగాను. ఆమె "కానిండి బాబూ", అంటూ చప్పున లేచి వచ్చి, నన్ను ఇంటి పెరడు వైపు తీసుకుని వెళ్లి, ఒక కాలిబాట చూపి, "ఇదేనండి బాబూ దారి, మా తోటకు," అన్నది. "సరి ఇక వెళతాను," అని చెప్పి బయులు దేరాను. కాలి బాటకు వెనుకగా కూర గాయల తోట దాటి, పెద్ద తోటకు వెళ్లాను. ఇంతలో గాలికి నేను కప్పుకున్న ఉత్తరీయం కొస కూరగాయల తోట ముళ్ల కంచెకు తగులుకొంది. విడిపించు కొనడానికి వెనక్కి తిరిగాను. చెన్నమ్మ నేను ఆమెను వదలి వచ్చిన చోటే నిలబడి ఉంది. నేను దారి తప్పి పోతానని అనుమానమో ఏమో ఆమెకు— అనుకున్నాను.

సుమారు నూరు గజాల దూరం వెళగానే తోట వచ్చింది. అది చాల సొగసైన తోట. దానిలో ఎక్కువగా ఉన్నవి పోక, కొబ్బరిచెట్లు. ఇక కొన్ని పళ్ల చెట్లూ ఉన్నవి. సహజంగా రమ్యమైన ఆ తోట సొబగు ఆ రోజు సాయం సూర్యుని బంగారు కాంతితో నూరంతలు హెచ్చింది. తోటలో ప్రవేశించి పది అడుగులు వేసే సరికి ఒక పెద్ద బావి కనిపించింది. అది ఏతం బావి. ఒక వైపు నీరు తీసుకొని వెళ్లేవారు దిగడానికి మెట్లు కూడా ఉన్నవి. బావి చుట్టూ సుమారు రెండడుగుల ఎత్తు రాతి గోడ. నేను ఆ పిట్ట గోడ మీద కూర్చొని తోట సౌందర్యం చవి చూడ సాగాను.

కొంతసేపు నా మనస్సు ఆ తోట సౌందర్యపానంతో మత్తిల్లి ఏదో అనిర్వచ నీయమైన ఆనందం అనుభవించింది. తోటలోని చల్లదనం గాలిలో కలిసి మెలిసి అంతటా పాకుతూ ఉంది. బావి చుట్టూ రకరకాల పూల చెట్లున్నాయి. వాటిపరిమళ మంతా చల్ల గాలిలో వెల్లి విరుస్తున్నది. నా నా జాతి పక్షుల కలకలారావం ఆకాశంలోను, చెట్లలోను, మానులలోను, అంతటా వినిపిస్తున్నది. నా హృదయమూ పక్షులతో పాటు పక్షి అయింది; పూలతో పాటు పూవయింది. కవులు కనిపించని స్వర్గాన్ని ఎందుకు వర్ణిస్తారో !—అనిపించింది. ఎక్కడ సుఖమో అక్కడే స్వర్గం! —హృదయం ఆనందంతో అంచులు నిండి పారింది. ఆ ఆవేగంలో, ఆవేశంతో పిల్లంగోవిని ఊదడం ప్రారంభించాను. పిల్లంగోవినుంచి వెలువడిన ఒక్క స్వరం నూరు స్వరాలుగా తోటంతా నిండి ప్రతి ధ్వనించింది. నా వేణు గానానికి నేనే ఉబ్బిపోయాను. ఒకటి రెండు కీర్తనలు వేణువులో వాయించి, తర్వాత నోటిలోనే ఆలపించడం ఆరంభించాను. తోటలోకంతా నేనొక్కన్నే అన్న ధైర్యంతో నోటికి వచ్చినట్లెల్లా పాడసాగాను. ఉన్నట్టుండి నా వెనుక "బుడుంగు బుడుంగు" మని శబ్దమైంది. నేను వెంటనే పాడడం ఆపి తిరిగి చూచాను. ఆ అమ్మాయి—చెన్ని. మెట్లగుండా బావిలోకి దిగి నీటిలో బిందె నింపుతున్నది. నేను తిరిగి చూచినప్పుడు ఆమె తల యెత్తి నన్ను చూస్తూంది. నాకు చాల సిగ్గయింది.

నేను పట్టణవాసం నాగరికుణ్ణి అని మీరు గౌరవంతో చూచినందుకూ, నేనిప్పుడుగొల్ల పిల్లవానిలా పిల్లంగోవి ఊదుతూ నోటికి వచ్చిన దెల్లా వాగుతున్నందుకూ సరిపోయింది! —అనుకున్నాను. నేను మెట్లవైపు వీపు చేసికూర్చునందున ఆమెఎప్పుడు వచ్చిందీ నాకు తెలియలేదు; నాసంగీతావేశంలో ఆమెగాజుల సద్దు కొని, కాలి అందెలరవళిగాని నాకువినిపించ లేదు. ఏమైనా అప్పటి నా స్థితి చాల లజ్జా కరమైంది. ఒక్క క్షణం నేనే "ఏమైంది లేవోయ్" అనుకున్నాను. అయినా మనస్సు సమాధాన పడలేదు. నవ్వు వచ్చేటట్టయింది. పిల్లంగోవిని పక్కన పెట్టి "కేమరాను" చేత్తో తీసుకొని, దానిని చూస్తున్నట్టు నటిం చాను. ఆమె బిందె ముంచుకొని మెట్లన్నీ ఒక్కొటొక్కటిగా ఎక్కివచ్చినట్టు నా మన స్సుకు తట్టింది. మెట్లన్నీ ఎక్కిన తర్వాత—ఆమె పాదాల చప్పుడు వినిపించలేదు. ఎంత సేపటికి వెళ్లి పోతుందో —అనిపించింది. కాలి చప్పుడుకు బదులు చేతి గాజుల గల గల వినిపించింది. మళ్లీ ఆమె ముఖం చూడడానికి సిగ్గయింది ! అయినా, తిరిగి చూచాను ! ఆమె తెల్లగా తోమిన రెండు ఇత్తడి బిందెలనిండా నీళ్లు ముంచుకొని, మెట్లన్నీ ఎక్కి వచ్చి, ఆ బిందెలను బావి గట్టు మీద పెట్టింది. ఆ సమయంలోనే నేను మళ్లా ఆమెను చూడడం. నా విచిత్ర సంగీతంతో మొలకెత్తిన నవ్వు ఇంకా ఆమె ముఖం మీద మెసలు తూనే ఉంది. నాకు మరీ సిగ్గేసింది. ముఖం తిప్పుకొని, కూర్చున్నవాణ్ణల్లా లేచాను. ఎవరో ఏమిటో మాట్లాడినట్టు తోచింది. నా మనస్సులోని గలభాలో అదేమిటో తెలియు లేదు. మళ్లీ ఆమె వైపు తిరిగి, "ఏమిటమ్మా !"అని అడిగాను. "ఆమె పాట పాడడం మానేశారేం బాబూ !" అని అడిగింది. ఆమె అడిగిన ఈ ప్రశ్నతో నా మనస్సులో కలిగిన కలవరం, అవమానం భగవంతునికే ఎరుక ! ఏమి చెప్పాలో వెంటనే తోచక "అ(—ఊ)" అని పళ్లికిలిస్తూ, తర్వాత పాట అయిపోయిందమ్మా" అన్నాను. ఆమె ప్రశ్న అపహాస్యంగా తోచినా, నాకు కోపంరాలేదు. కోపం ఎందుకు ! నేను చేసిందేమో రోత పని ! అప్పటి నా మనస్స్థితిలో అది అపహాస్యంగా అగుపించి ఉంటుందేమో కాని, నిజంగా, హాసన్ముఖి అయిన ఆ పల్లెసీమ ముగ్ధకునన్ను పరిహసించే అభిప్రాయం ఉండదని తోచింది. ఏమైతేనేం, జరిగిందేదో జరిగి పోయింది, ఇక ఇక్కడి నుంచి కదులు దాం—అనుకొని పిల్లంగోవిని, కేమరాను చేత్తో తీసుకొని ఒకటి రెండంగలు ముందుకు వేశాను. అంతలోకే "బాబుగారు!" అని పిలుపు వినబడింది. "మరల ఇదేమిటి బాబూ గారూ ?" అనుకుంటూ తిరిగి చూచాను. ఆమె ఒక నిండు బిందెను నెత్తిమీద పెట్టుకుంటూ ఉంది. మరొక బిందె గట్టు మీదే ఉంది. నేను తిరిగి చూడడం చూచి, గట్టు మీది బిందెను చూపుతూ "బాబూ" ఆ బిందెను కొంచెం ఎత్తి ఇస్తారూ !" అని సిగ్గుతోను, కొంచెం సంకోచం తోను అడిగింది. నేను "హో ! తప్పకుండా," అంటూ చేతిలో ఉన్న కేమరాను, పిల్లంగోవిని కింద పెట్టి, ఆ బిందెను ఎత్తి ఆ నడుం మీద పెట్టాను. నేను ఇదంతా చేయడం ఆమెకు గొప్ప అనిపించి ఉంటుంది. ఆమెముఖంలో సంతోషం ఉట్టిపడినట్టు కనిపించింది. ఇంటిదారిపట్టి నెమ్మదిగా నాల్గయి దడుగులు వేసింది నిండు బిందెల బరువుకు కదులుతూపోతున్న ఆనిండుజవ్వనం, సంధ్యా

సూర్యుని స్వర్ణకాంతిలో అత్యంత మనోహరంగా కనిపించింది. వెంటనే నా మనస్సులో ఆమెను నిలబడ్డట్టుగానే ఫోటో తీద్దామనే ఆశ కలిగింది. కేమరాను సిద్ధం చేసుకొని, ఆ అమ్మాయి ఏ మనుకుంటుందో అనే యోచనకూడా లేకుండా "చెన్నమ్మా" అని పిలిచాను. ఆమె—ఆ బరువుతోనే నెమ్మదిగా వెనక్కి తిరిగి "పిలిచారా బాబుగారు?" అని అడిగింది. నేను "ఊఁ" అని, ఆమె దగ్గరికి వెళ్లి "తల్లీ నీవు ఒక్క క్షణంలాగే నిలబడుతావా?"అని అడిగాను. ఆమెకు కొంచెం ఆశ్చర్యమయి ఉంటుంది, ఆ చిహ్నాలు ఆమె ముఖంలో కనిపించాయి. ఆమె ఆ సంజ నీరెండకు ఎదురుగా కదలుతూ నిల బడింది. ఆమెముఖంమీద ఎల్లప్పుడూ, ఎడతెగక నర్తించేలే నగవు త్వరలోనే మరు గయ్యే బంగారు సూర్య కిరణాలలో సుందరంగా లీనమై పోయింది. నేను ఫోటో తీసి, "ఇక నీవు వెళ్ల వచ్చమ్మా" అన్నాను. ఆమె ఆతురతతో, "అదేమిటి ? ఏం చేశారు? బాబూ ?" అని అడిగింది. ఆమెకు అర్థమయ్యేట్టు చెప్పడం ఎలా ? "రేపు చెబుతాలే" అన్నాను. ఆమె వెను దిరిగి నిదానంగా ఇంటి వైపు నడచి వెళ్లింది.

ఆ రాత్రి భోజనమైన తర్వాత గదిలోకి వెళ్లి పక్క మీద పడుకున్నాను. త్వరగా నిద్ర పట్టలేదు. సాయంకాలం తోటలో జరిగిన సంగతి ఇంకా మనస్సులో మెదలు తున్నది. నాలో నేనే నవ్వుకొని—లక్ష్మికి ఈ సంగతి చెబితే ఏమంటుందా ! ఎంత నవ్వు తుందా ! —అనుకున్నాను. నాకు నవ్వు ఆగలేదు.

వెనుకటి రాత్రి నిద్ర పోయినప్పుడు చాల పొద్దు పోయినట్టుంది. ఉదయం లేవగానే ఎనిమిది కొట్టింది. త్వరగా ముఖం కడుక్కొని, తిండి, తీర్థం ముగించు కొని, మరడి చెట్టుకు వెళ్లడానికి సిద్ధమయ్యాను. కరియప్పగారు ఒక నౌకరు నా వెంట రావడానికి ఏర్పాటు చేశారు. కావలసిన నా సామగ్రిని వానితో మోయించుకొనిబయలు దేరాను. మరడి బెట్టలో పని ముగించుకొని తిరిగి వచ్చే సరికి సుమారు 12 గంటలయి ఉంటుంది. తిరిగి వచ్చే టప్పుడు కాలిబాటకు కొంచెం దూరంలోని పచ్చిక బీడులో పశువులు మేస్తున్నవి. అక్కడక్కడ రైతులు పొలం పనులు చేసుకొంటున్నారు. ఉన్నట్టుండి దూరంలో ఒక గొల్ల పిల్లడు లావణి పాడడం ప్రారంభించాడు. వానికి ఎవరిదేమి భయం ? గొంతెత్తి శ్రావ్యంగా అందుకున్నాడు, చాల తమాషాగా ఉంది. కొంచెం సేపు నిలబడి విందామని పించింది. కాని నా వెంట నౌకరున్నాడు; నవ్వారా డేమోనని జంకు. అంతేకాక గత సాయంకాలం జ్ఞాపకం వచ్చింది. నిలవలేక పోయాను. అలాగే జాచెన్నమ్మ జ్ఞాపకం వచ్చింది. ఆ పల్లె పడుచు సహజ మధుర మందహాసం నా కళ్ల ముందు నాట్యాలు చేసినట్లయింది. చెన్నమ్మ ఇంటి యజమాని కుమార్తె అయి ఉంటుందని ఊహించానే కాని, నిజమైన సంగతి తెలీదు. తెలుసు కుందామనే కుతూహలంలో నౌకరును చూచి "మీ యజమానుని ఇంట్లో ఉండే ఆడద యెవరోయ్ ! అని అడిగాను.

నౌకరు నిలబడిపోయి, తిరిగి నా వైపే చూస్తూ "ఏవిడండీ బాబూ"! అని అడిగాడు. నేను ఎవర్ని గురించి అడిగానో వాడికి అర్థం కాలేదు. నేను "ఆ చెన్నమ్మ అని ఉందికదూ, ఆవిడ ?" అన్నాను. నౌకరు నా వైపే చూస్తున్నవాడు, నా ప్రశ్నవిని పక్కన నవ్వి ముఖం అవతలికి తిప్పుకొని "ఎందుకు బాబూ ?" అని తిరుగు ప్రశ్న వేశాడు. నాకు చాల అవమానమైనట్టులయింది, సిగ్గయింది. ఈ నౌకరు నా ప్రశ్నలో ఏదో దురుద్దేశం కనిపెట్టినట్టయింది కదా—అని మనస్సులో ఒక క్షణం చాల గజిబిజి అయింది. లక్ష్మి తప్ప నా ప్రాణమే లేదని ఈ మూర్ఖునికి తెలిసేది ఎలా ? వాడేమో వ్యంగ్యంగా నవ్వి "ఎందుకు బాబూ !" అని అడిగేశాడు, నేను,

"ఎందుకు లేదోయ్—ఊరికేనే అడిగాను—అడగ కూడదా?" అన్నాను.

"అయ్యో ! దానికేమండి బాబూ !—పరవాలేదు. ఆమె మా దొరగారి కుమార్తె." అన్నాడు.

మరొక ప్రశ్న నాలుక చివరిదాకా వచ్చింది, కాని, తమాయించాను ! "ఎవరు ఆమె ?" అని అడిగినందుకే నవ్వినవాడు ఇక "పెండ్లి కాలేదా ?"అని అడిగితే ఇంకే మసుకుంటాడో — అని భయపడ్డాను; మాట్లాడకూరుకున్నాను.

ఇంటికి వచ్చి స్నానం చేసి, భోజనం ముగించి, గత సాయంకాలం తీసిన చెన్నమ్మ ఫోటో మూడు నాలుగు అచ్చులు తీశాను. ఫోటో చాల చక్కగా వచ్చింది. ఇంటి వాళ్ళంతా చూచి సంతోష పడ్డారు.

మధ్యాహ్నం భోజనం ఆలస్యమైంది. కనుక రాత్రి ఆకలి కాలేదు. రాత్రి భోజనం చేయనని ఇంటి వాళ్లకు చెప్పాను. నిద్ర కూడత్వరగా వచ్చేట్టు కనిపించ లేదు. ఏమి చేయడానికి తోచక కొంత దూరం అల్లా తిరిగి వద్దామని బయలు దేరాను; తిరిగి గదికి వచ్చినప్పుడు తొమ్మిది గంటలైంది. ఇంకా నిద్ర దూరంలో ఉన్నట్టు తోచింది. లాంతరు వెలిగించి పక్క వేసుకొని, పడుకుని ఏదో నవల చదవడం ప్రారంభించాను. సుమారు పది నిమిషాలు చదివి ఉంటాను. అప్పుడు గది తలుపు చప్పుడయినట్టయింది. గాలి కాబోలుననుకొని మళ్లీ నవల చదువుతున్నాను. మళ్లా తలుపు చప్పుడైంది. ఈ సారి నెమ్మదిగా తట్టినట్టయింది ! పక్కమీ ద పడుకున్నట్టుగానే "ఎవరయ్యా అది ?" అని అడిగాను. జవాబు లేదు. ఒక క్షణం ఆగి, మరల ఎవరో మెల్లిగా తలుపు తట్టి నట్టయింది. లేచి కూర్చుని "ఎవరది ?" అని గద్దించి అడిగాను. చేతి గాజుల సద్దయింది ! దానికి తోడు సన్నని గొంతుకతో "నేను, చెన్నిని" అని సమాధానం వచ్చింది ! నాకు ఆశ్చర్యమైంది. ఇంత పొద్దు పోయి, ఈమెకు నాతో ఏమిటి పని? —ఏమైనా కాని, కనుక్కుందామనుకొని, లేచి, తలుపు తీసి, వెలుపలికి తొంగిచూచి, "ఏమిటమ్మా ?" అని అడిగాను. నా గదిలోని వెలుతురు కొద్దిగా ఆమె దేహంపై పడుతున్నది. ఆమె చేతులో—ఒక పళ్లెం, దానిలో నాల్గైదు అరటి పండ్లు, కొంచెం

, ఒక గిన్నెలో కొద్దిగా పాలు—ఇవి ఉన్నాయి. నేను "ఏమిటమ్మా ?" అని
ందుకు ఆమె "బాబూ, మీకు ఈ పూట భోజనం లేదుగా, అందుకోసం
," అన్నది. నాకు అప్పుడు సన్నగా ఆకలి వేస్తున్నది. "చాల సంతోషమమ్మా"
మె చేతి నుంచి పళ్లెం అందుకొని, పక్క దగ్గర పెట్టడానికి వెళ్లాను. చెన్నమ్మ
టనే గదిలోకి వచ్చింది ! నా గుండె కొంచెం కొట్టుకుంది ! ఆ సమయం అలాటిది.
ళ్లెం పక్క సరసనే పెట్టి తిరిగి "ఇకనేమి అక్కర లేదమ్మా, నీవు ఇక వెళ్లవచ్చు
. ఆమె నవ్వుతూ, "నేనుంటే ఏమి బాబూ. మీరు పళ్లు తినకూడదా?
నేను "ఓ! తినవచ్చు, అందుక్కాదు నే నన్నది. ఇప్పుడు నాకింకేమి అక్కర్లేదు.
క, ఇంత పొద్దుపోయి నీ వొక్కతివే ఇక్కడ ఉండడం . . . "నేను మాట పూర్తి
వుగానే ఆమె నా గది తలుపులు మూసి గడియ పెట్టేసింది. ! ఆమెనా గది
చ్చిన వెంటనే నా మనస్సులో మసక మసకగా తోచిన భావం ఇప్పుడు స్పష్టమయింది.
తలుపు వేయడం చూచి, ఉన్న దున్నట్టుగా నా ఒళ్లు వణికి వేడెక్కింది. ముఖం
చెమట కమ్మింది. గొంతు ఎండి పోయి, గుటకలు మింగ సాగాను. అతి
తో "ఏ—ఎందుకమ్మా, త . . . తలుపు . . . వేశారు ?" అని అడుగుతూ
నికి రెండడుగులు వేశాను. చెన్నమ్మ గుర్రుమని జరిగి తలుపుకు అడ్డంగా నిలబడి
వ్వ నవ్వ సాగింది ! నా మోకాలి కీల్లే పట్టువదలినట్టయింది. సరి ! ఇక ఏమీ
ం లేదు ! ఆమె అభిప్రాయం నా గుండెలమీద ఉలి వ్రాసినట్టయింది ! నా
లో అనుకున్నాను. "ఇదా ! పల్లెటూరి ముగ్ధ" అని.

నాకు నిలబడడానికి కాళ్లే లేనట్టయింది. వెళ్లి విసురుగా పక్క మీద కూర్చుని,
చేతులతోను తల పట్టుకొని యోచన చేయసాగినాను.

ఇక్కడ ఆపై విషయాన్ని తెలుపడాని ముందు, వేరే ఒకటి రెండు
ు చెప్పాలని ఉంది. వినండి. ఆ నాటి రాత్రి నన్ను పాపపు వలనుంచి
ి రక్షించినది నా లక్ష్మి. ఆమె ప్రేమ అనే కంచుకోట నన్ను పూర్తిగా ఆవరించి
నేనూ, ఆమే ఒక్కటయినప్పటినుంచి ఇంతవరకూ, నేను ఆమెలో కానని దాన్ని
డా కానలేను—అనేట్టు ఆమె చేసి వేసింది. రూపం కోసమో, గుణంకోసమో,
కోసమో నేను ఆమెపై ఉంచిన దృష్టిని మరొక వైపు తిప్ప వలసిన అవసరం
ేదు. లక్ష్మి నా పాలిట లేక పోయి, నేను ఆ రాత్రి ఉన్న సన్నివేశంలో—లరక్షిత
నా మనస్సు ఆ పల్లె పడుచు పై ప్రసరించి ఉంటే ఆశ్చర్య పడవలసిందేమీ
నాకు ఇప్పటికీ అనిపిస్తుంది. ఈ సంగతి జరిగినప్పుడు నాకు నూనూగు మీసాల
యౌవనం, కండ పుష్టి ఉన్నవాణ్ణి. నా రూపం నేను చెప్పుకోడం కష్టమై
ేకీ, కురూపని మాత్రం కాదని ఖండితంగా చెప్పగలను. సంగతి సరిగా తెలుసు
ంటే, చెన్నమ్మనూ వర్ణించాలి. ఆమె వయసు ఇరవై యేండ్ల కంటే
వ ఉండదు. అంత పొడువూకాని, అంత పొట్టీ కాని ఆకారం. చామన చాయ

కను ముక్కు తీరు లక్షణంగానే ఉన్నదని చెప్పాలి. నిండిన ప్రాయం బిగిసిన మైకట్టు ఆమె పెదవులపై నేను చూచినప్పుడెల్లా చిరునవ్వు చాల సహజంగా కనిపించేది. కళ్లలో ఇంకా బాల్యపు నునుమించుపోలుపు జిలుకుతూ ఉంది. లేత నవ్వు నునుమించు కలసి మెలసి ఒక అపూర్వ మాధుర్యంగా పరిణమించాయి. హృదయాన్ని హరించే అన్ని సాధనాలు చాల ఆమెవద్ద ఉన్నవని ఒక్క మాటలో చెప్పవచ్చు. ఇదంతా చాలసందుక్క ఆనాటి రాత్రి ఆమె నడత "పల్లెటూరి ముగ్ధ వధువు" నుంచి కొంచెం దూరమైంది.

నేను పక్కమీద కూర్చోగానే, ఆలోచనలు ఒక్కొటొకటిగా, పదులుగా నూర్లుగా తోసుకొనివచ్చి నా తల గనుగలో చిక్కుకున్నట్టయింది. నా మనస్సు చీకటి సంద్రంలో మునిగినట్లు తోచింది. గొంతుక, నోరు ఎండిపోయి గుటకలు మింగుడు పడడమూ కష్టమైంది. ఈ యువతిలో కామాన్ని చెనకినానని కలలో కూడా అనుకోలేదు ! నాపై ఈమెకు ఆశ కలిగిన పక్షంలో, దానికి నేను ఏవిధంగాను, ప్రోత్సాహ మివ్వలేదని, ఏనాడైనా, ఎక్కడ నిలబడ్డైనా, ఏ ప్రమాణం చేయమన్నా చేయగలను. ఆమె తెలివిలేనిది కాదు. ఆసంగతి ఆమే తెలుసుకొంది! తెలిసే ఈలాటి పనికి ముందంజ వేసందికదా! ఇదేమి వెర్రి! ఇదీ ఒకరకం వెర్రే! ఇంటివారికి తెలిస్తే ఏమిటి గతి! నేను పెద్దమనిషి లాగ వీరి యింట్లో ఉండడం! ఇప్పుడు ఈ సరిపొద్దులో ఈమే నేనూ కలిసి — నా గదిలో . . . మర్యాద దక్కేట్టు తోచలేదు. వచ్చిన విధమూ — దొంగతనంగా వచ్చింది! ఈమెకు పెండ్లి కాలేదా? నా మనస్సులో చాల జుగుప్స కలిగింది. ఇప్పుడు ఒక్కటొకటిగా, నాకు వెనుకటి రోజు సాయంకాలం ఆమె నడవడులన్నీ అర్థమయ్యాయి. ఆమె అంత పొద్దుపోయి నావెంట తోటకు ఎందుకు వచ్చింది? . . . నీటి బింతెలు— వట్టి నెపం! . . . నీటిబిందెను నాచేతో ఏందుకు ఏత్తించుకొంది? . . . పోనీ; నేను, నీటి బిందెను ఏత్తి యిచ్చినప్పుడు, దాని చుట్టూ చేయి వేయవలసి వచ్చినపుడు నాచేతికి తన చేయి సోకించింది. అప్పుడది ఏమో ఆకస్మికంగా జరిగిందనుకున్నాను. మరొక విషయం ఆమె మొదట బిందెను ఏత్తడానికి వంగినప్పుడు పైట పూర్తిగా జారింది. నేను ఆమెను ఆ పరిస్థితిలో చూచినప్పుడు ఆమెలో సిగ్గు గుర్తులేవీ కనుపించలేదు! బిందెను తలపై పెట్టుకొని, నిదానంగానే పైటను పైకి లాక్కుంది. వీటన్నిటినీ, అప్పుడు నేను ఈమె ముగ్ధత్వమని భావించానే కాని, ఇవన్నీ నాకోసం ఈమె పన్నుతున్న వలలోని ఒక్కొక్క ఉచ్చు — అని తెలుసుకోలేక పోయాను.

ఈ ఆలోచనలతో అల్లకల్లోలమైన నా మనస్సును సాధ్యమైనంత స్థిమితానికి తెచ్చి, ఇక ఈ ఇబ్బందిమంచి బైటపడడం ఏలాగని ఆలోచించసాగాను. కోపపడడం కార్యకారి కాదు; ప్రమాదకరం కూడా కావచ్చునని భయపడ్డాను. వేరే ఏ ఉపాయంతోనైనా ఈమెను నెమ్మదిగా వెలుపలికి సాగనంపాలని ఆలోచించాను. అయితే ఏమిటి ఉపాయం? ఏలా మాటలు ప్రారంభించాలి? లేకపోలే ఊరికే ముసుగు తన్ని పడుకోవాలి? — అని యోచించాను. అది కాని పని. ఈమె ఇక్కడ ఉన్నంతవరకు, నా రొమ్ము

మీద పెద్ద బండ ఉన్నట్టే. మరొక ఆలోచన స్ఫురించింది. అదే సరైందని అను కున్నాను. ఏలాగైనా, ఆమె చేస్తున్నపని చాల పెద్దదీ, + చాల నీచమైంది, + చాల పాపం— అని ఆమె మనస్సుకి బాగా నాటేట్టు చెప్పి, ఉపాయంగా పంపివేద్దామను కున్నాను. పట్నణవాసినయిన నేను ఈ పల్లెటూరి పిల్లకు పతివ్రతా ధర్మంపై ఉపన్యాసం ఇచ్చే అవకాశం భగవంతుడు ఒనగూర్చినందుకు నాపమట్టుకు నేనే నవ్వు కున్నాను. అలాగే తలయెత్తి చెన్నమ్మ వైపు చూచాను. చెన్నమ్మ ఇంకా తలుపును ఆనుకానే నిలబడి ఉంది. నాముఖంపై నవ్వుచూచి ఆమెకూడా నవ్వింది. నా ముఖ వైఖరిలో ఆమెకు ప్రోత్సాహ మేమైనా కనిపించిందేమో అని భయపడి, వెంటనే నా నవ్వును దిగమింగి, నెమ్మదిగా "చెన్నమ్మా," అని పిలిచాను. చెన్నమ్మ "ఏం బాబూ" అని, రెండు మూడడుగులు ముందుకు వేసి, నాకు దగ్గరగా నిలబడింది. "కూర్చో" అన్నాను. ఆమె నా పక్కమీదే తిష్ఠవేసింది! నేను కొంచెం దూరంగా జరిగి, ఒకటి రెండుసార్లు గుటకలు మింగి, మరల "చెన్నమ్మా" అన్నాను.

"ఏమి నాదొరా?" అని నెమ్మదిగా అడిగింది చెన్నమ్మ. ఆమె నడవడి యింత విపరీతంగా ఉన్నా, కంఠధ్వనిలో ఇంకా ముగ్ధత పొంగిపొర్లుతున్నదని నాకు బోధ పడింది. నేనే సంభాషణ అందుకున్నాను.

"చెన్నమ్మా, చూడు; నీవు ఇలా చేయవచ్చా ?"

"ఏలా బాబూ ?"

"ఇలా — ఈవేళప్పుడు — దొంగచాటుగా వచ్చి"— నేను మాట ముగించలేదు; అంతలోకే ఆమె— "దొంగచాటుగా రాలేదు! నా దేవరా!" అన్నది.

"అయితే ?"

ఆమెనుంచి మాట పెగల లేదు. నేనే అన్నాను: "మీ యింటి వాళ్ళకు తెలిస్తే, నీకూ మర్యాద దక్కదు: నాకూ దక్కదు."

"వాళ్లేమీా అనర్లేండి బాబూ,"— అని మూల్గింది.

నాకు ఉన్నదున్నట్టే. ఆశ్చర్యమైంది ! అడిగాను :

"ఏమన్నావు ?"

"వాళ్లా — ఏమీా — అనరూ — అన్నాను."

"చూడు ! వాళ్లు అననీ, అనక పోనీ — ఇది నాకు ఇష్టమైన పనికాదు చెన్నమ్మ, నాకు పెళ్లయింది : మరొకరి భార్యను చెరిపే . . . . "

"అయ్యో ! బాబూ ఇలా ఎందుకంటారు ! నేను ఎవరి భార్యనూ కాను దొరా !—నేను బస్విని."

"ఏమిటి ? ఏమిటి ? ఏమన్నావు ?"

"నన్ను బస్విగా వదిలారు — నా దొరా ?"

"బస్వి !బస్వి !" అంటే ?"

"దేవునికి వదలి పెట్టారు."

నేను ఎక్కడా చూడలేదు, దేవునికి వదలడం, బస్వి సంగతి, విన్నానంతే కాని, దాని అర్థం తెలియదు. నాకు మొదటి బెదురు పోయి, విషయం సారస్యంగా ఉంది, తెలుసుకొందామన్న కుతూహలం కలిగింది.

"దేవునికి వదిలారా ? ఎవరు ? " అని అడిగాను.

"మా అప్పా , అమ్మ."

"ఎందుకు వదిలారు ?"

"బాబూ ఎనిమిదేళ్ల క్రితం నాకు చాల జబ్బు చేసింది. అప్పుడు మా అప్ప, అమ్మ మరడి దేవునికి మొక్కుకున్నారు. నాకు నయమైతే ఆ దేవుని పేరిట నన్ను బస్విగా వదంతాము — అని. నాకు నిమ్మళించింది — బాబూ !"

"అయితే నీవు పెళ్లి చేసుకోవా ? "

"చేసుకోను బాబూ."

"ఇలాగే ఉంటావా ?"

"ఔను, బాబూ."

"సానిదాని లాగ."

ఈ మాట విని ఆమె గుండెలో చురకత్తి గుచ్చినట్లయింది కాబోలు ! ఒక క్షణంలో ఆమె కను బొమలు ముడి వడ్డాయి. ముకు పుటాలు, పెదవులూ అదురసాగాయి. కోపగించిన స్త్రీ ముఖంలో ఒక విధమైన భీషణత ఏర్పడుతుంది. ఆమె ముఖం ఆ భీషణతలో తేలిపోతున్నట్టు తోచింది. తీక్ష్ణ దృష్టితో నన్ను పొడి చేట్టు చూస్తూ.

"బాబూ, మీరు ఆ మాట అన గూడదు !" అన్నది.

ఆమెలో కలిగిన మార్పు చూచి నా కెందుకో కొంచెం దిగ్భ్రాంతి కలిగింది. గుటకలు వేస్తూ,

"ఏ మాట ? " అన్నాను.

"మేము సానులం కామని మీకు తెలియదూ?"

నాకు ఇంకా ఆశ్చర్య మైంది ! పెళ్లి లేదు ! ప్రవర్తన చూస్తే విపరీతం !! అయినా సానులు కాదు ! నాకూ కొంచెం కోపం వచ్చినట్టయింది. అడిగాను :

"కాకపోతే మరేమిటి ? నీవు అందరిలాగ పెళ్లిచేసుకొని, ఒక ఇల్లాలుగా ఉండడం మాని, ఇలా అర్ధ రాత్రి మీాద వచ్చి పడ్డావు . . . ."

"అయ్యో ! బాబూ మీా కింకా అర్థం కాలేదా ? బస్వలు పెళ్లి చేసుకోడానికి వల్లకాదు నా దొరా !"

"ఎందుకు వల్లకాదు ?"

"మొక్కుబడి చెల్లించాలి కదండీ ! లేక పోతే కీడు మూడదూ ?"

"పెళ్లి చేసుకొంటే మొక్కుబడి చెల్లించడానికి వీల్లేదా ?"

"కాదు నా దొరా. ఒకరిని పెండ్లాడితే మీాబోటి వారి సేవ ఎలాగండీ చేయడం? మానం ఉంటుందా ?"

"సరే ! మరొకరి సేవ ఎందుకు చేయాలి ?"

"మరి దేవునికి మొక్కుబడి చెల్లించ వద్దూ ?"

"ఇలాగేనా చెల్లించడం ? దేవుని పేరుతో లంజరికం చేస్తూ . . . ."

టపీమని ఆమె మళ్లీ ముఖం చిట్లించి, కనుబొమలు ముడి వేసి,

"బాబూ ! ఆ మాట నన్ను అనకండి ! — అనకండి !" అని నొక్కి నొక్కి చెప్పింది.

"చూచావా ! నేను నీ మొగుణ్ని కాదు, నీవు ఇంత రాత్రి వేళ నా దగ్గరికి వచ్చావు కదా — ఇది ఎవరు చేసే పని ? 'సానులంకాము !' అని చెబుతున్నావే ?"

"మేము సానులంకాదు బాబూ, కాదు. సానులకు డబ్బాసె బాబూ. వాళ్ళు వాడు వీడూ అని చూడరు. వాళ్లకి మొక్కుబడి గిక్కుబడి ఏమిలేదు ! ఆ వృత్తే వారి జీవనం."

"మీారు ?"

"మేము డబ్బా గిబ్బా లాకం. అలాటి వాణ్ని. ఇలాటివాణ్ని దగ్గర చేరనివ్వం. మీా బోటి కులీనుల్ని ఎవరైనా మా దేవుడు చూపితే, వారి సేవ చేసి మొక్కుబడి చెల్లిస్తాము. మమ్మల్ని సానులని అనకండి నా దొరా."

"అయితే, నీ, ఈ సేవ, నీ తల్లి దండ్రులకు తెలుసా !

"ఎందుకు తెలీదు బాబూ ! వాళ్లూ మొక్కుకున్న వాళ్లు — వాళ్లకి తెలీకుండా ఉంటుందా ?"

"సరే, వారేమో పంపారు. మరి నేను దీనికి ఒప్పుకుంటానో లేదో అనేది వారికేమి తెలుసు ? ఏధైర్యంతో నిన్ను నా దగ్గరికి పంపారు ?"

ఈ ప్రశ్నకు వెంటనే జవాబు రాలేదు. ఆమె చిరు నవ్వు నవ్వుతూ, మెడను ఒక పరుసలో వంచి, వోరగంటితో చూస్తూ,

"మీరు — మరి — అడిగారట — మా నౌకరును — నేను ఎవరు — ఏమిటి — ఎక్కడ — అని," అని కొంచెం సిగ్గుతో పలికింది.

ఇప్పుడు నాకు అర్ధమైంది. — నేను నౌకరును అడిగినప్పుడు, వాడు వ్యంగ్యంగా నవ్వి 'ఎందుకు బాబూ' అని అడగడం ! "అయ్యో ! భగవంతుడా ! " అనుకున్నాను.

"ఔను, చెన్నమ్మా అడిగాను, ఊరికే తెలుసుకుందామని అడిగాను, అంతే. చెన్నమ్మ, నా లక్ష్మి తోడు నాకు వేరే ఉద్దేశమేమీ లేదు."

"అయ్యో ! ఊరుకోండి బాబూ ! ఇప్పుడేమైంది ? దీనికి మీరు తోడు నీడు పెట్టుకోకండి !"

"అలా కాదు చెన్నమ్మా, చెప్పు. పోయిన మానం మళ్లీ వస్తుందా ?"

చెన్నమ్మ ఊరుకుంది.

"చెప్పు మరి?" అన్నాను.

"లేదు, బాబూ. రాదు."

"అలా అయితే విను. ఆడదానికి మానమే ప్రాణం. మానం పోగొట్టుకొన్న ఆడది కుక్క కంటే కదా. ఉండేదే మానం మీకు, మీరు దానిని ఈ విధంగా అమ్ముకో రాదు, చెన్నమ్మ. మానం వదలిన ఆడదానికి నరకం లోను స్థానం లేదని అంటారు — తెలిసిన వారు."

"బాబూ, మీరు చెప్పేది పెండ్లి అయి భర్త ఉన్నవాళ్ల సంగతి. వాళ్లు మా లాగ ఉంటే కులం నుంచి వెలి వేస్తారు ! మాకు అలా కాదండి బాబూ ! మమ్మల్ని దేవునికి వదిలారు. మాకు మీలాటి కులీనుం సేవే ! — — "

"అయ్యో! చెన్నమ్మ, నీకు తెలీదు. ఇదిగో విను. దేవుని పేరుతో ఆడది మానం చెడితే దేవునికి ప్రీతి అవుతుందా? దేవునికి మొక్కుబడి ఉంటే ఆ దేవునికి సేవ చేయి, ఎవరు వద్దంటారు. అది వదలి పెట్టి ఈ విధంగా మానం అమ్ముకో డమా?"

"బాబూ మీ వంటి కులీన్లే మాకు దేవుడు, నా దొరా. మీకు సేవ చేస్తే అదే మాకు పుణ్యం."

"ఆమె మాటలు విని నా హృదయం నుండి "అయ్యో ! దేవుడా ! నీ పేరుతో, నిన్ను మెప్పించడానికి, ఎంత అన్యాయం — ఎంత పాపం — జరుగుతున్నది?" అని ఆవేదన, ఏవో వికారం బయలు దేరింది. కొంచెం సేపు ఏమీ మాట్లాడకుండా నాలో నేనే ఆలోచించాను . . . . .

ఇదేమిటి ఈ జనం మౌఢ్యం ! ప్రపంచంలో ఇంతటి అసహ్యమైన ఆచారంకూడా ఉందా ? దేవునికి వదలడమేమో సరే, విన్నాను. అది వారివారి భక్తి. కాని,ఈ పనేమిటి ? ఈలాగేనా — వీరు దేవుని మొక్కుబడి చెల్లించడం ? భగవంతుని పవిత్రమైన పేరుతో వీరు ఇంతటి హేయమైన పని చేస్తున్నారు కదా ! — వీరి గతి యేమి ? ఈ అమ్మాయి ఖండితంగా ఏమీ తెలియని పల్లెటూరి ముగ్ధ ! జార స్త్రీల లక్షణమే వేరు, ఈమె పద్ధతే వేరు. ఈమె తమవారి అసహ్యమైన సంప్రదాయానికి బలి అయిన ముగ్ధ ! తాను చేస్తున్న పని వల్ల దేవునికి మొక్కుబడి చెల్లుతుందనే ఈమె దృఢ విశ్వాసం. దేవుడా ! తల్లి దండ్రులే చేతులార తమ ఒక్క కూతురి జీవితాన్ని పాప పంకిలం చేస్తున్నారు కదా ! — వారి గతి యేమి? ఈమె గతి యేమి ? వారేమో తమ మొక్కుబడి వల్ల కూతురు బతికిందని అనుకొని ఉండవచ్చు. కాని, ఇప్పుడు ఈమె దిన దినం చేస్తున్న పనితో ఈమె జీవితానికి ప్రధానమైన స్త్రీత్వమే నశించి పోతున్నది కదా ! ఈ విషయం వాళ్ళు తెలుసుకొనే విధం ఎలా ? అప్పుడు, పసి పాపగా ఉన్నప్పుడు, ఒక రోజు, ఒక క్షణంలో చావడానికి మాకు, ఇప్పుడు రోజు రోజూ, క్షణక్షణమూ, కొంచెం కొంచెంగా చస్తున్నది కదా ! ఇది ఈమె గ్రహించిందా ! లేదు ! — అదే ఆశ్చర్యం ! తాను చేస్తున్న పని. సరైంది—దేవుడు మెచ్చేపని. దేవుడు మిగిల్చిన జీవితం ఈ విధంగా గడిపితే, అది దేవుడికి ఇష్టమైన సేవ — అని ఈమె దృఢ విశ్వాసం. పెళ్ళయిన ఆడ దానికి ఏకృత్యం చెడ్డదని ఈమె అంటున్నదో, ఆ కృత్యం తన జీవిత ధర్మమని అనుస రిస్తున్నది ! దీనికి ఈ తల్లి దండ్రులూ ప్రోత్సహిస్తున్నారు. పాపం ! వారైనా ఏం చేస్తారు ? వారి కులాచారానికి బలి అయారు ! . . .

అతి తీవ్రమైన ఈ ఆలోచన తోనా గుండె బిరుసెక్కి, బరువెక్కినట్లయి పెద్దగా నిట్టూర్చాను. చెన్నమ్మఊరికే పైట కొంగు కొసను లాగుతూ పురి పెడుతూ ఉంది. నేను నిట్టూర్చడం చూచి నా వైపు చూచింది. ఆమె ముఖంపై అప్పటికే కలవరం కనిపించింది. ఈ పాటికి తాను ఎక్కడైనా పెళ్లి చేసుకొని నలుగురి లాగ కాపురం చేయడం మాని, ఈ ముగ్ధ, ఏదో అసహ్యమైన సంప్రదాయానికి బలి అయింది కదా —అనే ఏదో సహించరాని ఒక సంకటంతో నా గుండె తల్లడిల్లి , కళ్ళు చెమ్మగిల్లాయి.

"చెన్నమ్మ, నీ పాలి దేవుడే నిన్ను కాపాడాలి," అంటూ కళ్ళు తుడుచుకొన్నాను. నా కన్నీళ్ళు చూచి చెన్నమ్మకు కొంచెం గాబరా పుట్టి ఉంటుంది, నా దగ్గరికి జరిగి వచ్చింది. ఆమె అలా నా దగ్గరికి జరిగి వచ్చినప్పుడు దూరంగా జరగడానికి నాకు మనసు రాలేదు. ఆమె మనిషా, పాపిష్టి కాదు. అజ్ఞానపు పాపానికి ఆమె దేహం మాత్రం

పొల్పడింది. తామరాకు మీద నిలచి వజ్రంలాగ తళతళలాడే నిర్మలమైన మంచు బిందువులాగ, ఆమె ఆత్మ పరిశుద్ధంగా ఉంది. ఆమె సరళ స్వభావం చూచి నాకు చాల జాలివేసింది. ఆమెను చూచినప్పుడెల్లా, ఆమె విషయం ఆలోచించినప్పుడెల్లా, తడి ఆరిన నా కళ్లల్లో మరల నీరుబికి వచ్చింది. నా కన్నీటిలో ఆమె కలుషితమైన శరీరాన్ని కడిగివేద్దామనిపించింది. నా దేహం, ఆత్మ ఆమెకోసం స్నేహంతో పొంగి పోయాయి. నెమ్మదిగా ఆమె చేయి పట్టుకున్నాను. నా ఒళ్లు కొంచెం జలదరించింది. చేయి వదలక వేళ్లను నిమురుతూ, "చెన్నమ్మా" అని నెమ్మదిగా పిలిచాను. నా స్నేహం, నా జాలి ఆమె ఆత్మను సోకాయేమొ! నేను చేయి పట్టుకొని, పేరు పెట్టి పిలువగానే, ఆమె ఇంకా దగ్గరికి జరిగి, తలవంచి, చాల మృదువుగా "ఏమిటి నా దొరా, నా స్వామీ ? " అన్నది. ఆమె ముఖంలో ఏదో ఒక విధమైన ఆలోచనో, కలవరపాటో కనిపించింది. నేను ఆమె ముఖాన్నే చూస్తూ, అడిగాను :

"చూడు చెన్నమ్మా ! నేను నీ దేవుడు అని అన్నావు. కదూ ? "

"ఔను, బాబూ, మీరే నాదేవత."

"అలా అయితే, నేను చెప్పినట్టు నీవు చేయాలి కదా ?"

"మీ పాద దాసిని. చెప్పండి నా దొరా."

"నీవు ఇక మీద ఈ పాపకార్యం చేయకూడదు, తెలిసిందా ?"

"మరి — మొక్కుబడో ?"

"అయ్యో ! — ఆ మొక్కుబడి పాడుగాను ! చూచావా. నేను నీ దేవత అన్నావు ఇంతకు ముందు నీవు ఇంకెవరి సేవా చేయలేదా ?"

చెన్నమ్మ మాట్లాడ లేదు. తల వంచుకుంది.

"ఇలా చూడు . ఇంతకు ముందు నీవు ఇంకా ఎవరి సేవ చేశావు. ఒకరి ఎంగిలిని మరొకరికి ఇవ్వవచ్చా ? దేవునికి ఈ ఎంగిలి మొక్కుబడా ? చెన్నమ్మా, నీకు తెలియదు — ఇది చాల పాప భాజనమైంది—అని తెలిసిఉంటే ఎన్నటికి నీవు ఈ పాప కార్యం చేసేదానివి కావు. కొంచెం ఆలోచించి చూడు— నీకూ, సానిదానికీ ఏమిటి భేదం ? దానికి అది జీవనం, నీకు జీవనానికి తక్కువ లేదు. కాని, పాపమేమో ఒక్కటే దేవుడు ఈ పాపం ఎన్నటికీ ఒప్పడు !"

చెన్నమ్మ మౌనంగా అంతా విన్నది. మొదటి భ్రాంతి గందరగోళం చిహ్నాలు ఆమె ముఖంనుంచి జారి పోయాయి. క్రమంగా ముఖం వాడి పోయింది. శరీరం కుంగి పోయింది. చూపు నేల వాలింది. నెమ్మదిగా ఆమె చెయి కదలింది, "చెన్నా" అన్నాను

యత నీడలు కనిపించాయి. నా మాట సరైంది — అని ఆమె మనస్సు గ్రహించి ఉండాలి.

"చెన్న, నేను చెప్పింది నిజమే కదా!" అని అడిగాను.

చెన్నమ్మ నోరు విప్పలేదు. మళ్లీ తలవంచుకుంది. నేను చూస్తూ ఉండగానే, రెండు కన్నీటి చుక్కలు టప టపమని ఆమె చెక్కులపై జారి పడ్డాయి. అదే ఆమె నాకుచెప్పిన మౌన సమాధానం. ఆమె పరిశుద్ధమైన ఆత్మను ఆవరించిన అజ్ఞానపు తెరను తొలగించి పారవేసే పని నా పాల పడింది! ఏదో ఒక గమ్యం చేరాలని ఒక దారిని బట్టి అడుగులు వేస్తూ, అడుగు వేసి నప్పుడల్లా ఆ గమ్యం సమీపిస్తున్నదని నమ్మి చాల దూరం నడిచిన మీదట, ఎవరైనా దారిలో కనిపించి, మనం బయలు దేరిన గమ్యానికి అది మార్గమే కాదని, ఆ దారిని నడిచిన కొద్దీ మన గమ్యానికి దూరమై పోతున్నామని చెబితే, ఎలా ఉంటుంది? నేను నా మాటలతో చెన్నమ్మ హృదయంలో ఇంచుమించు అదే విధమైన భావాన్ని కలిగించాను.

చెన్నమ్మ వెక్కి వెక్కి ఏడ్చింది. నేను ఆమెను ఊరడిస్తూ — చెన్నా! నిన్ను చూస్తే కోపం కాని, అసహ్యం కాని లేదు. చెప్పుమరి, నాకు కోపమా? అని అడిగాను.

చాలనొప్పి పడిన గొంతుకతో చెన్నమ్మ అన్నది. "లేదు, నా దొరా."

"సరే. నీకు నా మీద కోపమేమైనా . . . . "

"అయ్యో! నా దేవుడా! అలా అనకండి! మిమ్మల్ని చూస్తే, నాస్వామి, మీ కాళ్ల కింద పడి పొర్లాడుదామనిపిస్తుంది ప్రాణం!" అని అంటూ నా కాళ్లు పట్టుకొని తన నుదుటితో తాక బోయింది. నేను ఆ అవకాశం ఇవ్వక ఆమెను పైకి లేవ నెత్తి "అలా లయితే సరే. ఏదీ? నా గుండెల మీద చేయి వేసి ఒట్టుపెట్టుకో— 'ఇక మీద ఈ పని చేయను'—అని ప్రమాణం చెయ్యి."

చెన్నమ్మ నా గుండెపై చేయి పెట్టింది. ఆమె ముగ్ధ దృష్టి నా కళ్లలో చొచ్చి హృదయానికి దిగ నాటింది. విషాద దృష్టి . . . విషాద ధ్వని. కంపిస్తూ నెమ్మదిగా అన్నది —

"దేవా — ఇక మీద — ఈ పని — చెయ్యను."

నా గుండెల మీద నుంచి ఏదో పెద్ద బరువు దింపినట్లయి, పెద్దగా నిట్టూర్చాను. రాత్రి చాల పొద్దు పోయింది. అయినా నిద్ర మాత్రం వచ్చేట్టు తోచలేదు. మనస్సులో ప్రశాంతత పొరాడ దొడగింది. చెన్నమ్మ ఒకసారి ఆవలించింది. నేను అదే నెపంగా "చెన్నా, ఇక నీవు వెళ్లి పడుకో," అని లేచాను. ఆమె లేచింది. తలుపు వరకు ఆమెతో పాటు వెళ్లి నేనే తలుపు తీశాను. వాకిట్లో మళ్లీ ఆమె చేయి పట్టుకొని, నా వైపు తిప్పుకొని — "చెన్నా, చెన్నా, దేవుని సాక్షిగా నీ పై నాకు కోపం లేదు—ఎక్కడా,—"

అంటూ రెండు చేతులతోను ఆమె ముఖం ఎత్తి పట్టి, నుదుటి మీద ఒక్కసారి ముద్దు పెట్టుకున్నాను. చెన్నమ్మ వెళ్లి పోయింది.

ఉన్నదున్నట్టుగా మెలకువ వచ్చింది ! చూతును గదా — కరియప్పగారు ! వారే కేకవేసి నన్ను పేల్చొల్పారు : వారు లోపలికి ఎలా వచ్చారో తెలియ లేదు. బహుశా రాత్రి తలుపు చిలుకు వేయడం మరచి పోయా నేమో — అనుకున్నాను.

"ఏమిటి కరియప్ప గారూ ?" అని కళ్లు నులుముకుంటూ లేచాను.

"అయ్యో ! ఏమి చెప్పనండీ ! అయ్యో నా బిడ్డా ! నా చెన్నా !" అని మాట పూర్తిచేయకనే ఆయన కిందపడి దొర్లడం ప్రారంభించాడు. ఏదో అవ్యక్తమైన భయంతో నా గుండె గడ్డ కట్టి రక్తం చిమ్మినట్టయింది. అంతలోగా మరెవరో వచ్చి, "అయ్యా, చెన్నమ్మ తోట బావిలో పడి . . . . . ."

ఆయన మాట ముగించే వరకు నా ప్రాణం ఆగ లేదు. ప్రక్కనుంచి లేచిన వాణ్ణి పిచ్చివాడిలా తోటలోని బావి వైపు పరిగెత్తాను ! బావి దగ్గర పది పన్నెండుగురు గుంపుగా ఉండడం కనిపించింది. ఇంకా ప్రాణం ఉండ వచ్చునేమో — అనే వెర్రి ఆశ ! అయ్యో ! అది వెర్రి ఆశే ! రాత్రే ఆమె వెళ్లి పడి ఉంటుంది. ఇంత వరకూ ప్రాణం ఉంటుందా ?—అనే నిరాశ ! దగ్గరికి వెళ్లి నిలబడ్డాను. అందరూ పక్కకు తప్పుకుని నాకు దారి వదిలారు. చూచాను ! అయ్యో ! భగవంతుడా ! అదెలాటి దృశ్యం చూచానో ! రొమ్ములోని రక్తం కళ్లల్లోకి చిమ్మినట్టయింది. కళ్లు బైర్లు కమ్మాయి.

అంతే నాకు జ్ఞాపకం. మళ్లీ నాకు తెలివి వచ్చే టప్పటికి అక్కడ నిలబడిన వారిలో ఒకరిద్దరు నా తలకూ, ముఖానికీ చన్నీళ్లు కొడుతున్నారు. నా ముక్కునుంచి రక్తం కారుతూ ఉన్నది. నేను దేనినీ లక్ష్య పెట్ట లేదు. శవం దగ్గరికి వెళ్లి బ్రతికే సూచన ఏమైనా ఉందా — అని చాల ఆశతో చూచాను. అయ్యో ! వట్టి భ్రాంతి ! నా భ్రమ చూచి నాకే "అయ్యో ? వెర్రివాడా !" అనిపించింది. ఆమె దేహంలో పోరాడే ఆ నిర్మల హేమకణం ఆరిపోయింది ! పుణ్యం పాపానికి అణగారి పోయింది ! అమృతం ఇంకి పోయి మిగిలింది విషపు చట్టం మాత్రం !

ఇక అట్టే అక్కడ నిలవ లేక పోయాను. నెమ్మదిగా ఇంటి వైపు నడిచాను.

ఆ రోజు సాయంకాలమే నేను ఆ పల్లెటూరు వదిలాను. బయలు దేరడానికి ముందు చెన్నమ్మ ఫోటో వారి ఇంట్లో వదలి పెట్టి వచ్చాను. అలాటి అమ్మాయిని పోగొట్టుకున్న వారికి ఆ ఛాయా చిత్రం ఏమి ఊరట కలిగిస్తుంది?

దారి పొడుగునా ఆలోచన. పోలీసు వారేమో "ఆత్మ హత్య" అని రికార్డు చేసుకున్నారు. అయితే, ప్రస్తుతం, నేనే ఆమెను చంపినట్టయింది ? ఏమి చేసినా ఈ భావం నన్ను విడిచేట్టు కనిపించలేదు. నేను చెప్పినదంతా ఆమె మనస్సులో నాటి , బతకడంకంటె చావడమే మేలుగా తోచి ఉంటుంది. నేను ఆమెను నా గది

గుండా వెలుపలికి పంపినప్పుడు ఆమె హృదయం మరణ వేదనతో నిండి ఉందని, ఇప్పుడు తోస్తుంది. ఈ ఆలోచన రాగానే, నా గుండె చీల్చి కాచిన సీసం పోసి నట్టయింది ! నేను ఆ వేళ గాని వేళలో ఆమెను పంపివేయకుండా ఉంటే ఆమె—చచ్చి పోదామనే—సంకల్పం దూరమయ్యేదా ఏమో ! బతికేదో ఏమో ! ఆమె మనస్సుకు ప్రాణాలు పోగొట్టుకొందామనే ఉద్దేశం కలిగించిన వాణ్ని నేను. అనుమానమే లేదు ! నాకు ఏమిటి అధికారం ? వారి ధర్మా ధర్మాలను తూచడానికి నేనెవణ్ని? నా మాటలు—ఒక్కొక్కటీ ఆమెను బాని వరకు తీసుకొని పోయి ఉండాలి. ఆ మీదట ఆమెను బావిలోకి తీసింది నా మాటే నేనే ! అయ్యో ! నేనే ఆమెను చేతులారా చంపినట్టయింది కదా! భగవంతుని సమీక్షంలో దీనికి ఒక రోజు కాకపోతే మరొక రోజు సమాధానం ఇవ్వవలసి ఉంటుంది. ఏమని ఇవ్వను ? . . . .

ఇలానా ఆలోచనలకు అంతులేదు.

రేపు ఇంటికి చేరుకుంటాను. ఈ కథంతా చెబితే ఏమంటుందో నా లక్ష్మి !

---

# 5. కాలపాశం

—"సోము"

[శ్రీ మీ. పా. సోమ సుందరం "సోము"అనే మారు పేరుతో వ్రాస్తూ ఉంటారు. చిన్న కథలు వ్రాస్తారు. నవలలు వ్రాస్తారు. కవిత్వం చెప్తారు. ప్రాచీన తమిళ రాగా లయిన "పణి" అనే ఛందస్సుల మీద పరిశోధన చేసిన పండితుడు. కవి, కథకుడు, పరిశోధకుడు, విద్వాంసుడు. 'రవిచంద్రిక్,' సముద్రం కన్న స్వప్నం' (కడగా కండ కణువు) అనే నవలలు రెండు వ్రాసి "కల్కి" పత్రికలో ప్రకటించారు. కవితా సంపుటికి ప్రభుత్వం వారిచ్చిన బహుమతి వీరికి లభించింది. "కల్కి" పత్రికకు కొంత కాలం సంపాదకులుగా పనిచేశారు. ప్రస్తుతం ఆలిండియా రేడియోలో సాహిత్య శాఖ నిర్వాహకులుగా పని చేస్తున్నారు.]

వసంతకాలం మంచు తుంపరల మేలిముసుగు తొలిగించుకొని ఉదయ సూర్యుని వైపు చూచి చిరునవ్వు దొంతరలతో సిగ్గు పడుతున్నది. తెలతెలవారే సమయం. నవనవలాడే మేను పైన మిలమిలలాడే మెరుగు వెలుగులు కొత్త శోభ కొనివస్తున్నాయి. తోటలలో పూలు నవ్వుతున్నాయి. మామిడి చెట్లన్నీ, అప్పుడే వయస్సు వచ్చిన కన్నె పిల్లలలాగ కులుకుతూ కళ్లుక్కు మంటున్నాయి.

మధురమా నగరంలో పాండ్య రాజు నిర్మించిన ఉద్యానవనంలో రాజకుమారి తన చెలికత్తెలతో విహరిస్తున్నది. అందమైన లేడి పిల్ల మెడకు తాడు కట్టి, దానిని పట్టుకొని రాజకుమారి ఆడిస్తున్నది. ఆ దృశ్యం పేదసాదలందరూ ఆనందించే వినోదోత్సవంలాగు ఒప్పుతున్నది.

పాతాళ లోకంలో యముడూ, అతని సోదరి "యమి" ఈ వసంత వైభవం కన్నార చూచి ఆనందించాలనే కుతూహలంతో బయటికి వచ్చి కొన్ని సుందర దృశ్యాలు
కన్నార చూచి ఆనందించాలనే కుతూహలంతో బయటికి వచ్చి కొన్ని సుందర దృశ్యాలు
చూస్తూ ఆ వనంలో కలిసి నడుస్తున్నారు. అప్పుడు యమి అడిగింది. "అన్నా ! నాకా లేడి పిల్ల కావాలి, తెచ్చి పెట్టు గలవా ?" అని అటు చూపించింది.

"యమి" నడుస్తున్న వైపు చటుక్కున దృష్టి మరల్చి అటు చూచాడు కాల దేవుడు యముడు. మధురమా నగరంలో రాజుగారి ఉద్యాన వనంలో పాండ్య రాజ కుమారి తన సహ జనంతో మెల్ల మెల్లగా అడుగులు వేస్తూ రంగురంగుల చుక్కలతో మెరసిపోతున్న ఆ లేడి పిల్లతో ఆడుకొంటున్నది. ఆ లేడి చిన్న చిన్న గంతులు వేస్తున్నది. రాజకుమారి తరుముతూ ఉన్నది. అదొక వేడుకగా నడుస్తున్నది.

"ఆ బంగారు లేడా నీకు కావలసింది," అని చెల్లెలిని యముడు అడిగాడు. ఆ మాట అంటూ ఉంటే అతని కంఠ స్వరంలో ఉగ్రత వినిపించలేదు. కోపంలేదు. జాలితో కూడిన అనురాగం కనిపించింది. జీవుల ప్రాణాలు దయా దాక్షిణ్యం లేకుండా వాటి శరీరాలనుండి వేరు చేసి తీసుకొనిపోయే యమ ధర్మరాజుకా జాలి ? అనురాగం ? అవును. అతనికే. అతనికి మాత్రం హృదయం అనేది ఒకటి ఉండాలి కదా ! ' 'అన్నా ! అయి చూశావా ? ఆలేడి తుళ్లిపడుతూ పరుగెత్తుతూ చటుక్కున ఆగి దిక్కులు చూస్తూ నిలుచుండి తిరిగి గంతులు వేస్తూ పారి పోవడం చూస్తూ ఉంటే ఎంత అందంగా ఉంది. దాని బెదరు చూపులూ, లేత ముఖం ఎంత ముద్దేసుకొస్తున్నదో ! అది నాకు కావాలి మరి" అన్నది యమి.

అమావాస్య రాత్రి చిమ్మ చీకటిలో ఆకాశంలో నక్షత్రాలు మెరిగినట్లు ఆ యమ ధర్మరాజు హృదయంలో జాలి అనేది పుట్టడానికి "యమి" కారకురాలయింది. ఆతనికి ఒకే ఒక సోదరి. ఆతని హృదయ తత్వానికి జీవన రాగ మయింది. ఆమె యెడల గల సహోదర ప్రేమలో, ఆ ప్రేమ వల్ల అతని మనస్సులో కలిగిన రాగ పాశంలో ఆతడు చేయని కార్యమంటూ లేదు.

పాండ్య రాజ కుమార్తె, తన సఖి జనంతో సహా ఆ రంగు రంగుల బంగారు లేడితో ఆడి, సొక్కుతూ సోలుతూ చెలికత్తెలతో పాటు చేతులు తట్టుతూ ఉల్లాసంగా ఆ ఉద్యానవనంలో విహరిస్తూ ఉంది. తెల్లని వెన్నెల. ఆ తోటలో కేళీ విహారం చేస్తూ ఉన్న కన్నె పిల్లల కాలి అందెలూ గజ్జెలూ, చేతి గాజులు కంకణాలు ఘల్లు ఘల్లు మంటూ ఉంటే వాటి సంగీతానికి ఆ లేడి మెడలోని మువ్వలు తాళం వేస్తున్నవి. అవి వింటూ ఉంటే యమి మనస్సులో ఎన్నో ఆలోచనలు పొంగి పొరలి వస్తున్నవి.

"చెల్లీ ! నీ కన్నులు ఆ రంగుల లేడి మీద పడ్డాయా ? అక్కడ పాతాళ లోకంలో నీవాడుకొనే అందమైన నెమళ్లు, చిలుకలూ రాజహంసలూ, పావురాలు ఎన్ని లేవు ? అవన్నీ నీ కక్కర లేదా ? వాటిని మరచి పోయావా," అని యము డామెను అడిగాడు.

"అన్నా ! మాటిమాటికీ తిరిగి అదే మాట అడుగుతావా ? ఆ బంగారు లేడి నాకు కావాలని ముందే చెప్పానుగా ? ఆ లేడి పిల్లే నా ప్రాణం ! దాని మీద నా మనస్సు లయించి పోయింది. నా కది తెచ్చిపెట్టు. లేకపోతే నా ప్రాణాలే తీసుకో," అని యమి చెప్పివేసింది. సోదరి చెప్పిన ఆ మాటలు కాందేవుడు యమధర్మరాజు హృద యానికి బాణంలాగ గుచ్చుకొన్నవి. తన ప్రాణం వేరు, తన సోదరి ప్రాణం వేరు అనే భేదం ఎప్పుడూ అతనికి లేదు. ఇద్దరూ ఒకే మాట, ఒకే మనసు, ఒకే ప్రాణం. "యమీ ! విచారించకమ్మా ! నీవు కోరిన కోరిక నేను నెరవేర్చి తీరుతాను," అని యముడు అభయం చెప్పాడు.

మరుక్షణంలో అతని చేతులలోనుండి కాలపాశం ఆ పాండ్య కుమార్తె ప్రేమతో పెంచుకొంటున్న ఆ రంగుల బంగారు లేడి మెడలోకి వెళ్ళి పెన వేసుకొని, దానిని చుట్టి చుట్టి పట్టుకొన్నది.

మధురమా నగరంలో పాండ్య రాజు వేసిన ఆ పూదోటలో రాజకుమార్తె తన కరకమలాలతో పట్టుకొని ఆడిస్తున్న ఆ రంగుల బంగారు లేడి చిట్టి మెడలో కట్టిన మువ్వల త్రాడు బిగిసిపోయింది. దానికి ఊపిరాడలేదు. మరుక్షణంలో క్రింద పడి గింగిల తన్నుకుంటుంది. ఇంకొక క్షణంలో దానికి మైకం క్రమ్మి వేసినట్లయి పోయింది. రెండు కన్నీటి బొట్లు నేల రాలాయి. ఆ బంగారు లేడి పిల్ల గిర్రున చుట్టులు చుట్టినట్టయిపోయింది. చివరికి దాని తల నేల మీదికి ఒరిగి పోయింది.

యమికి బంగారు లేడి దొరికింది. పాతాళలోకంలో ఒక పూల తోటలో యమి ఆ బంగారు లేడితో ఆటలాడుకుంటూంది. కొంచెంసేపు యమధర్మరాజున్న ఆ యమ లోకానికి ఎక్కడ లేని కొత్త శోభ వచ్చింది. ఆ బంగారు లేడి లటూ ఇటూ త్రుళ్ళుతూ కేరుతూ గంతులు వేయడం మొదలు పెట్టింది. అయితే ఆ కేరింతాలు ఎంతో సేపు లేవు. రాను రాను ఆ లేడి పిల్ల దిగులు పడి, ఎలాగో ఉండటం మొదలు పెట్టింది. పాండ్య రాజ్య కుమార్తెతో ఆడుకొవడానికి అలవాటు పడిన ఆ బంగారు లేడికి ఈ యమ ధర్మరాజు సోదరితో ఉండిన కొంత సేపటి వరకు ఏమి తెలియు లేదు. తరవాత తెలిసింది. ఆమె ఆ రాజకుమార్తె కాదని గ్రహించింది. దిగులు పట్టుకుంది. బెంగతో ఏమీ తెలియడంలేదు. ఎలాగో ఉంది. ఇది చూచి యమి ఆ లేడి పిల్ల నోటికి ఇన్ని గరిక పరకలు అందించింది. లేడి వాసన చూచి కిట్టనట్టు ముందిదిలి చేసుకుంది.

కాలదేవుని మనస్సులో కలత ఏర్పడింది.

ఇలక మధురలో, తనతో ఆడుతూ పాడుతూ తన ప్రాణ సమానంగా చూచుకొన్న బంగారు లేడి లేనందుకు పాండ్య రాజకుమారి దుఃఖంతో కన్నీరు మున్నీరుగా విలపిస్తున్నది. ఇక్కడో, ఆమెను తలచుకొని ఆమె పెంపుడు లేడి, ఏ పని చేయక నిలుచుండి అన్ని ఆశలు ఉడిగి కన్నీరు పెట్టుకుంటూంది. పోనీ 'యమి' ఆనందంగా ఉందేమో అను కొంటే. ఆమె తనతో ఆడుకోవడానికి తెచ్చుకొన్న లేడి మూతి ముడుచుకొని కూర్చోవడం చూచి బెంగగా, విచారంగా ఉంది.

ఇవన్నీ చూచి కాలదేవుడు ఏమి చేయగలడు!

"అన్నా ! ఈ లేడి పిల్ల అక్కడ మధురమా నగరంలో ఎంత ఆనందంగా ఆడుతూ పాడుతూ ఉండేది! ఇక్కడ మాత్రం ఎందుకిలాగ దిగులుగా నిలబడి దిక్కులు చూస్తుంది? మేత వేస్తే తినడం లేదు. కారణం ఏమిటో మరి !" అని యమి తన అన్నగారిని అడిగింది. అలాగా అడుగుతూ ఉంటే ఆమె గొంతుకలో దిగులూ, వేదనా ధ్వనిస్తున్నయి. "అమ్మా! హృదయపాశం అనేది ఒకటి ఉంటుంది తెలుసా? అది

కాలపాశంకంటే కూడ బలమైనది. నా కాలపాశంతో ప్రాణాలైతే పట్టి తెచ్చాను కాని హృదయాన్ని మాత్రం పట్టి తేలేకపోయాను," అని యముడన్నాడు. అన్నగారు చెప్పిన యీ మాటలు యమికి సరిగా అర్థం కాలేదు. ఆమె పసి హృదయానికి కోరి తెచ్చిన బంగారు లేడి కూడియాడి మనసిచ్చి పలుకరించడం లేదే యనే దుఃఖమే యెక్కువయింది. ఆ బెంగ ఆమె భరించలేక పోయింది. ఇది చూచి యమ ధర్మరాజు మనస్సులో కలత మరింత ఎక్కువయింది.

యమ ధర్మరాజు యోచించాడు. యమి ముచ్చట తీర్చాలీ అంటే లేడిపిల్ల ముచ్చట తీర్చాలి. లేడిపిల్ల ముచ్చట తీర్చాలీ అంటే దానిని పాండ్య రాజకుమారి దగ్గరకు తీసుకొని పోవాలి. పాండ్యరాజకుమారి వద్దకి దానిని చేర్చాలీ అంటే తిరిగి ఆ లేడి భూమిమీద అవతరించాలి. అయితే తనకు మరణం మీద అధికారం ఉంది కాని మరణించిన వారిని బ్రతికించి తిరిగి భూలోకానికి పంపే అధికారం లేదు. లేడిని తిరిగి బ్రతికించి దానిచేత ఆడించే శక్తి తనకు లేదు. అయితే ఇప్పుడు ఏమిటి చేయ గలడు ?

పాండ్య రాజకుమారి దుఃఖిస్తూ ఏడుస్తూవున్న గొంతు అ గాలిలో వచ్చి అతని చెవిలో వినిపిస్తున్నది. కనికరము లేని కాలదేవుని మనస్సులో జాలి అంకురించింది. యమి, లేడి, పాండ్య కుమార్తె ఈ ముగ్గురి దుఃఖమూ తీర్చడానికి ఒకే ఒక ఉపాయం అతని మనస్సులో తట్టింది. లేడిని భూలోకానికి ప్రాణంతో బ్రతికించి పంపలేడు. ప్రాణాలతో ఉన్నవారిని ఆ ప్రాణాలు తీసుకొని భూలోకంలోనుండి యిక్కడికి లేగలిగిన శక్తి తనకి ఉన్నది కదా ! అలాగ చేసివేస్తే . . . . . . . . ? యముడు ఆలోచించాడు. పాండ్య రాజకుమారిని తెచ్చి లేడితో చేర్చితే ఎలాగ ఉంటుంది ? ముగ్గురి మనస్సులలో ముచ్చటలూ తీర్చినట్టవుతుంది కదా !

కాల దేవుని హృదయంలో ఏర్పడిన యీ జాలీ, యీ అనురాగమూ పాండ్య రాజ కుమార్తె మరణానికి కారణమయింది.

లోకమంతా లేడి పిల్ల తప్ప ఇంకేమి లేదన్నట్టు, లోకమే లేడి, లేడియే లోకంగా ఆ పాండ్య రాజకుమారి బెంగ పెట్టుకొని ఉన్నది. ఆ బెంగ యమదర్మరాజు మనస్సులో జాలి కలిగించింది. దానితో అతడు కరగి పోయాడు. దిగులుతో దిగ జారిపోయాడు.

మూడు ప్రాణాల మీద అతనికి మమత ఏర్పడింది. అందుచేత ఏమి చేసినా అది అతనికి దుఃఖ కారణమైన కార్యమయింది. అందుకే అతడు కలవర పడి పోతున్నాడు. ప్రాణాలు తీయడంలో మొనగాడైనా యమధర్మరాజు, దయా దాక్షిణ్యాలు లేని కాల దేవుడు, ఆ బంగారు లేడి కోసమూ, ఆ పాండ్య రాజకుమారి కోసమూ మనస్సు కలత పెట్టుకొని తొలిసారి కన్నీరు పెట్టుకున్నాడు.

“ఎంత పొరపాటు జరిగిపోయింది ! సోదరి మీద ప్రేమపాశం ఎటువంటి చేయరాని పని నా చేత చేయించి వేసింది ?” అనుకొంటూ ఉంటే అతని కనుగొలకులనుండి నీరు పొంగి పొరలింది. అలాగే నిలుచుండి పోయాడు.

ఆ సమయానికి చేతిలో పెద్ద చిట్టావర్జా పుస్తకం పట్టుకొని అక్కడికి వచ్చాడు చిత్రగుప్తుడు.

“ఎవరది ? కరణంగారా ? రండి రండి” అని స్వాగతం చెప్పాడు యముడు. చిత్రగుప్తుడు తన చేతిలో చుట్ట బెట్టి ఉన్న పొడుగుపాటి కాగితపు చుట్ట పైకి తీశాడు. అది విప్పాడు.

“ఏమిటీ ? ఈ వేళ తేవలసిన ప్రాణాలు ఏవి ?” అని అడిగాడు యముడు. పట్టీ తీసి వరుసగా చదువుతున్నాడు చిత్రగుప్తుడు. అవన్నీ చదివి చివరకు “మధురమా నగరంలో పాండ్య రాజు కుమార్తె, ఆమె పెంపుడు లేడి” అని ముగించాడు.

“ఏది మొదట తేవాలి ? లేడి పిల్లనా, రాజకుమార్తెనా ?” అని అడిగాడు యమధర్మరాజు.

“లేడి పిల్లనే మొదట తేవాలి. అది తేగానే అదే ప్రాణంగా భావించిన రాజకుమార్తెను తేవడం సులువు. ఆ రెండు ప్రాణాలూ ఒకటే అయిన కారణంచేత పాండ్య రాజకుమారి పేరుకూడా పట్టీలో చేర్పించాను,” అని సమాధానం చెప్పాడు చిత్రగుప్తుడు.

“ప్రాణాలు రెండయినా మనస్సు ఒక్కటే కదా ! ఆమె మనిషి అయినా, అది మృగమయినా ఏక ప్రేమ పాశంలో బంధించినట్టయిపోయారు. ఆ పాశం విడదీస్తే, ఉభయుల ప్రాణాలు పోయినట్లే. అంత అన్యోన్యం; అంత అనుబంధం. ఆ పాశం చూచి నాకే జాలి వేసి నేనే వెళ్లి యీ రెండు ప్రాణాలూ స్వయంగా వెళ్లి తీసుకొని వచ్చి పడేశాను,” అన్నాడు యముడు.

“అయితే, యమ భటులను పంపనక్కర లేదా ?” అని చిత్రగుప్తుడు ప్రశ్నించాడు.

“మంత్రి పుంగవా ? నేనేదో నా చేతులలోనే మరణం ఉంటుందనా, అది లేకపోతే జీవిస్తారనీ అనుకొంటూ వచ్చాను. మీరు ఆ పట్టీ చదువుతూ ఆ రెండు ప్రాణాలు ఉన్నవని చెప్తూఉంటే నాకు కన్నులలో నీళ్ళు తమంతట తామే పొంగి వచ్చాయి,” అని అన్నాడు యముడు.

“మీరు చెప్తున్నది నాకు బోధ పడటం లేదు,” అన్నాడు చిత్రగుప్తుడు.

“మీరు వ్రాసిన పట్టీలో జాబితా వివరాలు తెలియడానికి ముందే, నాకు తెలియకుండా అదే కార్యం చేసి వేశాను. ఎంత ఆశ్చర్యం ! నా కేదో హృదయమున్నదనీ, ఆ హృదయ పాశం వల్ల ఏదేదో చేసివేశాననీ భావించాను. అది తప్పు. నా చేతిలో

ఈ కాలపాశం అనేది ఒక సాధనగా ఎలాగ ఉపయోగిస్తున్నానో, కాలం అనే ఒక విధి చేతిలో నేనొక కాలపాశం లాగ పని చేయవలసిందే అని ఇప్పుడు తెలిసింది. అంతే! నేను చేసే కార్యాలన్నీ ఆ విధి నియమాన్ని అనుసరించ వలసిన కర్తవ్య ఫలాలే. నా కృత్యాలన్నీ ఆ . విధి నియమించే నియమానుసారమైన ప్రతిఫలాలే,'' అన్నాడు యముడు. యముడు, చిత్రగుప్తుడూ కలిసి ఏవేవో తత్వరహస్యాలు చర్చించుకొన్నారు. 'యమి' చెవులకి ఏవీ వినిపించలేదు. బెంగగా నిలబడి యున్న లేడి వైపు విచారంగా చూస్తూ ఉన్న యమికి, చటుక్కున కిలకిల నవ్వుతూన్నట్టు చిరునవ్వు వినిపించింది. తిరిగి చూచింది. పాండ్య రాజకుమార్తె పాతాళలోకంలోని ఉద్యాన వనంలో నిలబడి ఉన్నది. అక్కడ లేడి పిల్లను చూచి ఆమె కిలకిల నవ్వింది. ఆమెను చూచి లేడి పిల్ల ఆనందంతో త్రుళ్ళి పడింది. లేడి త్రుళ్ళిపడటం చూచి గగుర్పాటుతో కంపించి పోయింది. ఆ యమధర్మరాజా సోదరి యమి.

---

# 6. పులకాంకురము

—టి. జానకి రామన్

[అద్భుతమైన చిన్న కథలు వ్రాయడంలో శ్రీ జానకి రామన్ అందె వేసిన చేయి. "కోట్టు మేళం" ఈయన చిన్న కథల సంపుటం. నవలలు కూడ కొన్ని వ్రాశారు. మానవ స్వభావం చిత్రించడంలో నేర్పరి. ఈయన కథలలో వచ్చే పాత్రలు ప్రాణంతో మన కన్నుల ముందు కదులుతూ ఉన్నట్టు కనిపిస్తాయి. కథలోని ఉదంతాలు కల్పన చేసి వాటిని కలపడంలో వాస్తవికత ప్రదర్శించడం ఈయన ప్రత్యేకత.]

అది తిరుచునాపల్లి నుంచే బయలు దేరే రైలుబండి. మాయవరం వరకు వెళ్లి అక్కడ నిలిచి పోతుంది. పదిన్నర గంటలకు మొదలు పెట్టి తెల్లవారు జామున మూడు గంటలకి దాని ఆయుష్షు పూర్తయి పోతుంది. మధుర, మీనామధుర, ఈ రోడ్డు మొదలయిన చోట్లకి పోయే బండ్లు అన్నీ పంపించివేసి తిరుచినాపల్లి జంక్షన్ చుట్టూ తిరిగి అట్టహాసం చేస్తూఉన్న సుడి గాలిలాగు, హోరుమని ఒకటే గోల చేస్తున్నది. అక్కడ చుట్టూ అరటి పండు తొక్కలూ, నారింజ పండు తొక్కలూ చెత్తచెదారం తప్ప వేరే ఏమీ కనిపించడంలేదు. బండి బయలు దేరడానికి ఇంక అర గంట ఆలస్యమున్నది. ఇంజిన్‌గాని, గార్డుగాని ఇంకా రాలేదు. పెట్టెకు పెట్టె తగిలించుకొని, అలాగే కునుకు పాట్లు పడుతూ ప్లాటుఫారం మీద నిద్ర పోతూంది. బెంగుళూరు ఎక్స్‌ప్రెస్‌లో దిగిన ఒక కుటుంబం రెండవ తరగతి వెయిటింగ్ రూములో సామానులు పెట్టి కాపలా ఉంచి ఎక్కడికో వెళ్లినట్టున్నారు. ఎక్స్‌ప్రెస్ బండి వస్తే ఎంత జనం ! అది వచ్చిందీ అంటె ఎంత ఘన స్వాగతం, ఎంత హడావిడి ! అది వెళ్లి పోతూ ఉంటే ఎంత కోలాహలం ! అది వచ్చినదే తడవుగా ముక్తసరిగా ఆగి, అట్టే వెళ్లి పోయింది. ఇంక యీ షటిల్ బండో ! అలాగే నిలిచి ఉండి పోతుందేమో ? షటిల్ బండి షటిలే. రైలు బండ్లలో కూడ పేద సాద భేదాలున్నట్టు కని పిస్తున్నది వీటి వ్యత్యాసం చూస్తే !

నేను ఈ బండిలో చివరి పెట్టెకు ముందు పెట్టెలో వేరే కూచుని ఉన్నాను. ప్రక్క బెంచీమీద మా అబ్బాయి పడుకొని నిద్ర పోతున్నాడు. తల వైపు చేతులో రెండు నారింజ పళ్లు పెట్టుకొని ఉన్నాడు. అవి చూస్తుంటే నాకు నవ్వు వస్తున్నది. వాడిని బెంగుళూరునుంచి వెంట బెట్టుకొని తీసుకొని వస్తున్నాను. మామ కుటుంబం బెంగుళూరు వచ్చిన కారణం చేత వాళ్లను చూపించడానికని అక్కడికి పిల్లవాడిని తీసు

కొని వెళ్ళారు. బెంగుళూరు పని మీద వెళ్ళి, అక్కడనుంచి పిల్లవాడిని తీసుకొని వస్తున్నాను. బెంగుళూర్ సిటీ స్టేషన్‌కు మమ్మల్ని సాగనంపడానికి మామ వచ్చాడు. రైలు ఇంక ఐదు నిమిషాలకి బయలుదేరుతుండగా, ఆ స్టేషన్ ప్లాటుఫారం మీద నారింజ పండ్లు అమ్ముతూన్న పండ్ల మనిషిని చూచి "నారింజ పండ్లు నాన్నా నారింజ పళ్ళు," అని పిల్లవాడు కేకలు వేశాడు. ఆ మాటలు చెవిని సోకకుండా మామ ముఖం మరొక ప్రక్క త్రిప్పి వేసుకొన్నాడు. మా మావయ్య స్వభావం ఎటువంటిదో నాకు బాగా తెలుసు. పిల్లవాడిని మందలిస్తున్నట్టు తీవ్రంగా వాడివైపు చూచాను. వాడి నోరు కట్టుబడింది. అయితే బండి మాత్రం బయలు దేరడం లేదు. వాడు మళ్ళీ మొదలు పెట్టాడు. ఆరేళ్ల వయస్సు పిల్లవాడు ఎంత సేపని అణచి పెట్టుకొని ఉండగలడు ?

"నాన్నా ! నాన్నా !"

"ఎందుకురా అబ్బీ !"

"పిచ్చు మావయ్యకు మరి, మరి తొమ్మిది వందల రూపాయల జీతం. చాల డబ్బున్నవాడట కాదు? "అంటూ," ఎంత డబ్బు ఉంటుంది? ఇంత డబ్బు ఉంటుందా?" అని రెండు చేతులూ ఎత్తి దాని ప్రమాణం చూపిస్తున్నట్టు అంటున్నాడు.

"అయితే ఏమిటి యిప్పుడు ?"

"అది కాదు నాన్నా ! నేను పిచ్చి మావయ్యను నారింజ పండ్లు అడుగుతూఉంటే వినిపించుకోనట్టు ముఖం తిప్పేసుకొన్నాడేమిటి వేరే ఎక్కడో చూస్తున్నట్టు?"

"అతనికి వినిపించి ఉండదు. విని పిస్తే కొనిపెట్టేవాడే !"

"నేను గట్టిగా అరచి చెప్తూ ఉంటే వినిపించక పోవడం ఏమిటి ?"

"అయితే ఎందుకు కొని పెట్టలేదు ?"

తిరిగి ఆ ప్రశ్న నేనే వేశాను. పిల్లవాడు నారింజ పండు తింటున్నాడు. అది నేను కొనిపెట్టిందే.. పిల్లవాడు ఏదో చెప్పబోతున్నాడు. "నాన్నా ! మరేం ! మరి పిచ్చు మావయ్య నాకు మూడు చక్రాల సైకిలు కొని పెడ్తానన్నాడు. కొని పెడ్తానని ఎన్నిసారులంటాడో, ఎప్పటికీ యివ్వకుండా అలాగే మార్చి వేస్తున్నాడు"

"మావయ్య ఎందుకు కొని పెట్టాలి. నేను కొనిపెడ్తాలే"

"నీ వెలాగ కొని పెట్టగలవు నాన్నా !"

"ఏం ?"

"నాకు నూరు రూపాయల జీతమే కదా !"

"నీకు ఎవరు చెప్పారు ?"

"మరేం . . . పిచ్చి మావయ్యే చెప్పాడు."

"నీతో చెప్పాడా మీ నాన్నాకి నూరు రూపాయలే జీతమని"

"నాతో చెప్పలేదు నాన్నా ! అత్తయ్యతో చెప్పాడు. నువ్వు మద్రాసునుంచి
ఉత్తరం వ్రాశావు చూడు, వినాయక చవితికి, అప్పుడు అత్తయ్యతో మావయ్య చెప్పాడు.
) వప్పుడు తొందర తొందరగా మద్రాసు వెళ్లి పోవలసి వచ్చింది. అర్ధణా పెట్టి
కాగితపు గొడుగు కూడ నీవు కొన లేవట."

గొప్ప చిక్కే వచ్చిందే !

"ప్రొద్దు పోయింది. ఇంక పడుకో"

"నాకు మోటారు కొని పెట్టాలి నాన్నా !"

"అలాగే కొంటాలే"

"పెద్ద మోటారు అక్కర లేదు. చిన్నది. "కీ" యిస్తే గిర్రున తిరిగి
స్తుందే అది. ఇంత ఉంటే చాలు !"

"అవునులే — అదే — కొంటాలే"

"నాన్నా, నారింజ పళ్లు,"

"నువ్వు పడుకో — తిరుచినాపల్లి రాగానే కొని పెట్తాను"

"పో, నాన్నా !"

"రైలు కదలి పోతుంటే. ఇప్పుడెక్కడ తెచ్చి పెట్టనురా ?"

"అయితే — ఈ లోపున నా కొక కథ చెప్పు"

"అలాగ అడుగు . మంచి కథ చెప్తాను. అనగనగా ఒకఊరిలో" ఇలాగ చెప్పకొని
తూ ఉంటే సగం కథ విని పిల్లవాడు అలాగే నిద్ర పోయాడు.

"పిల్లవాడు మంచి తెలివి గలవాడు. చాల "ప్రూడ్" చూడండి ఎలాగ స్టడీ
ఏ మాటలాడుతున్నాడో !" అని ఎదురుగా ఉన్న ఆసామీ పిల్లవాడిని మెచ్చుకొంటూ
నో పలుకరించాడు. "అందుకే వాడి తల పెద్దది," అని పిల్లవాడి కేసి చూచాడు.
ల్లవాడి తల కొంచెం పెద్దదే. వెడల్పయిన ముఖం. ముక్కు తీరు, కన్ను తీరు అంద
ైన ముఖం. దాని తగిన శరీరం. తళతళ మెరుస్తున్న పచ్చని ఛాయ. కన్నుల
దికి ముంగురులు ముసురుకొని వస్తున్నాయి. తల జుట్టు చెదరి, ఉంగరాలు లాగు
ట్టుకొని మీద పడుతున్నాయి. ఆ పిల్లవాడిని చూస్తే అందమైన పిల్లవాడే అనవచ్చు.
పటి మధ్యాహ్నం కాని వాడు అమ్మ దగ్గరకు చేరుకోడు. అంతవరకు ? ఎవరో ఒక
నాథ శిశువును చూచినట్టున్నది నాకు ! తల్లి సరసను లేక పోతే పిల్లలకు శోభ
క్కడనుంచి వస్తుంది ? అక్కడికీ పట్ట లేక పిల్లవాడిని ఒకటి రెండు సారులు తడవి

చూచాను. ఏ కపటమూ ఎరుగని యీ పిల్లవాడిని మోసం చేసి ఏమార్చడానికి పిచ్చు మావయ్య కి ఎలాగ మనస్సు వచ్చింది ? పిసిని గొట్టు, పిసిని గొట్టు అని ఉద్యోగానికి వెళ్లి నప్పటినుండి సంపాదించిన ప్రఖ్యాతి చాలదా ? ఇంక పిల్లవాడి వద్దకూడ అదే పేరు సంపాదించాలా ? సరి ! పోతే పోయింది అని వదలి వేయడం నాకు చేతకాదు. పిల్లవాడి ముఖం చూస్తూ ఉంటే. నా కెంతో అవమానంగా ఉంది. చాల చిన్న విషయం. వట్టి అల్ప విషయం అయినా నేను భరించ లేక పోతున్నాను. పిచ్చు మావయ్య ఒక్కొక్క పైస లెక్క పెట్టి ఎలాగ అంత సొత్తు ఆర్జించిందీ నాకుతెలుసు. అతనే కాదు, అతని భార్య, అతని కుటుంబం ఎంత పిసినారిగా డబ్బు కూడ బెట్టారో అవన్నీ తెలుసు. పుట్టినప్పటినుండి పెరిగి పెద్దవాడైన వరకు సొమ్ము కూడబెట్ట డానికి అతడు కరచిన గడ్డి, అతడు చేసిన చేయరాని పనులు, చెప్పిన అబద్ధాలు అవన్నీ నా తలలో చక్రం తిరిగి నట్టు తిరిగి పోయాయి. ఇదా యితడూ, ఇతని కుటుంబమూ జీవితంలో సాధించిన "విజయం". ఇవన్నీ తలచుకొంటూ వుంటే. ఆ దృశ్యాలతో నా తల గిరున తిరిగి పోతున్నది. రాత్రి అంతా అదే ధ్యానం. నిద్రే పట్టలేదు.

తిరుచ్చి రాగానే నారింజపళ్లు కొన్నాను.

"అవి ఊరికి పోయి తింటాను నాన్నా ! అమ్మ కనిపించగానే ఇవి యిస్తాను. అవి అమ్మ తింటుంది" అని పిల్లవాడన్నాడు.

"ఆల్ రైట్" పోనీ అలాగే చేద్దువుగానిలే"

బండి కదలడానికి ఇంక అరగంట టయిముంది. దాహంగా ఉంది. పెట్టె దిగి మంచి నీళ్లు తీసుకొని తాంబూలం చేసుకొని తిరిగి వచ్చాను. తిరిగి వస్తూ ఉంటే ఎవరో ఒక స్త్రీ మా పెట్టెలోకి ఎక్కుతూంది. ఆమెకూడ ఒక అమ్మాయి. వాళ్లిద్దరూ వచ్చి, నేను కూచున్న బల్లకు ఎదురుగా ఉన్న బల్ల మీద కూచున్నారు.

"మాయవరం పోయే బండి ఇదేనా ?"

"అవును ఇదే."

"ఎప్పుడు బయలు దేరుతుంది ?"

"మరి ఇరవై అయిదు నిమిషాలకి"

"మీ రెక్కడి వరకు వెళ్తున్నారు ?"

"నేను కుంభకోణం వెళ్తున్నాను."

"ఈ అబ్బాయి మీ పిల్లవాడా ?"

"మరే,"

"మై మరచి నిద్ర పోతున్నాడే"

"బెంగుళూరునుంచి వస్తున్నాము. అలసి పోయాడు. నిద్ర పోతున్నాడు."

"నువ్వుకూడ పడుకుంటావా యేమిటే ?" అని ప్రక్క పిల్లను అడిగింది.

"లేదు మామ, నాకు నిద్ర రావడం లేదు," అని ఆ పిల్ల అన్నది.

"కొంచెం సేపు పడుకోవే తల్లీ ! రాత్రి పూర్తిగా ప్రయాణం. రేపు ఆ పైన ఎల్లుండీ పూర్తిగా రైలులోనే ఉంటావు కదా !"

"వద్దు మామ — తరవాత పడుకొంటాలే — ఇప్పుడు నిద్ర రావడం లేదు," అన్నది ఆ అమ్మాయి.

ఆమెకు నలభై సంవత్సరాల వయస్సు ఉంటుంది. రాత్రి వేళ సరిగా తెలియడం లేదు కాని బంగిన పల్లి మామిడి పండులాగ పచ్చని శరీరం. చెవులలో ప్రాత మాదిరి కట్టింగు చేసిన "బ్లూ జొగ్గర్" రవ్వల దుద్దులు. ముక్కుకి రవ్వల బేసరి.

చేతులకు ఏడెనిమిది జతల గాజులు. మామిడి పిందెల అంచు పట్టు చీర. ప్రక్కగా పెట్టిన పసుపు కుంకుమ ఉన్న పెట్టె. చూచే కొద్దీ ఇంకా చూడాలని అనిపించే ముఖ వర్చస్సు. ప్రక్క బిల్ తోలుపెట్టె. కొత్తగా కొని తెచ్చి పెట్టిన కుంపటి పొయ్యి.

ఆ యమ్మాయికి ఎనిమిది తొమ్మిదేళ్ల వయస్సు ఉంటుంది. ఎండి పోయి వాడి పోయినట్టున్న శరీరం. చేతులూ కాళ్లూ వాడి వత్తలై పోయాయి. కన్నులు మాత్రం కళకలిగి చూడాలనిపించేటట్టున్నవి. జీవకళ తొణికిసలాడుతున్న ముఖం. చేతికి నల్ల రబ్బరు గాజుల జత ఒకటి. కొత్తగా కొన్నట్టు కనిపిస్తున్న ఒక "చీటీ గుడ్డ రకం లంగా", ఎర్రటి గుడ్డ మీద పూవులున్న వాయిల్ జాకెట్టు. అది కూడ కొత్తదే. మెడలో ఒక పట్టాకు కూర్చిన నల్ల అద్దాల మణిమాల. ప్రక్క మరొక చీటి గుడ్డ లోలంగా మూటగట్టి ఒక వల చిక్కలో పెట్టి ఉంది. దానిలోనే మరొక జాకెట్టు, తినడానికి తిను భండారాలూ ఉన్నవి.

ఆ కూర్చున్న ఆవిడకు ఈ అమ్మాయికీ ఏమిటి సంబంధం ? వాళ్లిద్దరు ఏమవుతారో ? ఏలాగ అడిగేది ?

బండి ఇంక కదుల్తుందనే సమయానికి ఒక అరటి పండ్లవాడు అలాగ వచ్చాడు. వాడి వద్ద ఒక అత్తలం అరటిపండ్లు కొన్నాను. అందులో ఒకటి తీసి ఆ యమ్మాయికిచ్చాను. ఆ పిల్ల ఏమీ బదులు చెప్పకుండా తీసుకున్నది.

"తిను."

"తిను," అని ఆమె చెప్పడం తడవుగా ఆ యరటి పండు తీసి నోటిలో వేసుకున్నది.

ఈ పిల్ల కలకత్తాకు వెళ్ళుతున్నది.''

లకత్తాకా ?''

వును. కలకత్తాలో మన ప్రాంతం ఆసామీ ఒకరు పెద్ద ఉద్యోగంలో ఉన్నారు. ఈ పిల్ల వెళ్ళుతున్నది. రాత్రి మాయవరం నుండి ఆతనికి తెలిసిన వాళ్లెవరో వెల్తున్నారట. ఆయనకి తీసుకొని పోయి ఈ పిల్లను అప్పగించాలి. మంచి నువు, సమర్థురాలు.''

వాత ఆ పిల్లను గురించి నేనే అడగడం మొదలు పెట్టాను.

పేరు ఏమిటమ్మాయి ?''

మాక్షి అని అసలు పేరు. కాని అంతా "కుంజు" అని పిలుస్తారు.''

ేష్ ! భేష్.''

మిటి ఈ మాత్రం దానికి భేష్ భేష్ అంటున్నా రేమిటి ?'' అని ఆ ప్రక్క వ్వడం మొదలు పెట్టింది. ఈ యిద్దరికీ ఎలాగ పొత్తు కుదిరిందో !

కు నవ్వు వచ్చింది.

ానికేం? పేరులో ఏముంది కాని, నేను నవ్వింది వేరే కారణం. నాకు కామాక్షి చెల్లెలు ఉండేది. సరిగా యిలాగే ఉండేది. మంచి ఇంటిలో సంబంధం పెళ్లి చేశాము. భర్తకూడ బుద్ధిమంతుడే. భాగ్యవంతుడు. ఇరవై వేల స్తి. మంచి ఉపకారి. ఎవరికో మేలు చేద్దామని సహాయం చేసి ఆ యిరవై గొట్టుకొన్నాడు. ఆ దెబ్బతో ఆతని నోరు పడి పోయింది. అతని సంసారం చితికిపోయింది. చాల కష్టాలు పడ్డారు. చెప్పడానికి వీలులేని కష్టాలు అనుభవించారు. పడరాని పాట్లు పడ్డారు. చివరికి నాలు ంవత్సరాలనుండి యేదో ఒక చిన్న ఉద్యోగం చూచుకొని కాలక్షేపం చేస్తున్నారు. ష్టాలు కొంచెం గట్టెకాయి. దాని తర్వాత ఇంకొక చెల్లెలు. "కుంజు" అని రు . దానికి పెళ్లి చేయడానికి ఎన్ని ప్రయత్నాలు చేశాం. కాలేదు. చివరికి నత్త కుమార్తె ఒకర్తె ఉన్నది. ఆవిడకు పిల్లలు లేరు. ఎప్పుడు చూచినా బాధ పడుతూ ఉండేది. తన భర్తకే యీ పిల్లనిచ్చి పెళ్లి చేయవలసిందని చి, తానే బలవంతం పెట్టి పెళ్లి చేయాలని కోరింది. మా నాన్న అలాగే పెళ్లి అయితే చేశారు కాని ఆ మరునాడు నుంచి ఆ పిల్ల పడిన పాట్లుదైవానికే పది సంవత్సరాలయిున తర్వాత ఒక మగ పిల్లవాడు కలిగాడు. వాడికిప్పుడు ్లి. ఆ పిల్లవాడు కలిగిన తర్వాత అది ఒక మనుష్య స్త్రీ అని తల ఎత్తుకొని ికి అవకాశం కలిగింది.''

"అదంతా సరే కాని ఒక భార్య ఉండగా మరొక సంబంధం చేయవచ్చా ?"

"ఏమిటి చేసేది ? ప్రాప్తం. ఈ పిల్ల పేరు అడగగానే జ్ఞాపకం వచ్చింది. పిల్లిద్దరూ ఒకే స్థితిలో ఉన్న కారణం చేత భేష్ అని అన్నాను. నవ్వొచ్చింది."

ఈ మాటలు వింటూంటే ఆ పిల్ల ఎలాగ తీసుకుంటుందో చూడటానికి వీలు లేక పోయింది. కొంచెం కునుకు పాట్లు పడుతూన్న నిద్ర ముఖంతో ఎంత మాత్రమూ మార్పు లేకుండా అలాగ ముఖం అప్పగించి వింటూనే ఉంది. ఏమీ చలించ లేదు.

"అమ్మాయి. ఇలాగ చూడు ! నీకు అమ్మా నాన్నా ఉన్నారా ?"

"ఉన్నారు."

"నాన్న ఏమి చేస్తున్నారు ?"

"ఒకటవ తరగతి మాష్టారు."

"అక్కలు చెల్లెళ్లు, అన్నలు తమ్ములుళ్లు ఉన్నారా ?"

"ఉన్నారు. నలుగురు అక్కలు. ఇద్దరు అన్నలు. ఒక తమ్ముడు. వాడి తర్వాత ఒక చెల్లెలు."

"మీ అక్కలందరికీ పెళ్లిళ్లు అయ్యాయా ?"

"ముగ్గురికి పెళ్లి అయింది. రెండవ అక్క నాలుగు ఏండ్లనుంచి మా యింట్లోనే ఉంటున్నది. మగడు పోయాడు."

"అన్న ఏం చేస్తున్నాడు ?"

"పెద్దన్న కంపెనీలో పని చేసున్నాడు. చిన్నన్న సెకెండు ఫారం చదువు తున్నాడు."

"నువ్వు చదువుకోవడం లేదా ?"

"లేదు. మా అన్న ఒక్కడే చదువుకుంటున్నాడు. మేమంతా చదివితే, మాకు జీతా లివ్వడానికి మా నాన్న ఎక్కడనించి తెస్తాడు ?"

"అందుచేత నువ్వు పనిలో ప్రవేశించి ఉంటావు ? అవునా ?"

"మరే, మధ్యాహ్నం భోజనం అందరికీ దొరకడమే మహా కష్టం అయి పోయింది."

"నాకు ఏమి పనులు చేయడం చేతనవును ?"

"పాత్ర సామానులు కడుగు తాను. అంట్లు తోముతాను. కాఫీ , టీ, కాచి యిస్తాను. ఇడ్లీ, దోసె చేసే పిండి రుబ్బగలను. పులుసు, చారు పెట్టడం తెలుసు. పిల్లల్ని ఎత్తుకొని ఆడించగలను. ఇల్లు అలికి ముగ్గు పెట్తాను. కళ్లాపి చల్లుతాను. పొయ్యి రాజేయడం తెలుసు. చీరలు, పంచెలు గుంజి ఆరవేయగలను."

"చీరలు పిడిచి ఆర వేయగలను అంటున్నావు. నాకు తడి బట్టలు గుంజి పైకి ఎత్తగల శక్తి ఉన్నదా ?"

"బాగా తడిపి ఆర వేయగలను."

"ఇవన్నీ ఎక్కడ నేర్చుకొన్నావు.?"

"రామనాథయ్యరు అని ఒక జడ్జీ ఉన్నారు. వారింట్లోనే ఈ పనులన్నీ నేర్చుకొన్నాను.

"హోఁ అలాగే. అప్పుడే సర్వీసు ఉన్నదన్న మాట. వారింట్లో ఎన్ని సంవత్సరాలు పని చేశావు ?"

"మూడు సంవత్సరాలనుండి పనిచేస్తున్నాను."

"మూడు సంవత్సరాలే. అయితే నాకెంత వయస్సు ఇప్పుడు ?"

"ఈ పిల్లకు తొమ్మిదేళ్లు నిండి పదో యేడు నడుస్తున్నది పాపం" అని ఆ ప్రక్క ఆవిడ అందించింది.

"ఏడేండ్ల వయస్సులోనే నీకు ఉద్యోగం దొరికింది. బాగానే ఉందే ? ఏం జీతం యిస్తారు నీకు ?"

"జీతమని యేమీ లేదు. రెండు పూటలా భోజనం పెట్తారు, దీపావళికి లంగా జాకెట్టు, రెండు జతలు కుట్టిసారు — అంతే"

"ఈ జాకెట్టు ఎవరు కొని పెట్టారు ?"

"వారే."

"అలికి ముగ్గు పెట్టి, పొయ్యి రాజేసి, కాఫీ కాని, బట్టలుతికి పిల్లల్ని ఎత్తుకొని ఇడ్లీ, దోసె పిండి రుబ్బి ఇన్ని పనులు చేస్తునందుకు ఈ గజం ఆరణాల చీటి గుడ్డ లేనా నీ కిచ్చింది ? కాసు కాసు లెక్క పెట్టుకొని మరీ యిచ్చేటట్టు ఉన్నారే మీ యజమాని ?"

". . . . . . . . . . . . . ."

"నీవు జీతం ఇమ్మని మంచి బట్టలు ఇమ్మని అడగడానికి వీల్లేదా ?"

". . . . . . . . . . . . . ."

"నీవు జడ్జీగారింటిలో భోజనం చేస్తున్నాను అంటున్నావే. నీ ఒళ్లు చూస్తే అలాగ కనిపించడం లేదే. బక్క చిక్కి పోయి, తిండికి మొగం వాచినట్లు కనిపిస్తున్నావు ? ఏదో కడుపు దెచ్చి తిన్నట్టు డొక్కలు ఆరుకొని పోయి, కళ్లు పీక్కుని పోయి లోపలికిదించుకొని కుక్క ముట్టుకొన్నట్టు కనిపిస్తున్నావే ?"

"పెద్ద పెద్ద కుటుంబాలవారు అదొక రకమని మీకు తెలియదేమో ! వీరింట్లో, మిగిలిన పులుసు, ఎండిన అప్పళాలు, పప్పు నీళ్ల రసం, వీటి తోనే పది రోజులు భోజనం చేస్తారు. రాత్రి పప్పూ చారూ, ఇంత బీర తుక్కు వేపుడు దీనితోనే కాలక్షేపం. అయినా ఆయన ఒళ్లు ఎందుచేతనో నవనవలాడుతూ ఉంటుంది. ఆయన శరీరమే వేరు. ఉక్కు శరీరం. మసలాంటి వాళ్లకి ఇటువంటి తిండి పడనే పడదు. రెండు రోజులీ రకం తిండి తింటే, నోరు లొక్కుని పోయి, కళ్లు లోపలికి పోయి, అన్నం అన్నం అని సలువరిస్తాం," అంటూ ఆ పెద్దావిడ నన్ను కూడ తనతో కలుపుకొని మాటలాడడం మొదలు పెట్టింది. మర్యాద కోసం అలాగ నన్ను కూడ చేర్చి ఉంటుంది. వెంటనే ఏదో తప్పుమాట వచ్చేసినట్టు' క్షమించండి, నేను ఏదో నోటికి వచ్చినట్టు మాట్లాడేశాను. మీరేమనుకొంటారో ఏమిటో ?" అని తిరిగి దిద్దుబాటు చేసుకొన్నట్టు మాటలాడింది.

"భయపడ సక్కరలేదులెండి. నేను మీలాంటి కుటుంబానికి చెందిన వాడినే. తాలుకా ఆఫీసులో గుమాస్తాను."

తంజావూరు స్టేషన్ దగ్గరకు వస్తున్నది.

"ఇక్కడ తుండు గుడ్డ వేసి వెళ్తాను. ఈ చోటు కొంచెం చూస్తూ ఉండండి. నేను పోయి భోజనం చేసి, పిల్లవాడికి భోజనం తెచ్చి పెట్టాను. ఇప్పుడే వస్తాను. చోటు చూస్తారుగా?"

"మీరింకా భోజనం చేయలేదా ? ఏం అమ్మాయి నీవేం భోజనం చేశావు? ప్రొద్దుట ఏమైనా ఎంగిలి పడ్డావా?"

"చద్దన్నం తిన్నాను."

"ఎక్కడ?"

"జడ్జిగారింట్లోనే."

"చూశారా? జడ్జీగారట. పెద్ద మనుషులట. ఇలాగే ఉంటుంది. ఊరికి పోతున్న పిల్లకు, మూడు సంవత్సరాలుగా నానా కష్టాలూ పడి ఒళ్లు దాచుకోకుండా పని చేసి శ్రమ పడిన పిల్లకు కొంచెం కడుపు నిండా తిండి పెట్టి పంపిస్తే ఏం పోయింది? తొమ్మిదింపావుకి నేను బయలు దేర బోతుంటే. తీసుకొని వచ్చి అప్పగించారు. ఈ లోపున వంట చేయడానికి వీలులేదా? మంచి మనసు! ప్రాతగా మిగిలి పోయిన చద్దన్నం ఇంత పారేసి పొమ్మన్నారు. ఆచారం, మడి తడి అంటారు! అవన్నీ యేమై పోయాయో. వారింట్లో పిల్లలయితే యిలాగే చద్దన్నం పెట్టి పంపిస్తారా?" ఎలాగ పెట్టి పంపించారో చూడండి!"

"నేనే చద్దన్నం తిన్నాను లెండి"

"హాఁ . . . సరిగానీ, నీ కిప్పుడు ఆకలిగా ఉందా ?"

"లేదు."

"ఏదైనా తింటావా ?"

"సరి, కానివ్వండి"

"ఒక పొట్లం సాంబారు అన్నమూ, మరొక పొట్లము పెరుగు అన్నమూ తెచ్చి పెట్టండి."

"అలాగే వచ్చేటప్పుడు తెస్తాలెండి."

"అదేమిటి ? ఈ డబ్బులు తీసుకు వెళ్లండి."

"డబ్బులెందుకు ? నేనిచ్చి తెచ్చి పెట్తానులెండి"

"డబ్బు లివ్వవద్దని మీరంటే యెలాగ ? ఆ పిల్లను వెంట బెట్టుకొని వెళ్తున్నది నేనుకదా ?"

పెద్ద చిక్కే వచ్చి పడింది. ధర్మ సంకటమే. వెళ్లి తీసుకొని వస్తాను. ఇంతలో పిల్లవాడు లేచి కూర్చున్నాడు. వాడు లేచే లోపున జనంలోకి వెళ్లి అన్నం పొట్లాలు ఇద్దరికీ కొని తెచ్చాను.

"ఇది యెవరు నాన్నా ?"

"ఈ అమ్మాయా ? మాయవరం వెళ్లి అక్కడినుండి కలకత్తా పోతుందట ! నీతో పాటు ఈ పిల్లకూడ భోజనం చేస్తుంది."

ఇద్దరు అనాథలూ భోజనం చేస్తూ ఉంటే అది చూస్తూ ఉండగా నాకెంతో జాలి పుట్టుకొని వచ్చింది. అనాథలు ! తల్లులను విడిచిపెట్టి వెళ్తున్న అనాధలు ! అయితే వాళ్లిద్దరికీ మధ్య ఎంత వ్యత్యాసం ? ఒక అనాధ మరి రెండు గంటలలో తల్లి ఒడిలో చేరి తుళ్లిపడి ఆనందిస్తాడు. మరొక అనాథ తల్లిని విడిచిపెట్టి. దూరంగా ఎంతో దూరంగా వెళ్లిపోతున్నది.

"ఉస్సుస్సు . . . . . నాన్నా నాన్నా," పిల్లవాడు ఆపసోపాలు పడుతున్నాడు. పెరుగన్నంలో మాగాయ కారంగా ఉంది. "మంచి నీళ్లు . . . మంచి . . " ఆపిల్ల వెంటనే లేచి, తన సంచిలోని పంచదార పొట్లం తీసి వాడికిచ్చింది. కొంచెం సేపయిన తర్వాత "తమ్మూ ! పెరుగు అన్నం గట్టిగట్టిగా ఉంది. ఉండు కొంచెం కలిపి పిసికి పెట్తాను. తర్వాత తిందువుగాని." తాను భోజనం చేస్తున్నది విడచి పెట్టి చేతులు కడుక్కొని వచ్చి ఆ రైల్వే పొట్లం మన్నం మెత్తగా పిసికి పక్వంగా చేసి ఆ పిల్లవాడి కిచ్చింది.

ఇలాగ అన్నం కలపడం, పిసకడం ఇదంతా చూచి నావైపు ముఖం పెట్టి చిన్నగా నవ్వాడు పిల్లవాడు.

"ఎందుకురా నవ్వుతున్నావు ?"

"ఆ యమ్మాయి కలిపిపెట్టింది నాన్నా," అంతకు పైనచెప్పడానికి వాడికి రాలేదు.

వాడి భోజనం అయిన తర్వాత చేతులు కడగి మూతి తుడిచి అంతా చేసింది. కూడ ఆ పిల్లే.

"ఇదిగో ! మంచి నీళ్ల త్రాగు," అని మంచి నీళ్లు తెచ్చి వాడికిచ్చింది.

"వద్దు."

"మంచి నీళ్లు తాగితేనే అన్నం జీర్ణమవుతుంది. ఇదిగో ! తాగు."వాడు పడుకో బోతూఉంటే ఈ మంచి నీళ్లు చూచి మరి బదులూ చెప్పకుండా తాగాడు. ఎన్నో యేళ్లనుండి తెలిసిన దానిలాగ వాడి చేతులు పట్టుకొని తీసుకొని వచ్చి ఆ యమ్మాయి కూర్చో బెట్టింది. తరవాత తన చోటులో తాను కూర్చున్నది. ప్రక్క ఆవిడ అలాగే ఉన్నది.

"కలకత్తా వెళ్తానంటున్నావే. అక్కడ ఆయన తెలుసా ?"

"తెలియదు మామా ! ఆయన పెద్ద ఉద్యోగంలో ఉన్నారట. మూడు వేల రూపాయల జీతమట. వారి పిల్లల్ని ఎత్తుకొని ఆడించడానికి నన్ను పిలిపించారు. అందుకని వెళ్తున్నాను."

ఎవరి పిల్లల్నో ఎత్తిఆడించడానికి మరొకపిల్ల ఇంతదూరంనుండి వెళ్తున్నది. కనీ వినీ యెరుగని ఒక దేశానికి ఒక తల్లి తన బిడ్డను మరెవరి బిడ్డల్నో చూడటానికి పంపిస్తున్నది. ఆ పిల్ల ఒక చిన్న గుడ్డ చుట్ట బెట్టుకొని మాటాడకుండా వెళ్తున్నది.

"ఈ పిల్ల చాల తెలివైన పిల్లలాగ సమర్థురాలు లాగ కనిపిస్తున్నదమ్మా," అన్నాను ఆ ప్రక్క ఆవావిడకేసి చూచి.

"ఎంత సమర్థురాలైతే ఎందుకు ? రెక్కలు ముక్కలు చేసుకొని అంత పనిచేస్తే బక్కచిక్కి యిలాగ తయారయింది. కలకత్తాకు వెళ్లక పోతే నా వద్దనే ఈ పిల్లను ఉంచుకొనేదాన్ని. ఆకలిగా ఉందా అని మనం అడిగే వరకు ఆ పిల్ల నోరు విప్పి అడగన్నైనా అడగిందేమో చూశారా ? ఏమిటో ! ఇటువంటి వాళ్లను ఆ భగవంతుడే కాపాడాలి ! మనమేం చేయగలము ?"

పిల్లవాడు నారింజపండు చేతులో పట్టుకొన్నాడు.

"ఏం నాయనా ? ఆ పండు ఒలిచి పెట్ట మంటావా ? అని ఆమె అడిగింది.

"వద్దు. ఊరికి వెళ్లిన తర్వాత మా అమ్మనే ఒలిచి పెట్టమని అడుగుతాను."

"నేను మాత్రం అమ్మను కానా ? నేనూ అమ్మనే."

పిల్లవాడు నవ్వుతూ ముఖం త్రిప్పేసుకొన్నాడు. ఒక్క నిమిషం గడచి పోయింది.

"నీ కెంత వయస్సు ?" అని పిల్లవాడు ఆ "కుంజా"ను చూచి హఠాత్తుగా ఒక ప్రశ్న వేశాడు.

"పది యేండ్లు."

"పదేళ్ల వయస్సా ! అయితే నీవు అయిదో తరగతి చదువుతున్నావా ?"

"లేదు."

"అదేమిట్రా ? పదేళ్ల వయస్సు అయితే అయిదో తరగతి చదవాలని ఉందా యేమిటి ?"

"అవును నాన్నా ! నాకు ఆరేళ్ల వయస్సు. ఒకటో క్లాసు చదువుతున్నాను. ఆరు, ఏడు, ఎనిమిది, పది. ఆమె అయిదో క్లాసు."

"ఆ అమ్మాయి చదవడం లేదురా ?"

"నువ్వు చదువుకోవడం లేదూ ?"

"ఇంట్లో చదువుకొంటున్నావా ?"

"హుం."

"ఆ యమ్మాయి కలకత్తా వెళ్తున్నది. అందుకని చదువుకోవడం లేదు."

"అక్కడికి ఎందుకు వెళ్తున్నది ?"

"పని చేయడానికి."

"పోనాన్నా ! ఏం అమ్మాయి ! నువ్వు పని చేయడానికి వెళ్తున్నావా ?"

"అవును."

పిల్లవాడు ఆ పిల్లకేసి కొంచెం సేపు దీక్షగా చూచాడు. అతనికి ఆ పిల్ల పని చేయడంకోసం కలకత్తా వెళ్తున్నదంటే నమ్మకం కుదరలేదు. మళ్లీ అడిగాడు.

"నీకు సైకిలు ఎక్కడం చేతనవునా ?"

ఆ పిల్ల పకాలున నవ్వింది. ఆ పిల్ల ఇంత సేపటికి హాయిగా నవ్వింది అదే తొలసారి.

"నాకు సైకిలు ఎక్కడం ఎలాగ వస్తుంది ? రాదు"

"అయితే, నువ్వు పనికి ఎలాగ వెళ్తావు ?"

"నడచి వెళ్తాను."

తిరిగి ఆ యమ్మాయిని చూచి పిల్లవాడు ఏదో ఆలోచిస్తున్నాడు. నాన్న పనికి వెళ్తే సైకిలు మీద కాని వెళ్లడు. ఈ పిల్ల పనికి వెళ్తే నడచే వెళ్తాను అంటుంది. అంత దూరం నడచి యెలాగా వెళ్తుందో సైకిలు లేకుండా ఎలాగ పని చేస్తుందో పిల్లవాడికి అర్థం కాలేదు. ఇద్దరు పిల్లలూ, రైలు బండి కిటికీలు తెరచి, రైలు బండి వేగం చూస్తూ కూచున్నారు.

"ఈ పిల్ల ఎవరిని నమ్మి అంత దూరం పోతున్నదో ! వెళ్తూఉన్న చోటు ఎలాగ ఉంటుందో !" అని అడిగాను.

"ఈ పిల్ల పని చేస్తూ వున్న జడ్జీగారికి వేలు విడచిన మేనమామ కొడుకు ఆయన. కలకత్తాలో పని. మూడు వేల రూపాయల నెల జీతం. ఏదో కంపెనీలో ఉద్యోగం చేస్తున్నారట. మన ప్రక్క పిల్ల అయితే విశ్వాసంగా ఉంటుంది అని పంపించమంటే ఈ పిల్లను పంపుతున్నారు. ఏది ఎలాగున్నా కడుపు నిండా తిండీ కట్టడానికి గుడ్డా వీటికి కరువు ఉండదు. అన్నీ పెట్టి బాగా చూస్తారు అనుకొందాం. ఎన్నిచేసి ఎన్నిపెట్టినప్పటికీ ఇంట్లో పుట్టిన పిల్లను చూచేదానికి, పనిచేయడానికి వచ్చిన పిల్లనూ చూచే దానికీ తేడా ఉండదా ? ఆ పిల్ల, వాళ్లను తన తల్లి అనా, తన తండ్రి అనా భావించుకో గల్గుతుందా ? అయితే ఈ పిల్ల అన్నింటికీ ఒప్పుకొని సర్దుబాటు చేసుకొని పోయే ధోరణి చూస్తే ఎక్కడయినా సంభాలించుకొని పోగలదు అన్నట్టు అనిపిస్తుంది. కాని తల్లి దండ్రుల వద్ద ఉన్న పాటి వస్తుందా బాబూ ! మీరే చెప్పండి."

నాకు కడుపులో చెయ్యి వేసి కలచివేసినట్టయింది. నాకు ఏదో ముక్కు మొగం ఎరుగని ఎవరినో చూడటానికి ఎక్కడికో వెళ్తూన్నట్టు ఒక శూన్యమూ, ఒక భయమూ, ఒక దిగులు, ఒక బెంగ నన్ను పెన వేసుకొన్నట్టు అయింది.

"ఈ పిల్లని భగవంతుడే కాపాడాలి, లేక పోతే మనుష్యుల్ని నమ్ముకొని ఈ పిల్ల తల్లి దండ్రులు ఇలాగ విడిచి పెట్టి వేస్తారా ?" అన్నాను.

"అవును—ఆ భగవంతుడే ఈ పిల్లను కాపాడాలి. అంతకంటే మనం ఏమీ చెప్పలేము. తిరిగి తిరిగి ఆ నమ్మకం లోకే వస్తాము. లేక పోతే ఇది భగవంతుని చిద్విలాసం కాకపోతే కన్న బిడ్డను ఎక్కడో దూరంగా కడుపుకోసం పంపించవలసిన గతి ఒక కుటుంబానికి పట్టుతుందని ఎవరు ఊహించగలరు ? ఆ బడిపంతులు చిన్న బడిలో పిల్లలకు చదువు చెప్తూన్నందుకు ప్రతిఫలంగా అతని కుటుంబమూ, అతని బిడ్డలూ ఇన్ని అవస్థలు పాలు కావలసి వచ్చిందీ అంటే అది చూచీ చూడనట్టు ఊరుకునేదేశం ఇది ఒకటేనా ? ఇంకా ఇలాంటివి ఎన్ని ఉన్నాయో ? ఇదంతా భగవంతుడి మాయ విలాసం అని సరిపెట్టుకొంటాం !"

"అయితే, ఈ అమ్మాయి వెళ్లిపోతే జడ్జీగారి యింట్లో పిల్లల్ని ఎవరు చూస్తారు?"

"ఎవ్వరూ చూడరు. దాని కది సరి."

"వాళ్ల యిల్లూ వీళ్ల యిల్లూ దగ్గిరే. పిల్లలకి చదువు చెప్పే మాష్టారులాగ ప్రక్క యింటిలో సంతులు కాపురం ఉన్నాడుగా ! వాళ్లే చూస్తారు." నా కేమీ బోధ పడటం లేదు.

ఆ పిల్లను చూస్తే అందరికీ జాలి కలిగింది. ప్రక్క తంజావూరునుండి జయం పేటనుండి మధ్య పెట్టెలో ఎక్కి కూర్చున్న ఆసామీలు ఆ పిల్ల కథ సగం సగం విన్నప్పటికీ వాళ్లకెంతో జాలి కలిగింది. ఆ పెద్దావిడ కూర్చున్న బల్ల చివరి కోడు మీద కూర్చున్న ఒకాయన — రావుజీ లాగ ఉన్నాడు, ప్రక్క కిటికీ తెరచి ముఖం అటువైపు తిప్పేసుకున్నాడు. ఈ పిల్లను చూచిన జాలిచేత లోపలినుండి పొంగి వస్తూన్న వేదన భరించ లేక అటు వైపు ముఖం తిప్పేసుకొన్నాడేమో అని పిస్తున్నది.

కుంభకోణం స్టేషన్ వచ్చి వేసింది.

"అమ్మా! వెళ్లి వస్తాను — అమ్మాయి వెళ్లిరానా ?' అని చెప్పి ఆ పిల్ల చేతిలో ఒక రూపాయి పెట్టాను.

"మీ రెందుకు దబ్బు ఇస్తున్నారు ?" అని పెద్దావిడ అభ్యంతరం పెట్టింది.

"ఈ అమ్మాయి అంటే నాకు బాధ్యత ఉన్నది. ఈ పిల్లని మీరయినా దిగ చెప్పడానికి కదా కూడతీసుకొని వెళ్తున్నారు. ఈ పిల్ల ఒక సంతులు గారి కుమార్తె. మీ అమ్మాయి కాదు కదా ? మీకున్న బాధ్యత నాకు కూడా ఉన్నది. నాకు అలాగ తోచింది. ఏం చెయ్యను ? ఆ పిల్లను చూచి ఇవ్వాలని బుద్ధి పుట్టింది. ఇచ్చాను. అంతకంటె ఏమి చెప్పను?"

"హుం" అంటూ ఆ చీకటిలో ఒక మెరుపు ఏగె మెరసినట్టయింది. "తీసుకోవే తల్లీ ! నాయనా ! మీవంటి వారికి ఏ లోటూరాదు ! అన్నింటికీ ఆ సర్వేశ్వరుడే ఉన్నాడు !"

"నాన్నా ! ఇది యిచ్చి వస్తానుండు" అని పిల్లవాడు తన చేతిలో నారింజపండు చూపించాడు.

"ఇచ్చిరా పుచ్చుకుంటుందేమో !"

"వస్తూ తమ్ముడు ! చిట్టి తమ్ముడు పాపం ! ఊరికి వెళ్లిన తర్వాత అమ్మ ఒలిచి పెట్టుంది తిందామనుకొని ఎంతో ఉల్లాస పడుతూ చెప్పాడు."

"నాన్నా ! ఇది పుచ్చుకోమని చెప్పు నాన్నా!" అని పిల్లవాడు గారం గుడుస్తున్నాడు.

"తీసుకో అమ్మాయి."

ఆ అమ్మాయి నారింజ పండు తీసుకొన్నది.

"స్వామీ ! మీకు మంచి బుద్ధిమంతుడైన పిల్లవాడు కలిగాడు. ఇలారా ! నాన్నా ! ఏదీ ఒక్క ముద్దిచ్చిపో !" అని ఆవిడ పిల్లవాడిని దగ్గరకు తీసుకొంది పిల్లవాడు ముద్దుపెట్టి పరుగెత్తుకొని వచ్చివేశాడు.

నా ఒళ్లు గగుర్పొడిచినట్టయింది. ఏదో పులకాంకురము. ముఖం ఏలాగో అయిపోయింది. ఎవరూ చూడకుండా తలవంచుకొని పిల్లవాడిని ఎత్తుకొని వడివడిగా అడుగులు వేసుకొంటూ ముందుకి నడుస్తున్నాను. పిల్లవాడికి నడవడం చేత కాకనా ? కాదు. ఏమో? వాడిని చూడగానే అలాగ ఎత్తుకొని తీసుకొని వెళ్లాలని ఒళ్లు పులకరించినట్టయింది. పైకి ఎత్తుకొని వాడిని చేతులతో తడివి, మెల్లగా నిమురుతూ తీసుకొని వెళ్తున్నాను. ఉల్లం పొంగి పోయినట్టయింది. ప్రేమానురాగం అనే సచ్చిదానంద విలాసం ఉడవి లట్టి చూపిన ఆనందం అది. పులకాంకురంగా పొడ సూపింది.

# 7. అమ్మ చూపిన వెలుగు

—పెరియ స్వామి తూరన్

[ఈయన పూర్తి పేరు మ. ప. పెరియస్వామి తూరన్, తమిళ విజ్ఞాన సర్వస్వం తయారు చేస్తున్నారు. కళా సంస్కృతి తెలిసిన కళా కోవిదులు. చక్కని మృదు మధురమైన భాషలో కథలు, కవితలు , వ్యాసములు వ్యాఖ్యలు వ్రాస్తూ ఉంటారు. విజ్ఞాన విషయాలలోనూ, పిల్లల పుస్తకాలలోనూ కృషి చేసి వీనికి సంబంధించిన అనేక రచనలు చేశారు. 'తమిళిసై' ఉద్యమానికి వీలుగా రూపంలో అనేక కీర్తనలు రచించారు. అనేక బహుమతులు పొందారు. "భారతి తమిళ్" అనే పేరుతో సేకరించిన వ్యాసవళి భారతి రచించిన వ్యాసముల సంపుటం వీరి సంపాద కత్వం క్రింద వెలువడింది. "ఇది తమిళా ?", "కళింగరాయన్ కోట," "తేన్ చిట్టు" మొదలైన గ్రంథాలు ప్రచురించారు."]

"సొంగప్పా ! మంచిఅందమైన పిల్లఉంది. పెళ్లి చేసుకొంటావా ?" అని అతనిని అడిగి వేళాకోళం చేయని వాడంటూ కాట్టు పాలెంలో ఒక్కరూ ఉండరు. మగవాళ్లే కాదు. ఆడవాళ్లుకూడ అతనిని చూచి వప్పుడల్లా ఆ ప్రశ్న వేసేవారు. చిన్న పిల్లలకు కూడ ఈ ప్రశ్న వేసి అతని చేత చిదరింపు పొందడం ఒక వేడుకయి పోయింది.

ఈ ప్రశ్న అడిగితే బదులు చెప్పడానికి సొంగప్పకు కొంచెం ఆలస్యమవుతుంది. రెండు మూడు సారులు రెట్టించిన తర్వాత "నాకు అన్నం పెట్టడానికి పెద్దింటి పెద్ద కాపుగారున్నారు. ఇంక నాకు పెళ్లెందుకూ ?" అని ఆలోచించి కొంత సేపటికి ఏమీ తెలియని వాడిలాగ బదులు చెప్పేవాడు. ఇదే జవాబు అతడు మళ్లీ మళ్లీ చెప్తూ వున్నప్పటికి కూడా ప్రశ్నవేసిన వెంటనే అతనికి చెప్పడానికి రాదు. ఈ జవాబు రెండు మూడు సార్లు తనలో తాను కూడబలుకు కోవాలి. ఎంతో చింతన చేసి తరవాత బయట పెట్టినట్టు కొంత ఆలస్యమమైన తర్వాతనే ఈ జవాబు అతని నోటినుండి బయట వెడలుతుంది.

సొంగప్పన్ ఈ జవాబు చెప్తూ ఉంటే. అతని ముఖం అదోకలాగ అయి పోతుంది. చూడటానికి ఎలాగో ఉంటుంది. మనస్సులో మాట ముఖంలో తెలుస్తుం దంటారు కదా ? కాని అతని ముఖంలో మాత్రం అటువంటి దేమీ తెలియదు. అతని ముఖం ఎప్పుడు చూచినా ఒకే మాదిరి చిన్నయ్య చీకటి కొట్టులాగా ఉంటుంది. మనస్సులో భావన ఎలాగ ఉంటుందో కన్నులలోని చూపుల్ని బట్టి గ్రహించవచ్చుననుకొనే

వారు సొంగప్పను చూస్తే చాల ఆశాభంగం పొందుతారు. అతని కన్నులలో ఏ విధ మైన వెలుగూ కనిపించదు.

చాల ఎక్కువగా చెప్తున్నానేమో అతనిని గురించి ? సొంగప్పన్ ఒక మంద బుద్ధి. అతని మెదడులో శక్తి చాల తక్కువ. పుట్టినప్పటినుండీ అతనికలాగే ఉంది. పుట్టుకతోనే వచ్చిన బుద్ధి మాంద్యం. వాడి తల్లిదండ్రులెవరో ఎవరికీ తెలియదు. అతని కంతకంటె తెలియదు. ఎలాగ వచ్చాడో, ఇరవై అయిదు సంవత్సరాలకి ముందు అతడు కాట్టుపాలెం వచ్చి చేరాడు. అప్పుడాతని వయస్సు పదేండ్లు ఉండి ఉండవచ్చును. వచ్చినవాడు వచ్చినట్టు ఆ ఊరిలోనే ఉండి పోయాడు. కాట్టుపాలెం కొంగునాడులో ఒక చిన్న ఊరు.

సొంగప్పకు మెదడు అయితే సరిగా పని చేయదు కాని శరీర బలం బాగా ఉంది. ఎంత కాయ కష్టమైనా చేయడానికి వెనుదీయడు. కావలసిందల్లా ఇంత తిండి. చాలు ! ఎంత పని అయినా చేస్తాడు.

ఊరికే పని చేసే మనిషి ఒకడు దొరికాడు కదా అని ఆ కాట్టుపాలెంలో పెద్ద ధన వంతుడైన పెద్దకాపు, అతనిని చేరదీసి తన ఇంటిలోనే పెట్టుకున్నాడు. మిగిలిన వాళ్ళకి ఇది చూచి కొంచెం అసూయకూడ కలిగింది.

ఊరిలో పనులన్నీ తీరిన తర్వాత కాట్టుపాలెం గ్రామస్థులు గ్రామ చావడి వద్దకు చేరి ఏవేవో విషయాలు గూర్చి ముచ్చటించుకొంటూ ఉంటారు. చర్చలు చేస్తూ ఉంటారు. ఒక్క సారి సొంగప్పన్ ఆ గ్రామ చావడి వద్దకు చేరి అక్కడ కూర్చుంటూ ఉంటాడు. అప్పుడు ఆ పెద్దల మాటలన్నీ సొంగప్ప మీదకు తిరుగుతాయి. అతనికిచ్చి పెళ్లి చేయడానికి తగిన పిల్లను తయారు చేయడంకోసం అందరూ వారిలో వారు పోటీలు పడతారు. అతని పెళ్లి మాటలలోనే ఆవేళ కాలక్షేపం అయిపోతుంది. అది పూర్తి అయితే తప్ప మరే ప్రస్తావనా రాదు.

ఒక్కొక్క సమయంలో అతని తల్లి తండ్రి ఎవరూ అని మీమాంస వస్తుంది. ఆలా తీస్తారు. వెంటనే ఒక్క దెబ్బతో "మీ అమ్మ ఎవరురా ?" అని అడుగుతారు. "అమ్మ మాటకేంలే! తండ్రి ఎవరు అని అడుగు" అని మరి కొందరు అడుగుతారు. ప్రశ్న అర్థం చేసుకొని దానికి బదులు చెప్పడానికి సొంగప్పకు చాలసేపు పట్టుంది. చెవిలో పడిన విషయం, రాత్రి వేళ అడవి దారిని పోయే నడకలాగ అతని మెదడులోకి చేరడానికి నానా తిప్పలూ పడుతుందో ఏమిటో ! చాలసేపు అవుతుంది అర్థం చేసుకోవడానికి అర్థం చేసుకొని బదులు చెప్పడానికి అంతకంటె ఆలస్యం. అయితే, అతనిని యిందరు మనుష్యులు ఇన్ని ప్రశ్నలు ఒకేసారి వేస్తే ఏమి సమాధానం చెప్పగలడు ? ఎలాగ చెప్ప గలడు ?

ఒకరోజు సొంగప్పన్ ఇలాగ తత్తరపాటు పడుతూ ఉంటే ఒక ఆసామి — "లేదురా! సొంగప్పన్ సంగతి చెప్పమంటారా"? ఊరు ఉమ్మడి పుంతలో డొంకలో

దొరికాడు. అక్కడనుంచి తెచ్చి పెంచారు, " అని రాసే ఒక సమధానంతో ఊహించి చెప్పాడు. అదిఊరికే వేళాకోళానికే అతడుఊహించి చెప్పిన మాట అది. కాని అతడు చెప్పింది అందరికీ నచ్చు బాటు అయింది. సాంగప్పన్ కూడ రాను రాను అదే నిజమనుకొన్నాడు. మనస్సులో ఒక నమ్మకం కుదిరింది. గ్రామాల్లో వాళ్లు కుక్క పిల్లలనూ, పిల్లి పిల్లలనూ ఊరు బయట పారేసి వస్తారు. అందులో కొన్ని గాలికి ధూళికి బ్రతుకుతాయి. అలాగే ఆవూరు ఉమ్మడి పుంతలో పడిఉన్న సాంగప్పను ఆ యూరి పెద్ద కాపు తెచ్చి పెంచి పెద్ద వాడిని చేశాడని అనుకొనే వారు. ఊరి ఉమ్మడి పుంతలో పెరిగిన కుక్క పిల్లలు, పిల్లి పిల్లలు లాగ సాంగప్పకూడ పెరిగాడనడం వాడి బుద్ధి మాంద్యానికి సరిపోయింది.

అది మొదలు ఎవరైనా నీ వెలాగ పుట్టావు అని ప్రశ్న వేస్తే కొంచెం సేపు ఆగి ఆలోచించుకొని "ఊరుమ్మడి పుంతలో" అని సమాధానం చెప్పేవాడు. కాట్టుపాలెం గ్రామస్తులకి ఈ వింత సమాధానం కొంతసేపు నవ్వు తెప్పించి వేడుక కలిగించేది.

సాంగప్పన్ చూడటానికి మనుష్యాకారంలో ఉన్నప్పటికీ బుద్ధిలో దున్న పోతు కంటే బండ మెదడు అని ఆఊరిలో అందరి అభిప్రాయము.

అయితే ఆ అభిప్రాయం ఇప్పుడు మారి పోయింది. సాంగప్ప అంటే అమర్యాదగా చూడటం ఇప్పుడందరూ మాని వేశారు. ఎవ్వరూ కూడ అతనిని గేలి చేయడం లేదు.

ఈ విధమైన మార్పు రావడానికి ఒక కారణం ఉంది. ఆపాలు వేసి అమ్ముకొనే రామత్తాళ్ అంటే ఆ చుట్టు ప్రక్కల అందరికి తెలుసు. ఆపం అంటే బియ్యపు పిండి, మినప పిండి కలిపి వేసే మెత్తని అట్టు. చుట్టూ పలచగా ఉండి మధ్య గుండ్రంగా ఉబ్బినట్టు వస్తుంది. దాని మీద కొబ్బరి పాలు వేసి తింటారు. తియ్య తియ్యగా కమ్మ కమ్మగా ఉంటుంది. ఇటువంటి ఆపాలు వీధికి చివరఆరు బయటలో పొయ్యి వేసి ఆడవాళ్లు అమ్ముతారు. వీటిని క్రింద జాతుల వాళ్లు తింటారు. అటువంటి ఆపాలు వేసి అమ్మే అవ్వ రామత్తాళ్. ఆవిడంటే ఆఊరిలో అందరికీ తెలుసు. ఆవిడ తయారుచేసే ఆపం అంటే అంత పేరు ప్రఖ్యాతి సంపాదించుకొంది. ఒక్కసారి అదికాని ఆరగించినవాడు ఆమెను మరచి పోలేడు.

రుబ్బిన బియ్యపు పిండి పట్టుకొని పెనమూ, చట్టీ తీసుకొని రామత్తాళ్ ప్రొద్దున్నే ఏడు గంటలకు బయలు దేరి సంతపేటవైపు రోజూ వెళ్తుంది. కాట్టుపాలెం గ్రామం నుండి అక్కడికి సుమారు అరమైలు దూరముంటుంది. అక్కడే ఆమె వ్యాపారమంతా. అక్కడ ఒక వేప చెట్టు ఉంది. ఆ వేప చెట్టు క్రింద కూచుని పొయ్యి అంటించి దాని మీద ఆపం ఆమె వేస్తుంటే పది గంటల వరకు ఎవరెవరో వచ్చి కూచుని అవి తిని కాలక్షేపం చేస్తూ ఉంటారు. చురుకు చురుకుగా వ్యాపారం సాగుతుంది.

రామత్తాల్‌కు పగలంతా పని ఉంటుంది. పది గంటలకి తన ఆపాల దుకాణం మూసి వేసి ఇంటికి తిరిగి వచ్చి వంట చేయడం మొదలు పెట్టుంది. వంట చేసుకొని, ఆ పదార్థాలు భోజనంచేసి తములపాకులు వేసుకొని కొంచెం సేపు అలాగ కూచుంటుంది. తిరిగి మరునాడు వ్యాపారానికి సరిపడిన పిండి రుబ్బుకొంటుంది. ఇంటిలో ఆమెకు సహాయం చేయడానికి ఎవరూ లేరు. ఆమె పెళ్లి అయిన రెండు సంవత్సరాలకే భర్త చచ్చిపోయాడు. విధవరాలు అయిపోయింది. పిల్లలు కూడ కలగలేదు. ఆమెను ఆదరించి పోషించడానికి వేరే చుట్టాలుకూడ లేరు. ఇలాగ రోజంతా పనిచేసినప్పటికీ ఆమెకు విసుగు లేదు. ఆమె చేస్తున్న పనులు రెండు వేళల్లోనూ ఒకే మాదిరిగా నడుస్తూ ఉంటాయి.వాటిలో మార్పు ఏమీ లేదు.

అలాగ ఎన్నో యేళ్లనుంచి ఆమె యిలాగ కాలక్షేపం చేస్తుంది. ఆమె జీవితం యిలాగే గడచి పోయింది. కదంలేని ముసలి తనం వచ్చి వయస్సు మీరిపోయినప్పటికీ ఆమె ఆపం దుకాణం పెట్టడం మానలేదు. అయితే సంత పేటవరకు బియ్యప్పిండి ఉంచిన చట్టీ, పొయ్యా , పెనము మొదలయిన సామాన్లు మోసుకొని పోవడం యెలాగ అనేది పెద్ద సమస్య అయిపోయింది.

ఒక రోజు ఉదయమే రామత్తాల్ ఆ చట్టిలో ఉన్న బియ్యపు పిండి గంపలో పెట్టుకొని తలమీద యెత్తుకొని ఎంతో కష్టం మీద మోయలేక మోయలేక సంతపేట లోని దుకాణంవైపు వెళ్తున్నది. అది సొంగప్పన్ వాలా సేపు దీక్షగా చూచాడు. అతను కొంత దూరం, ఆమెతోకూడ నడచి తరువాత సగం దూరంవరకు అనుసరిస్తూ అలాగ మౌనంగా చూస్తూ ఉన్నాడు. తరాగే నిలుచుండి పోయాడు. అతని మనసులో ఏమి ఆలోచన బయలు దేరిందో తెలియదు. చటుక్కున ఆమె వైపు మరుగ్గా అడుగులు వేస్తూ వెళ్లాడు.

"సొంగప్పా ! ఆపం రుచిగా ఉందా ?" అని ఎవరో అడుగుతున్నారు. ఆ మాటలు అతని చెవిని బడలేదు. అయితే ఆపం రుచి అతనికి తెలియదు అనే మాట మాత్రం నిశ్చయం. ఎందుచేతనంటే, ఆపం ఎలా ఉంటుందో ఒక రోజు కూడ సొంగప్పన్ రుచి చూడలేదు.

సొంగప్ప గబగబ నడచి వెళ్లి రామత్తాల్‌ను తప్పించుకొని ఆమెకు ముందుగా వచ్చి నిలుచున్నాడు. ఆమె తల మీద పెట్టుకొన్న గంప ఎత్తి పెట్టి తన తల మీదికి తీసు కొన్నాడు. "నేను తీసుకొస్తాలే" అని చెప్పి సంత పేటవైపు చూస్తూ నడవడం మొదలు పెట్టాడు.

రామత్తాల్‌కు కొండ బరువు దించినట్టయింది. కాని ఆమెకు ఏమీ బోధ పడటం లేదు. మారు మాటాడకుండా వానితోకూడా నడుస్తున్నది. "ఎందుకోసం ఈ వెర్రి బాగులవాడు తట్ట తలమీద పెట్టుకొని వస్తున్నాడు ? మోసిన బరువుకి కూలిగా ఆపం పెట్టమని అడుగడు కదా ? వీడి కడుపు బాబ్రకానికి ఆపం పెట్టడం మొదలు

పెట్టితే చట్టినిండా తెచ్చిన పిండి కూడ సరిపోదే ?" అని ఆమె పరిపరి విధాల మనస్సులో ఆలోచించుకొంటూ ఉంది.

సొంగప్పన్ ఆమెకు ఎందు చేత సాయం చేయడానికి వచ్చాడో ఆమె కనిపెట్టడానికి సాధ్యం కాక పోయింది.

ఆవేళ అతడు తట్ట తలమీద పెట్టుకొని సంత పేట మధ్య ఆ వేప చెట్టు క్రిందికి రాగానే అక్కడ తట్టదించి ఒక్క క్షణంకూడ అక్కడ నిలవలేదు. ఒక్కటే పరుగు. ఆవేళ మొదలు మరి రెండు సంవత్సరాల వరకు, అంటే రామత్తాల్ చని పోయేవరకు అతడు గంప తల మీద పెట్టుకొని ఆమె సామానులు మోసుకొని వెళ్లి ఇలాంటి సహాయం చేస్తానే ఉన్నాడు. రామత్తాల్ ప్రొద్దున్నే సంత పేటకు బయలు దేరే సమయం కని పెట్టి, తిన్నగా ఆమె ఇంటి వద్దకు వెళ్లి అక్కడ నిలుచుంటాడు. ఆమెతో ఏమీ మాటలాడాలని అతనికి ఉండదు. ఏమీ పలుకడు, ఉలుకడు.

గంప తలమీద ఎత్తుకొని తిన్నగా సంత పేట వరకు తీసుకు వస్తాడు. అలా చేయడంలో వాడికేదో మనస్తృప్తి ఉండిఉండాలి.

రామత్తాల్‌కు ఇవేమీ అర్థం కాలేదు. వాడి మెదడులాగే వాడు చేసే పనులుకూడ అర్థం కాకుండా ఉన్నవి. ఒకటి రెండు ఆపాలు తినిపో అని ఆమె చాల సారులు చెప్పి చూచింది. వాడు ఆపాలు చూచి నవ్వుకూడ లేదు. అతని మనస్సుకి తృప్తి కలిగించింది ఆపాలు కావు, వేరే ఏదో ఉన్నది.

"సొంగప్పా ! రోజూ నాకోసం ఇంత పని చేసి కష్టపడుతున్నావే. కనీసం ఈ వేళయినా ఒక ఆపం తిని చూడు," అని రామత్తాల్ ఒకనాడు అని చూచింది.

సొంగప్ప ముఖంలో ఒక అర్థం లేని నవ్వు వెలిగినట్టు వెలిగి ఇంతలో మాయమై పోతుంది ? అంతే. మరుక్షణం అతడు కనిపించడు.

"అరేయ్, నీవు ఆపం తినక పోతే, నా గంప మోసుకొని రావద్దు" అని బెదరించి చూచింది ఆ యవ్వ. లాభం లేక పోయింది. ఆపంకోసమని ఈ పని చేయడం లేదని స్పష్టంగా తెలిసి పోయింది.

ఆ అవ్వ డబ్బులిచ్చి చూచింది. ఈ డబ్బులతో ఆకులు చెక్కలు కొనివేసుకో అని చెప్పి చూచింది. ఇవేమీ అతడు లెక్క పెట్టలేదు. ఏమిచ్చినా తీసుకోలేదు. ఆమె ఏమి చెప్పినా ఆ మాటలలోనే అతనికి కడుపు నిండి పోయి ఎక్కడ లేని ఆనందం కూర్చిందో ఏమిటో ! ఆ మాటలు విని ఒక అర్థం లేని వెర్రి నవ్వు నవ్వి, తిరిగి తన త్రోవను తాను వెళ్లిపోయే వాడు సొంగప్పన్.

ఆ వెర్రి నవ్వు చూసే కొద్దీ, అంతకంతకీ ఒక ఆనందమూ, ఒక తృప్తీ రామత్తాల్‌కు కలుగుతూ వచ్చింది. ఆమె మనస్సులో దాగి ఉన్న మాతృ హృదయం జాలిపడి,

కలచివేసి నష్టమయిపోయింది. కన్న కడుపు జాలిలో ఆతనిని గురించి ఆక్రోశించేది. ఆమెలో అణిగి ఉన్న తల్లి ప్రేమను తట్టి తప్పినట్టయింది.

ఒకటి రెండు రోజులలో జరిగిన విషయం కాదిది. రెండు సంవత్సరాలుగా విడువకుండా సొంగప్పన్ రోజు రోజూ పని చేస్తు ఆమెతో కూడ నెమ్మ సహాయం చేస్తూ ఉంటే ఆతనిని చూచి పొంగి పొరలిన మాతృ హృదయం. జాలి పడిన తల్లి కడుపు.

రామత్తాల్ సొంగప్పను అపం తిందువుగానిరా అని పిలవడం కూడ మాని వేసింది. అలాగ పిలవడం వట్టి అనవసరం అని కూడ ఆమె అర్థం చేసుకొన్నది. రాను రాను ఆమెకు అతని మీద ఒక గారబం పెరుగుతూ వచ్చింది. సొంగప్ప — ఊరుమ్మడి వుంతలో పుట్టాడు అని ఎవరైనా అంటే, ఆ మాట జ్ఞాపకం తెచ్చుకొని డొంకలో ముళ్ళు గుచ్చుకొన్నట్టు అతని ఒళ్ళు తడిమేది. ఆతని మీద జాలి ఉట్టిపడి ఏమో అనేది.

"కుక్క పిల్లల్ని ఊరుమ్మడి డొంకలలో వదలి వేసే వాళ్ళు మనుష్యులా ? వాళ్ళు మృగాలకంటే కూడ అధములు" అని ఆమె మాటి మాటికి తిట్టి పోసేది. అది విన్న వాళ్ళు ఏమిటి యీమె యిలాగ తిట్టి పోస్తుందని ఆశ్చర్య పడుతూ ఉండే వాళ్ళు.

మునుపు అంతా రామత్తాల్ యంత్రంలాగ అన్ని పనులూ చేసుకొంటూ ఉండేది. ఆపాలు వేసుకోవడమే ఆమెకు అన్ని పనులున్నూ. అది తప్ప ఇంకేమి ఆమె వల్లకాదు. ఒక వేళ అపం వేయడం మాన్పించి వేరే పనిచేయమంటే, ఆమె జీవితమే మారి పోయి నట్టో కాని కొత్తగా ఆమె మనస్సులో ఈ జాలి కలిగింది మొదలు ఆమె చేసే పనులకు ఏదో కొత్త ప్రయోజనం కొత్త అవసరమూ కనిపించినట్లయింది. అందుచేత ఆమె జీవితంలోనే కొత్త అనురాగం అంకురించినట్టయింది.

అయితే ఆ అనురాగం ఎంతోకాలం నిలువలేదు. రామత్తాల్ ఒక రోజు రాత్రి చలి జ్వరం వచ్చి మంచం పట్టింది. మరునాడు ఉదయం అలవాటు ప్రకారం సొంగప్పన్ వచ్చి గుమ్మానికి ఎదురుగా చాల సేపు కనిపెట్టుకొని నిలబడి ఉన్నాడు. అతడు ఇంట్లో ప్రవేశించడం ఎన్నడూ లేదు.

"ఇంట్లోకిరా" అని రామత్తాల్ అతన్ని చాలసార్లు పిలిచింది.

"ఇక్కడే నిలుచుంటాను. ఇంటిలో చీకటిగా ఉంటుంది" అని సొంగప్పన్ బదులు చెప్పేవాడు.

చీకటి గది చూస్తే వాడికి భయం. ఊరు పేరు లేని తన జీవితాన్ని అలముకొన్న చీకటి వేరే గదిలో చూడటానికి భయ పడుతాడో ఏమో, ఈ భయం అతనికి మొదటి నించీ ఉంది.

సాంగప్పన్ కనిపెట్టుకొని నిలుచున్నాడు. అవ్వ మంచం మీదనుండి ఆవేళ లేవలేక పోయింది. అతడు చూచి చూచి వెళ్లి పోయాడు.

నాలుగు రోజుల వరకు రామత్తాల్ మంచం మీదనుండి లేవలేక పోయింది. ఆ మంచానికి అంటి పెట్టుకొని అలాగే ఉండి పోయింది. ప్రక్క యింటి ఆవిడ వచ్చి పాపం గంజి కాచి యిచ్చింది.

అదికూడ ఆమె త్రాగ లేక పోయింది.

ఆ నాలుగు రోజులు కూడ సాంగప్పన్ ఎప్పటిలాగ ప్రొద్దుటే వచ్చి ఆ తిన్నెకు ఎదురుగా నిలబడి వెళ్లి పోయేవాడు. ఆ అలవాటు తప్పించ లేదు. నాలుగో రోజు మాత్రం తెలిసింది. ఆమెకు ఒళ్లు బాగా లేదు జబ్బుగా పడియుండని అప్పటికి అర్థం చేసుకొన్నాడు.

అయిదవ రోజు రామత్తాల్ చీటికి మాటికి "సాంగప్పా ! సాంగప్పా !" అని పిలవడం మొదలు పెట్టింది. అతడు బయట వీధిలోకి వచ్చి తిన్నె మీద నిలుచున్నాడని తెలిసి ఎలాగో కష్టం మీద మంచం దిగి మెల్లగా నడుచుకొంటూ వచ్చి బయటికి రాబోయింది. గంజి నీళ్లుకూడ తాగకుండా నాలుగు రోజులు కటికి లంకణం చేసిన కారణం చేత ఆమె కాళ్లు తళ్లాడి పోతున్నవి. తల తిరిగి పోతున్నది. ఆమె అలాగే మైకం గ్రమ్మి, ఆ గుమ్మంలో కూల బడి పోయింది.

సాంగప్పన్ ఆమెను ఎత్తుకొని తీసుకొని పోయి లోపల మంచం మీద పడుకో బెట్టాడు. వెచ్చగా జ్వరం పడి ఉన్న ఆమె శరీరం జబ్బుస్థితి చూస్తే అతనికేదో జాలి కొల్పినట్టయింది. చెప్పరాని అనురాగం ఏదో బయలు దేరింది. తాను ఆమెను ఎత్తి తీసుకొని వెళ్లినట్టు అతనికి తోచలేదు. తాను ఎనిమిది మాసాల చంటి పాపగా ఉంటే ఆమె యెత్తుకొని తీసుకొని వెళ్లినట్టు వాని మందబుద్ధికి తోచింది.

ఆవేళ అతడు రామత్తాల్ ఇల్లు విడువ లేదు. పెద్ద కాపుగారింటి మాట మరచి పోయాడు. తన కడుపు ఆకలి మాట కూడ మరచి పోయాడు. ఇంక ఆకలి దప్పులు లేవు. అలాగే ఉండి పోయాడు.

రామత్తాల్ కన్ను దెరచి చూచేటప్పటికి, అతడు ఆమె కాళ్ల వైపు కూచుని ఉన్నాడు.

సాంగప్పా ! చూడు, ఆ అటక మీద బియ్యం ఉన్నాయి. అందులో ఒక పడి బియ్యం తీసి నీళ్లల్లో నాన వేసి ఉంచు" అని మెల్లగా చెప్పింది రామత్తాల్.

మరునాడు గంప ఎత్తుకొని సంత పేటకు బయల్దేర వచ్చుననే ఉద్దేశంతో అలాగే బియ్యం తీసి నీళ్లల్లో నాన వేశాడు. సాయంకాలం ఆ బియ్యం రుబ్బు రోలులో పోసి, రామత్తాల్ చెప్పినట్టు మెత్తగా రుబ్బాడు. బియ్యపు పిండి ఏలాగ రుబ్బాలో దాని పక్వం ఎలాగ ఉండాలో రామత్తాల్ ప్రత్యేకంగా చూసి, చెప్పింది. నాలుగైదు

సొర్ను రుబ్బు రోలు వద్దనుంచి పిండి తెమ్మని చెప్పి, వ్రేలుతో పట్టి చూచి దాని పద్ధతి గమనిస్తూ వచ్చింది.

మరునాడు ఉదయం అయిదు గంటలకే సొంగప్పను ఆమె నిద్రనుండి లేప గొట్టింది.

"ఆ పొయ్యి, పెనమూ పిండి రుబ్బిన "దాకా" ఇలా మంచం దగ్గరికి తీసుకురా నే నక్కడ వరకు లేచి రాలేను," అని రామత్తాల్ అతనితో చెప్పి అవన్నీ తెప్పించింది.

సొంగప్పన్ మంచానికి ప్రక్కనే పొయ్యి రాజేసి నిప్పు ముట్టించాడు. ఆమె చెప్పిన ప్రకారం అటు తిరిగి యిటు తిరిగి అది తీసి యిది తెచ్చి చిన్న పిల్లవాడులాగ అన్నీ చేశాడు.

"నేనే ఆపం చుట్టి పొయ్యనా ?" అని అడిగాడు.

"వద్దు నాయనా ! సొంగప్పా ! ఈవేళ ఒక రోజయినా నా చేతితో వేసిన ఆపం నీవు తిని తీరాలి. అదొక్కటే నాకు మిగిలిన కోరిక. నీవు నా చేతితో వేసిన ఆపం తినాలి," అని ఆ ముసలి అవ్వ వణకుతూ చిన్న గొంతుకతో అడిగింది.

"సరేలే అమ్మా," అని సొంగప్ప అన్నాడు.

తలవని తలంపుగా "అమ్మా" అని వాని నోటి వెంట వచ్చిన మాట ఆ యిద్దరినీ ఆనంద సముద్రంలో ముంచి వేసినట్టయింది.

సొంగప్పన్ ఆమె వేసిన ఆపం తింటూ ఉంటే, అతని కడుపు నిండి పోవడం చూచి రామత్తాల్ తన కడుపు నిండినట్టే భావించింది. వాడు తింటూ ఉంటే, ఒళ్ళూ, తల నిమురుతూ తనచేతులతో తడుముతూ కూర్చున్నది. తినడం పూర్తి అయిన వెంటనే సొంగప్పను తన మంచంమీద తన ప్రక్కగా కూచో మన్నది. అతడు ఆమె చెప్పిన ప్రకారం అలాగే కూచున్నాడు.

"సొంగప్పా ! అదుగో ఆ మూల ఒక పెద్ద వడ్ల పురి ఉన్నది చూచావా ? దాని క్రిందనే ఒక పాతు ఉన్నది. ఆ పాతులో రెండు వేళ రూపాయలు పాతి పెట్టి ఉంచాను. నీ వా సొమ్ము తీసుకో. అది నీవెవ్వరికీ ఇయ్య వద్దు," అన్నది రామత్తాల్.

"రెండు వేల రూపాయలా ? " అని సొంగప్పన్ తిరిగి అడిగాడు. అతని బుద్ధికి అదేమి బోధ పడలేదు.

"అవును. ఈ నలభై సంవత్సరాలనుండి ఆ పాలు వేసి అమ్మి సంపాదించిన సొమ్ము. ఇదంతా నీదే. అది తీసుకొని నీవు పెళ్లి చేసుకొని పెళ్లాన్ని తెచ్చుకొని బిడ్డలతో పది కాలాల పాటు హాయిగా బతుకు," అన్నది.

సొంగప్పకు విషయం పూర్తిగా బోధ పడలేదు. అయినప్పటికీ ఆ ముసలమ్మ తవను గురించి ఏమేమో చెప్తున్నదని మాత్రం గ్రహించ గలిగాడు.

"అమ్మా ! నాకు ఇప్పుడు ఎందుకు ఆపం చుట్టి పోశావు ?" అని ఆమెను చంటి పిల్లవాడులాగ అడిగాడు సొంగప్పన్.

"నా చేతులతో ఒక్కసారి అయినా నీకు భోజనం పెట్టక పోతే నాకు మోక్షం కలుగుతుందా ? నీవేకదా నాకు మోక్షం ఇప్పించడానికి వచ్చావు. నీవే నాకు మోక్షం ఇప్పించాలి," అని ఆమె ఎంతో జాలిగా అడిగింది.ఆమె ముఖంలో ఎక్కడా లేని ఆనందం తాండవిస్తున్నది. సొంగప్పన్ ఆమె ముఖం కేసి ఆశ్చర్యంతో చూస్తూనే ఉన్నాడు. రామత్తాల్ అలాగే కన్ను మూసి వేసింది. ఆమె ముఖంలో ఒక సంతృప్తి, ఒక ఆనందమూ గోచరిస్తున్నని.

ఆమె తిరిగి లేవనే లేదు. సొంగప్పకు ఆవేళ తెలిసింది దుఃఖమంటే యెలాగ ఉంటుందో. ఊరుమ్మడి పుంతలో వదలి వేసిన పిల్లి పిల్లలు తల్లీ తండ్రీ లేకుండా దిక్కు లేక అమ్మా అమ్మా అని ఆక్రోశించినట్టు అమ్మా అమ్మా అని అరిచాడు

రామత్తాల్ మరణించిన తర్వాత సొంగప్ప ఆ యింట్లో ఎంతో కాలముండ లేదు. ఆమె పోయిన ఒక వారం వరకు మాత్రం ఆ యింట్లో ఉన్నాడు. దాని తర్వాత రామత్తాల్ చాల ధనం కూడ బెట్టి వాని కిచ్చి వేసినట్టు ఊరంతా యెలాగో తెలిసింది.

అతని వద్ద చాల డబ్బున్నదని అందరూ చెప్పుకొంటున్నారు.కొందరు నిజంగా అతనికి తమ పిల్ల నిచ్చి పెళ్లి చేద్దామని ముందుకు వస్తున్నారు. "సొంగప్పా నీవు మా అమ్మాయిని పెళ్లి చేసుకో ! నీవు ఒంటరిగా ఉందామన్నా కూడ నీకు ఇంత గంజికాచి పోసేవారుండ వద్దా ?" అని అడుగుతున్నారు.

సొంగప్పకు తన్ను గూర్చి చింతే లేదు. పల్లెటూళ్లల్లో ఎవరైనా చచ్చి పోతే ఆ యింట్లో కొద్ది రోజులవరకు లసలు వంటే చెయ్యరు. ఆ యిరుగు పొరుగు వాళ్లు వంట చేసి యింత అన్నం తయారు చేసి పెట్టారు. ఆ మాదిరిగా ఎవరైనా అన్నం తెచ్చి పెట్టితే ఒకప్పుడు ఉండి తింటాడు. ఒకప్పుడు ఏదో ఆలోచిస్తూ ఉంటాడు. చని పోయిన రామత్తాల్‌కు పుణ్యం సంపాదించి పెట్టాలని అతని కోరిక. ఆ కోరికతో ఎప్పుడూ ఆలోచన చేస్తూ ఉంటాడు.

మోక్షం ఎలాగ కలుగుతుంది అని చాల మందిని అడిగి చూచాడు. దానికి సమాధానం చెప్పడానికి ఎవరికీ తెలియలేదు. ఒక రెవరో యిలాగన్నారు. "మోక్షం ఎలాగ వస్తుంది ? ఆ స్వామి యిస్తే వస్తుంది. ఆ పరమేశ్వరుడు మనస్సు కలిగితే మోక్షమిస్తాడు." అతనిని తిరిగి తిరిగి ఏమేమో అడిగాడు సొంగప్ప. అంతకు మించి ఏం చెప్పాలో అతనికీ తెలియలేదు.

అయితే సొంగప్పన్‌కు అంత వరకు తెలియని ఒక ఉపాయం తోచింది. రామత్తాల్ చని పోయిన ఏడవ రోజు సంత పేటకు ఎదురుగా ఉన్న ఒక దేవాలయానికి వెళ్లాడు.

ఆ గుడి అర్చకుడి వద్దకు పోయి "డబ్బు ఇస్తే స్వామి మోక్ష మిస్తారా ?". అని అడిగాడు.

"దేవాలయానికి ధర్మం చేస్తే పుణ్యం కలుగుతుంది," అన్నాడు అర్చకుడు.

"మోక్షం కలుగుతుందా చెప్పండి ?"అని ఆ ప్రశ్నే త్రిప్పి అడిగాడు సొంగప్పన్.

సొంగప్పన్ గురించి ఇది వరకే అర్చకుడు అన్ని సంగతులూ విని యున్నాడు. అతనంటే అర్చకుడికి ఒక విధమైన అనుతాపం కలిగింది. మెల్లగా అతనిని దగ్గరకు తీసి ఎన్నో ప్రశ్నలు వేసి, అతని కోరిక యేదో జాగ్రత్తగా అడిగి తెలుసుకొన్నాడు.

"సొంగప్పా ! ఈ శివాలయంలో అమ్మవారి సన్నిధిలో "తిరుప్పణి" (అర్చన) చేయవలసి యున్నది. దాని కోసమే అదిగో చూడు అక్కడ హుండీ పెట్టి ఉంచారు. అందులో డబ్బు వేస్తే మోక్షం కలుగుతుంది," అని అర్చకుడు చెప్పాడు.

"మోక్షం ఎవరికి కలుగుతుంది ? సొమ్ము సంపాదించి పెట్టిన వాళ్లకో ? నాకా ?" అని సొంగప్పన్ తిరిగి ప్రశ్న వేశాడు.

"కష్ట పడి సంపాదించి పెట్టిన వాళ్లకీ పుణ్యం కలుగుతుంది, నీకు కూడ పుణ్యం కలుగుతుంది," అని అర్చకుడన్నాడు.

"నాకు అక్కర లేదు. పుణ్యమంతా అమ్మకే ఆ స్వామి నిమ్మనండి," అని చెప్పి అతడు వేగంగా ఇంటి వైపు పరుగెత్తుకొని వెళ్లాడు. తనకోసం రామత్తాల్ ఇచ్చిన రెండు వేల రూపాయలూ ఆ దేవాలయంలో పెట్టిన హుండీలో వేసి యింటి వైపు తిరిగి వెళ్లి పోయాడు.

ఆ రాత్రి పన్నెండు గంటలకు ఎన్నడూ జరుగని విషయం ఒకటి జరిగింది. ఎవరో నలుగురు దొంగలు సొంగప్పన్ ఉన్న యింటికి వచ్చారు. ఇంట్లో ప్రవేశించి ఇల్లంతా శోధన చేశారు.

"డబ్బు ఎక్కడ దాచావు ?" అని అదరించి అడిగారు.

"డబ్బంతా స్వామి వారికి కైంకర్యం అయి పోయింది," అన్నాడు సొంగప్పన్.

"అడే ! అబద్ధం చెప్తున్నావా ? మాటాడకుండా సొమ్మెక్కడ దాచావూ తెచ్చి వప్పగించు. లేకపోతే చూచుకో !" అని చెయ్యెత్తి కొట్ట బోయారు.

"రామత్తాల్‌కు మోక్షం ఇప్పించాలి కదా ? అందుకు ఇచ్చి వేశాను. నాకు డబ్బు ఎందుకు ?" అని అదే మాట అతను తిరిగి తిరిగి చెప్తున్నాడు.

ఆ దొంగలకు కోపం అంతకంతకు ఎక్కువై పోయింది. అతనిని ఆ స్తంభానికి కట్టి వేసి కొట్టి కొట్టి చావ మోది వెళ్లి పోయారు.

మరునాడు కొన ప్రాణంతో ఉన్న సొంగప్పను ఊరివాళ్లు చూచారు. కట్లు విప్పారు. వీపు మీద పెద్ద చారలుగా తట్లు తేరాయి. ఊరి పెద్ద కాపు, సొంగప్పను తీసుకెళ్లి తగినచికిత్స చేయించాడు. అతనికి తగినపరిచర్యలు చేయించి కాపాడ టానికి ముందుకు వచ్చాడు.

సొంగప్పన్‌కి గుణమిచ్చింది. లేవాడు. అయితే అతడు ముసలివాడిలాగా నడవ లేక పోతున్నాడు. ఎముక విరిగిందో ఏమిటో పాపం గూని అయి పోయాడు. ఆడుతూ పాడుతూ పనిచేసే శక్తికూడ పోయింది. అయితే అలాగయినందుకు అతడు విచారం పొందినట్లు కనిపించడు. అతనిలో ఏదో కొత్త మార్పు వచ్చినట్లయింది. ఆతని జీవితంలో అన్ని కార్యాలూ పూర్తి అయిపోయినట్లు కనిపిస్తున్నాడు. మానవాతీతమైన ఒక తేజస్సు అతనిలో కూడి వచ్చినట్లుంది. సాయం సంధ్యా వేళ ఆలయంలో అమ్మ వారి అర్చన జరుగుతూ ఉంటే, ఆలయం గంటలు మ్రోగుతూ ఉంటే అతని కన్ను లలో ఒక జ్యోతి మెరుస్తూ ఉంటుంది.

అది చూచి అందరూ ఆశ్చర్య పడి పోతారు. అసలు జరిగిన విషయ మేమిటో కొంచెం కొంచెంగా అతని వల్లనే తెలుసుకున్నారు. సాయం సంధ్యవేళ అతని కన్నులలో ఆ వెలుగు చూడటానికి చాల మంది జనం ఆతనిలో మాటలాడాలని వస్తారు.

# 8. మిలిటరీ వాడు

—తకజి

[ఉత్తమ శ్రేణికి చెందిన అభ్యుదయ సాహిత్యకారులలో "తకజి", ఒకడు. ఆయన నవలలకూ — కథలకూ — సామాజిక — రాజకీయ పరివర్తనములే అంగ బలము. ఆ రచన అలా నడుస్తూంటుంది. 'తోట్టియుు డె మగన్' 'చెమ్మీన్' మొదలైన అతని నవలలు మళయాళ సాహిత్యానికి గర్వకారణాలు. తిరుకొచ్చిన్ లోని 'అంబలప్పుజ' పట్టణం ఆయన నివాస స్థలం. అక్కడి మేజిస్ట్రేటు కోర్టులో — ఒక వకీలుగా — మన కాయన కనపడుతూంటాడు.]

పోలీసు స్టేషన్‌లో యేదోపెద్ద గుంపు. దాన్ని చూచి — తానుగూడా అక్కడికి వరుగెత్తాడు. అధికారులు — గుంపులో చేరిన వారి ఒడ్డూ — పొడవూ — మొదలైన వివరాలు నమోదు చేసుకొన్నారు. ఒక్కొక్కని వూరు — పేరూ వ్రాసుకొన్నారు. అటు తర్వాత చెప్పడానికేముంది గనుక ? ఆ నాడు సుమారు 180 మంది పేర్లు నమోదు అయినాయి. వారిలో వాని పేరుగూడా వుంది.

ఆనాడే వాళ్లను ప్రయాణం చేశారు. ఆ ప్రయాణం చాలా వుత్సాహకరంగా వుంది. ముప్పూటా మంచి తిండి. సొంత ఖర్చుకు అధికారులిచ్చిన కొంత డబ్బు— తోడి ప్రయాణికులూ మంచివారు. ఇంకేం కావాలి ?

రైలు క్రొత్త క్రొత్త ప్రదేశాలను చెంగు చెంగున దాటుకుంటూ వెళ్లి పోయింది. వాడెన్నో పెద్ద పెద్ద నగరాలన్ని చూచాడు. ఎనిమిది దినాల తరువాత వారిని అధికారులు ఒక చోట దింపేశారు.

ట్రైనింగు కాలం కొంచెం కష్టంగానే వుండేది. కాని — ముప్పూటా మంచి తిండి దొరుకుతుందనే మనశ్శాంతి సామాన్యమైందా ? జీవితం కొద్ది కొద్దిగా విశాల మౌతూంది. క్రొత్త క్రొత్త అనుభవాలు హృదయంలో సుడులు రేపి దాన్ని ఆలోచనా పూర్ణంగా చేస్తున్నాయి. తాను బిచ్చగాడననే భావం క్రమంగా మరుగు పడ జొచ్చింది. ఇప్పుడు — సరిగా కాళ్ళు జాచి పండుకుంటేనే నిద్రవస్తుంది. తలక్రిందికేదో యెత్తుగావాలి. నాల్కకు — రుచి తెలుసుననే విషయం — అనుభవానికి వచ్చింది.

"ఏం చేయడం ?" అనే ప్రశ్న కొంచెంగా చదువు నేర్పించింది. చదువుతో బాటు — మెల్ల మెల్లగా పగటి కలలు — తొంగిచూచాయి. ఆ జీవితంలో కొన్ని కష్టాలూ — కొన్ని సౌకర్యాలూ — గూడా వున్నాయి.

ఇంతలో ఆ సైన్యాన్నక్కడినించీ — రెండు వేల మైళ్ళ దూరానికి మార్చారు. అక్కణ్ణించీ — మరో చోటికి. మూడవ చోటికి. అక్కడ కొద్ది రోజులు గడిచాయి. ఇప్పుడు వానికి హిందూస్తానీ వచ్చు. భారత దేశంలోని అన్ని ప్రధాన నగరాలూ చూచాడు. బ్రతకడానికి కొద్దిగా చదువు వచ్చింది. చేతిలో నాలుగ్గాసులూడు రున్నాయి. ఇంకా కొంత సర్కారునుంచి రావలసిందికూడా వుంది.

ఒకనాడు అవసరమున్నవారు ఒక నెల సెలవు తీసుకొని తమ యిండ్లకు పోయి — బంధువులు మొదలైన వారిని చూచి రావచ్చునని పై యధికారి చెప్పేడు. పోవాలను కున్న వాళ్ళు వెంటనే దరఖాస్తు పెట్టాలి. ఈ మాట విన్నలోపే — ఆ సైనికుల్లో — ముందెన్నడూ లేని క్రొత్త ఉత్సాహం నాట్యమాడింది. ఆ ఉత్సాహం ఇంతా— అంతా అని చెప్పడానికే వీల్లేదు. అందులో వాడూ భాగం పంచుకున్నాడు. కాని వాని ఉత్సాహంలో యేదో కొరత మాత్రం అస్పష్టంగా కనిపిస్తోంది. ఆ కొరతకు కారణ మైన ఒక మనోవేదన వాని హృదయంలో అణగి వుండాలి.

అందరితో పాటు వాడుగూడా ఫారం పూర్తిచేసి యిచ్చాడు.

ఆ రాత్రి తిండి తిన్న తర్వాత సైనికులు — నలుగురైదుగు రొక్కొక్క చోట చేరి — యేదో సంగతి—సందర్భాలు మాట్లాడు కుంటూవున్నారు. ఒక మైసూరు వాడు — తిరుసల్వేరి వానితో యిలా అన్నాడు.

"మన మిద్దరం కలిసి పోదాం."

"కాని — నేను రేపు తెల్లారే వెళ్ళి పోవాలి"

"నేనూ అలాగే నిశ్చయించుకున్నాను. అబ్బ ! నా ఉత్సాహం చూచి యెన్నా ళ్ళయింది ?"

ఆ మైసూరు వాడు కొంచెంసేపేదో తలపోసుకుంటూవున్నాడు. తన విశ్వ మంత శ్చస్నమైన కెమురుగా నిలిచి పలుకరించినట్లు వాని ముఖం ప్రకాశించింది.

తిరునల్వేలివాడన్నాడు. "నా ముసలి తల్లి — . . . . . ఆమెకు తెలియకుండానే నేను వచ్చేశాను. మా అమ్మకు నేనొక్కడనే కొడుకును."

వానికి తలపోసుకోవడానికెన్నో విషయాలు ! తనలో తానే గొణుగుకుంటున్నట్లు ఇలా అన్నాడు :

"పాపం ! ఆ పాడు గుడిసెలో నాకోసం మా అమ్మ ఎదురు చూసి చూసి విసిగిపోయి వుంటుంది."

ఫాలఘాటు వాడప్పుడు రామన్నాయరు నడిగేడు. "మీ రెప్పుడు వెళ్తారు ? మన మిద్దరం కలసి వెల్దామా ?

"వోహో !" అన్నాడు రామన్నాయరు. ఆ జవాబు యాంత్రికంగా యిచ్చిందే గాని — మనస్సుతో భావించి యిచ్చినట్లు లేదు.

మద్రాసువాడొక ప్రశ్న వేశాడు. ఆ ప్రశ్న వేయడంలో — ఈ విషయం అందరికీ సంబంధించింది అనే 'హుందా' తనంనాని ముఖంలో కనిపిస్తావుంది.

"ముప్పయి రోజులకు పైన గూడ నిలువ ఉండడాని కేమైనా అవకాశ ముంటుందా?"

పాలఘాటు వాడన్నాడు "అనారోగ్యంగా వుందని తంతి నిచ్చారి. నేనుగూడ అదే ఆలోచనలో వున్నాను. ఇంటికి పోతే వెయ్యి పనులు విచారించ వలసినవి కాచుకొని వున్నాయి."

వేరొకడు అన్నాడు : "ఆ యెత్తు గడ సాగుతుందనే ధైర్యం నాకు లేదు. అసలు — యీ సెలవు ఎందుకిచ్చారో మీకు తెలుసా ? సొంత యిండ్లను చూచి రావాలి. బంధువుల్ని చూడడంగూడా తొందరగా ముగించుకొని రావాలి. ఇక మీద పుణ్యా ముంటేనే — మళ్లీ — తల్లీ — బిడ్డలూ — మొదలైన వారిని చూడడం. ఈ సెలవులు గడిచాక మనల్ని యుద్ధరంగానికి పంప బోతున్నారు."

ఎవ్వరూ కొంతసేపు మాటాడ లేదు. పై మాటతో క్షణకాలం వారి ముఖాలు పారి పోయాయి. ఒక దీర్ఘ నిశ్వాసంలో మైసూరు వాడన్నాడు. "నావిడ్డకి వెయ్యి రూపాయలు లభిస్తాయి. వో ! అదివాలు.

తిరునల్వేలి వాడారంభించాడు. "వేయి రూపాయలు ముట్టితే నా ముసలి తల్లి కింకేమీ భయముండదు. ఆ డబ్బుసు చూచి అయినా అంత్య కాలంలో ఆమెకెవ రైనా చాకిరి చేస్తారు."

దీర్ఘ నిశ్వాసంలో కలుషితమైన ఆ రాత్రి వారిలో యెవ్వరికీ తొందరగా నిద్ర పట్టలేదు. తమ పనులన్నీ ఆ ముప్పయి దినాలలో ముగించుకొని తిరిగి రావాలి.

రామన్నాయరు గూడా సెలవుదినాలెలాగడపాలో వూహించుకుంటున్నారు. కాని వానికి చేయ వలసిన పని యేమీ తోచలేదు. అందువల్ల వానికి సథక మేదీ కుదిరింది గాదు. వాని కళ్ళ యెదుట ముప్పయిరోజులు — దీర్ఘ శరీరాంతో నిలబడి ఉన్నాయి.

దగ్గరగా పడుకున్న పాలఘాటు వాడు రామన్నాయరునిలా అడిగేడు.

"రామన్నాయరు కింట్లో యెవరున్నారు ?"

"ఎవరూ లేరు."

"అయితే సెలవుల్లో యెక్కడికెళ్తావు ?"

ఈ ప్రశ్నకు వాని దగ్గర జవాబు లేదు. పాలఘాటు వాడు మళ్లీ అడిగేడు. "సొంత వూరు తిరువనంతపురం గదూ ?"

రామన్నాయరు తికమకపడ్డాడు. వానికి వాని దగ్గిర జవాబు లేదు.

"నా పేరు తిరువనంత పురంలో నమోదు చేసుకున్నారు."

"అయితే మీ వూరేది ?"

"నేను రాను. నాకు సెలవక్కర లేదు." యేదో హఠాత్తుగా మనసుకు దెబ్బ తగిలిన వాని వలె రామన్నాయరన్నాడు.

"ఎందుకలా కోప్పడతావు ? నీ వెంటనో కోపగించి వచ్చివుంటే — వుండవచ్చు. కాని — నీ కోపం తెప్పించే పని నేనేం చేశాను?" రెండవవాడూ కొంచెం వేడిగానే అన్నాడు. అంతలో వారి సంభాషణ ఆగింది. ఆ రాత్రి మూడవ యామం గడచే సమయంలో గూడా — ఆ గుంపులో నిద్ర లేకుండా ఒక్క మనిషి ఉన్నాడు — ఆలోచిస్తున్నాడు. "రామన్ ! యీ పేరు నాకెవరు పెట్టేరు ? ఆ పేరు నా మనస్సులో గందరగోళం రేపుతూంది. "నాయర్" అనే పదం గూడా దానికెలా ప్రాప్తించింది ? చిన్నప్పుడు దారెంట — అన్న మనుష్యులు యీ పిడుస్తున్నప్పుడు — తప్పనిసరిగా యీ పేరుతో పిలువలేదు. జీవితంలో — యీ పేరెలా — యెక్కడ ఆరంభమౌతుంది ?

"నేను రాను. నాకు సెలవక్కర లేదు."

ఈ మాటలు — ఒక పెద్ద శాపం వలె వాని చెవిలో గింగురు మంటున్నాయి. ఈ తీర్మానం నిర్వివాదమనే — చెప్పాలి. కేరళ దేశంలో — యెక్కడో — ఆ దురదృష్టం చెడిన స్త్రీ వుండి వుంటుంది. అమ్మ !! కాకుంటే — తనకు జన్మ యిచ్చిన పురుషుడు తండ్రి!! ఈ రెండూ కాకున్నా — తాను పడుకున్న కడుపులో — వుండి తనకు ముందో — వెనకాలో పుట్టిన — ఒక వ్యక్తి అయినా వుంటుంది. తన్ను గురించి — ఆలోచించుకునే వారెవ్వరూ లేరనటం అసంభవం. కాని — వెదకాలి. వెతికితే దొరుకుతారు.

వాడు చాలా దేశాలు చూచాడు. అనేక జాతుల వారితో కలిసి తిరిగేడు. పలు భాషలు మాట్లాడాడు. కాని కేరళ దేశంలో బిక్షం యెత్తికొని జీవించినా నష్టం లేదు. అక్కడి జల పానంలో గూడా ఒక ప్రత్యేకత వుంది. ఆ దేశంలోని మధ్యాహ్నపు యెండ గూడా తన సంతానాన్నెంతో దయతో చూస్తుంది. కేరళీయుల నవ్వులోనే — ఒక మనోహరత్వం వుంది. ఆ భాషలోనే స్నేహాన్ని ఆవిష్కరించే ఒక మహా శక్తి వుంది.

పుట్టిన దేశం — స్వదేశం. కన్న తల్లివలె యెలుగెత్తి వాణ్ణి పిలిచింది. కేరళంలో సుఖ శీతలములైన టెంకాయ చెట్ల నీడల్లో హాయిగా పడుకొని నిద్ర పోవాలి. పచ్చని ఆ పొలాల గట్ల వెంట తృప్తిగా తిరగాలి. ఆ కేరళ దేశంలో ఒక పిడుచ అన్నం సంపాదించి తినాలి.

తెల్లారింది. అందరికంటే ముందే వాడు నిద్ర లేచాడు. తోటి వారింకా నిద్దిస్తూండగనే — రామన్నాయరు ప్రయాణానికి సిద్ధమైనాడు.. "అదృష్టం"

పట్టణంలో — రోడ్డులలో — వీధులలో ఒక మిల్టరీ వాడు మూడు నాల్గు రోజుల నుండీ నిర్విరామంగా తిరుగుతూండడమందరూ చూచారు. తిరిగిన రోడ్డులోనే నాల్గు సార్లు తిరిగాడు. చుట్టిన వీధినే మరి మరీ చుట్టేడు. రాత్రిళ్ళు గూడా ఆ మనిషి తిరుగుతూనే వున్నాడు. ఒక రాత్రి — పడవల గుంపుల దగ్గర నిలుచున్న కానిస్టేబులుతో వృద్ధుడైన ఒక సరకులు మోసే మహమ్మదీయ కూలీ మాత్రం వాణ్ణి గురించి యేదో చెబుతూన్నట్లుగా వుంది. వాని నివాసమేది అని కాని యే వూరి వాడని కాని — సరిగా చెప్పేవారెవ్వరూ లేక పోయారు.

ఒక దినం వాడు కనపడలేదు. మరుసటి రోజు రాత్రి 'కొల్లం' లోని — ఆనంద వల్లీశ్వరాలయం దగ్గిర — ఉన్న ఒక యింటి వసారాలో — వాడు నిలుచున్నాడు. వాని చేతిలో ఒక యినుప పెట్టె బరువుగా వ్రేలాడుతూ వుంది. వానితో పాటే అంత వరకూ నడచి వెళ్ళిన ఒక పిల్లవాడు' 'ఆ యింట్లో యెవ్వరూ కాపురం ఉండటం లేదని' చెప్పేడు. అప్పుడే — ఆలయంలో నమస్కార ప్రదక్షిణాలు చేసికొని వస్తూన్న ఒక మర్యాదస్థుని వెంట రామన్ నడిచాడు. కొంత దూరం వెళ్ళాక — ఆ పెద్ద మనిషి ఒక మలుపు తిరిగేడు.

నా పేరు రామన్‌నాయరు."

ఈ శబ్దం విని ఆ పెద్ద మనిషి తిరిగి చూచేడు. చేతిలో యినుప పెట్టెను పట్టుకొని రామన్‌నాయరు ఒక శిలాప్రతిమ వలె నిలుచున్నాడు.

"రామన్నాయరా ! ఎవరు ?" ఆ పెద్ద మనిషి అడిగేడు.

ప్రత్యుత్తరం చెప్పడానికేమీ మార్గం లేక రామన్నాయరు కొంతసేపల్లాగే నిలిచి — ముందుకు కదిలేడు.

నడచి వెళుతూండే వాని నలానే చూస్తూ ఆ పెద్ద మనిషి కొంత సేపు నిలబడ్డాడు.

రామన్నాయరు కన పడేంతవరకూ — ఆతడల్లానే చూస్తున్నాడు. "రామ న్నాయర్" ఎంతసేపాలోచించినా ఆ పెద్ద మనిషికి జ్ఞాపకమే రాలేదు.

ఒకానొక చిన్న హోటలు. దాని వాకిలిపై "రామన్" అనే పేరు బొగ్గుతో వ్రాసి వుంది. మిల్టరీ వాడు హోటలు యజమానితో అన్నాడు. "దాన్ని వ్రాసింది నేనే !"

హోటలు యజమాని యేమీ పలుక లేదు.

తన పెద్దన్నను వెతుక్కుంటూ రామన్ నాయరు తిరువనంత పురానికి వెళ్లేడు. కాని అక్కడా యెవ్వరూ అగుపించనే లేదు.

ఇలా పదిహేను రోజులు గడిచాయి. పరిచితమైన ఒక మందహాసమైనా వానికెక్కడా ఎదురు గాలేదు. "ఎప్పుడొచ్చావు ?" అనే సాదర ప్రశ్న కోసం వాడు

కేరళంలోని అన్ని పట్టణాలు వెతికేడు. తియ్యనైన ఆ మాట — యెక్కడా — వినిపించనే లేదు. ఐదు — ఆరు ఏడు దినాలు మెల్లిగా సాగాయి. ఎవరికి ఒడితే వారికి తన వృత్తాంతం వినిపించాడు. చాలా మందిని 'అన్నా' అని ఆశతో పిలిచేడు. కనపడ్డ వారి వైపంతా ప్రత్యుత్తరం కోసం ఆశిస్తూ — చిరు నవ్వు నవ్వేడు. కాని యెంత పరిశ్రమించినా — వాణ్ణి జ్ఞాపకం చేసి కొన్న వ్యక్తే లేడు. 'కోటికోడు' మొదలుకొని 'నాగర్ కోయిల్' వరకూ శరవేగంగా తిరిగేడు. ఇలా యిరవై యెనిమిది రోజులు గడిచాయి. ఇక మిగిలినవి రెండు రోజులు మాత్రమే . ఇప్పుడు గూడా — తన స్వంత ఖర్చుతోటే భోజనం చెయ్యవలసి వస్తుంది. తన్ను ఆదరించి పిలిచి అన్నం పెట్టేవాడెవ్వడూ కనపడలేదు. మరైతే తనకీ పేరెలా కలిగింది ?

## రెండవ భాగం

పిచ్చెత్తిన నగరాలకు — చాల దూరంలో నున్న — ఒకానొక గ్రామం. ఆ జనులు అమాయకులు. ఆ జీవితాలు మార్పులేనివి. చుట్టూ — ఆనందకరమైన పరి పొలాలు. సమీపంలో ఒక చిన్న గుట్ట. ఆ ప్రదేశాన ఒక యిల్లు. అందులో— రామన్నాయరు దీపపు సెమ్మె వెలుగులో సంతోషంగా — అన్నం తింటున్నాడు. ఆ ఆనందంలో ప్రొద్దెంత గడిచిందీ వానికి తెలియటం లేదు. ఒకానొక ముసలి అవ్వ — అన్నమూ — కూరా — వడ్డిస్తూ వుంది. మనస్సుకు శాంతి కలిగేట్టు పలుకరిస్తూంది.

వాడామె 'నమ్మా' అని పిలిచాడు. "అమ్మ !! " ఆ పేరు ఎంత మధురంగా వుంది ! ఆమె వానిని "నాయనా"! అంటుంది. వారిర్వురూ యింటి విషయాలను గురించి మాట్లాడుకుంటున్నారు. ఆ తల్లి అన్నది "నాయనా ! ఆరు మంది జీవించాలి, అన్నం తినాలి కదా ! బట్ట కావాలి గదా ! తలకు నూనె కావాలి. ఇన్ని జరగడాని కాస్తి యేముంది. గనుక అదిగో ! చుట్టూ వున్న యీనేల ఆధారం. గడచిన సంవత్సరం ఒక ఐదు కండిగలు మాత్రమే ! గడ్డ ధాన్యం పండింది. ఇదో ! కొంచెం మజ్జిగపులుసు వేసుకో ! తరువాత మజ్జిగ వేసుకొందువుగాని," అంటూ ఆ అవ్వ పులుసు వడ్డించింది.

"అన్నమింక చాలమ్మా ! ఈ దినం ఎక్కితొక్కిళ్ళుగా తిన్నాను. ఒక సేరు బియ్యము అన్నం తిని వుంటాను గదా !"

"ఉస్ ! ఇంతేనా ! సేరేమిటి ? నాలుగు సేర్ల అన్నం తినాలి."

ఆ అవ్వ మళ్లీ యేదో చెప్పకు పోతూంది. రామన్నాయరడిగాడు. "అయితే యిప్పుడమ్మకు మగ సంతానం లేదన్న మాట."

ఆవిడ — దీర్ఘంగా నిట్టూర్చి అన్నది. "ఒక శిశువును దైవమిచ్చాడు. వెంటనే తీసుకు వెళ్లాడు. వాడు బ్రతికి వుంటే యీ పాటికిరువది మూడేండ్ల వాడై వుండేవాడు. ఇప్పుడుండే "వాణి" వానికంటే రెండేండ్లు పెద్దంది.

ఆ అవ్వ మళ్లీ కొంచెమన్నం వడ్డింప బోయింది. వద్దని రామన్నాయరు చెయ్యి పట్టుకున్నాడు.

"ఈ చెయ్యి వదులు."

"ఇక చాలమ్మా ! ఊపిరాడటం లేదు."

మిస్త్రీ వాని బ్రతుకులో యిల్లాంటి భోజనానికిదే మొదటి సారి. గడచిన జీవితంలో యింతవరకూ ఎవరేగాని "ఏమి నాయనా ! ఇంత కొంచెమే తిన్నావు ?" అని ప్రశ్నించిన వారే లేరు.

ఆ రాత్రి—ఆ చిన్న యింటి వసారాలో రామన్నాయరు యేదో ఆలోచింపుకుంటూ — అటూ — ఇటూ తిరుగుతున్నాడు. ఈ నాడు చేసిన భోజనంవల్ల వాని కాయింటితో యేదో అనిర్వచనీయమైన గాఢ్హమైన బంధం పెన వేసికొని పోయింది. వాని హృదయానికి శాంతి చిక్కినట్లయింది. ఆలోచించడానికి విషయాలు దొరికాయి. వాని కొక "అమ్మ" లభించింది.

'అమ్మ ! అమ్మ !' ఇదిగో నాయనా ! ఇంకొంచెమన్నము పెడతా ! ఈ మజ్జిగ పులుసు వేసుకో !" అని ఆ తల్లి తన్నడుగుతూ నవ్వింది. ఆ నవ్వు మరవడానికే సాధ్యం కాదేమో. తృప్తిగా తినమని నిర్బంధించింది. కాని — తాను తినకుండా వుంటేనో ! ఆ బాధ ఆమెను — కన్న తల్లిని వలె తపింప జేస్తుందా ? వండిన అన్నాన్ని అలాగే పెట్టుకొని దీప మార్పకుండా తనకోసం యెదురు తెన్నులు చూస్తుందా ! చూడదు. ఎందుకు ? తన్ను ప్రసవించడంలో పున్న తియ్యని బాధ ఆమె పడలేదు గనుక ! తన్ను కన్న తల్లి యెవరో ?"

లేదు ! ఎవరి కోసము ఎవరూ ఎదురు చూడ వలసిన అవసరం లేదు. సముద్రాల కావైపు యుద్ధరంగంలో తన శరీరం ముక్కలు — చెక్కలై పోయినా — యెవరికీ యే నష్టమూ రాదు. తనకలాంటి — ఆపత్తు సంభవింప రాదని — ప్రార్థించే — ఒక్క ప్రాణి ఈ ప్రపంచంలో — యెవ్వరూ లేరు . . . . . . . . . . .

మరుదినం సాయంకాలం — అమ్మతో — రామన్నాయరన్నాడు. "అమ్మా ! నేనొక్క మాట చెప్పనా ?"

"సందేహిస్తా వెందుకు ?"

"నేను — నేను ఒక నాయరు జాతి వాణ్ణి."

"ఈ విషయం నిన్ననే చెప్పావు."

"నాకు యిల్లూ లేదు. వూరూ లేదు. ఎవ్వరూ లేరు."

"ఈ విషయంకూడా నీవు — నిన్న సాయంకాలం భోంచేసేటప్పుడే చెప్పావు గదా ! "

"నాకెవ్వరూ లేరమ్మా !" వాడు — కన్నీటి పర్యంతమయ్యాడు.

ఆమె రిగాలు పడి నిలుచుకుంది.

ఆ నాటి మధ్యాహ్నం. ఆ యింట్లో ఒక చిన్న వివాహం జరిగింది. అలాగా— ఇరవై అయిదేండ్ల వయస్సులో ఒక కన్యకకు ఒక మొగుడు దొరికాడు.

మనోహరమైన ఒక సాయంకాలం — కోసి కుప్ప వేసిన వరి ధాన్యం — ఆ అస్త్ర మాన కాంతుల్లో కనక సుందర రంగా ప్రకాశిస్తూంది. ఏలికి తీగల నిశ్వాసం లాగా మంద మారుతం చిన్నగా వీస్తూంది. కాడి మెడకెత్తుకొని — యెద్దులను తోలు కొని వస్తూ పని పాటలతో — అలసిన సేద్యగాడు — రామన్నాయరును క్షేమ సమా చారాలడిగాడు.

"ఏమి? ఇక్కడ నిలుచున్నావు ?

"ఊరికేనే" రామన్నాయరు జవాబు చెప్పాడు.

వానికిప్పుడు బంధువులున్నారు.

"ఇంకెందుకు పోవడం ?"

ఈ మాటలు విని వాడు వెను దిరిగి చూచాడు. ఆవిడ వెనకాల నిలుచుని వుంది. ఆమె ముఖంలోకి రామన్నాయరు భావ సుందరంగా చూచాడు. ఆమె తల వంచుకుంది.

'నేను పోవాలి. నేను — నేను — ఋణానుబంధం వుంటే చూస్తాను. నీవిలా కన్యకగానే వుండు."

ఆమె కంఠం గాద్గద్యంతో కదలాడింది. "నే నలాగే వుంటాను. కాని రేపు.

. . . . . . . . . . . .

ఆమె అనుమతి సూచకంగా తల అడ్డం తిప్పింది రాత్రి పది గంటల సమయం. పూర్ణ చంద్రుడు ప్రపంచంపై — పాలొలుక బోస్తున్నాడు. పెట్టెను చేతిలో పట్టుకొని బయలు దేరబోతూన్న రామన్నాయరును 'నాణి' అలాగే చూస్తూ నిలబడింది. ప్రక్కనో పారుతూన్న కాలువ — తన జీవిత గానం చేసుకుంటూంది.

ఆ వూరికి — మిల్టరీ వాని 'ఫామిలీ' అలవెన్సు — వస్తూ వుండేది. నెలకు నలుబది రూపాయలు. ఆవిడ కొన్ని పాత్రలు కొన్నది. మూడు నాలుగు మంచాలు కొంచెం రెండు చెంబులూ కొన్నది. వానిపై తన పేరు చెక్కించుకుంది. ఆ యింటిలో యిప్పుడు ఒక క్రొత్త అందం ఒలికి పోతూంది. "నాణి" యింటి చుట్టూ మదురు గోడ పెట్టించింది. ఇంటి — ముందూ — వెనుకా అరటి చెట్లు నాటించుకుంది.

ఆ కన్యక నేడాయింటి యజమానురాలు. తన తల్లిగూడా నేడు తన మాటే వింటుంది. ఎప్పుడూ "నాణి" గుడికి పోయి — యేమిటో ప్రార్థిస్తుంది. ఆ ఇంట్లో యే పొద్దూ ఒక మనిషికి కావలసిన అన్నం మిగిలి వుంటుంది. రాత్రిళ్ళు యేదైనా అలికిడైతే ముసలావిడ 'ఎవరు వారు'? అంటుంది. దానిని విని 'నాణి' పక్కపై నుండి

ఉలికి పడి లేస్తుంది. 'మీ యింటాయన యెప్పుడు వస్తాడని' యెవరైనా అడిగి నప్పుడు మాత్రం వారికి చెప్పవలసిన సమాధానం 'నాణి' దగ్గర లేదు.

ఒక రోజు తపాలావాడు ఒక పెద్ద కవరు తెచ్చి ఆమె కిచ్చాడు. అందులో రాము న్నాయరు ఫోటో వుంది. అప్పటినుంచి ఆ యింటి గోడను ఆ పటమలంకరించింది.

మూడు నెలలు గడిచాయి. ఇప్పుడామెకు నెల **1** కి **100** రూపాయలు ఫామిలీ పెన్షను వస్తుంది. ఆరుమాసాలనంతరం అలవెన్సింకా పెరిగింది.

ఒక నాడు ఆ వూరి పోలీసు స్టేషను నుంచీ 'నాణి' కొక నోటీసు వచ్చింది. మూడు పెద్ద యినుప పెట్టెలు ఆమె పేరిట వచ్చాయని — వాటిని తీసుకొని పోవలసిందని ఆ నోటీసులోని విషయం. అవి సైన్యం పెద్దలో ఉద్యోగం చేస్తూన్న ఒక మనిషి గుడ్డలు. ఒక పెట్టెలో ఆవిడ — వివాహ కాలంలో వాని మెడలో వేసిన పూల దండ వుంది. అది — వాడి, యెండి, చెడిపోయింది.

"నాణి" నిష్కారణంగా వణికింది.

ఒక వారం గడిచాక — ఆమెకు పదివేల రూపాయల చెక్కొక్కటి వచ్చింది. అటు తరువాత ప్రతి నెలా వచ్చే మనియార్డరు నిలిచి పోయింది.

# జీవిత చక్రం

'కేశవదేవు'

[పురోగమన సాహిత్య నిర్మాతలలో "కేశవదేవ్" ఒకడు. కాని అతడు యే రాజకీయ పార్టీకి చెందిన మనిషి కాడు. విప్లవావేశము — తిరుగు బాటు, — ఈ రెండూ ఆయన సాహిత్యంలో పలుమారు కనపడే ప్రధాన గుణాలు. జీవితపు లోతులను తడవిచూచే ఒక చిత్రమైన శక్తి ఆయన సొత్తు. 'వోడయల్ నిన్ను' అనేది ఆయన ప్రధానమైన రచన. ఇంకా యెన్నో నాటకాలూ — కధలూ వ్రాశాడు. కొచ్చిలోని 'పరవూర్' ఆయన స్వస్థలం. స్థిర నివాసం 'కాయంకుళత్తు'లో.]

ఒకటవ రంగం

రాత్రి రెండవ యామం. తెల్లని మేఘాల వెనుక ప్రకాశిస్తూన్న పూర్ణ చంద్రుడు. శాంత సుందరమైన నిస్తబ్ధత. విశాలమైన మామిడి తోపు నడుమ తల యెత్తి నిలబడినట్లున్న ఒక పెద్ద మేడ. మేడ ముందు విశాలమైన వరండా. వరండాలో ఒక కిటికీ వెనుక రమణి నిలబడి వుంది — బయటికి చూస్తూ — ఒంటరిగా. ఆమె కన్నులలో ఒకసారి మాంద్యం, ఒకసారి ఉత్కంఠ, మారి మారి కనపడుతున్నాయి. పందిరి వలె గుబురుగా వున్న గున్న మామిడి వైపు ఒకసారి — ఆవలనున్న యింటి తల వాకిలి వైపు మరొక సారి — మరల గున్న మామిడి పొదు వైపు మరో సారి — ఆమె చూపులు అవిరామంగా సంచరిస్తున్నాయి. చల్లని గాలి — చల్లని చంద్ర కాంతులలో కలిసి — కిటికీ గుండా యింటి లోకి ప్రవేశిస్తూవుంది. తాటి గెల వలే స్నిగ్ధ నీలముగా వ్రేలాడుతున్న ఆమె తల ముడీ, భుజాల పైన ఉదాసీనంగా వేసుకొన్న చీర చెరగూ, ఆ గాలికి అటూ — యిటూ కదలుతున్నాయి. హట్టాత్తుగా ఆమె ముఖం వికసించింది. ఎన్నాళ్ళనుండో యెదురు చూచిన వస్తువేదో అప్పుడే యెదురైనట్లు అలభ్యమనుకొన్న వస్తువేదో అప్పుడే లభించినట్లు — ఆమె ఒడలు మరచి ముందుకు దూక బోయింది. కాని పాపం కిటికీ అడ్డు పడింది. కిటికీని మనసులోనే తిట్టుకుంటూ, ఆ యువతి వెను దిరిగి వాకిలి గుండా బయటికి వచ్చింది, సంతోషంతో పిచ్చెత్తినట్లు ముందుకు కదిలింది. ఆమె గున్న మామిడి చెట్టు క్రిందికి రావడమూ, రవి ఆలింగనంలో అణగి పోవడమూ — ఒక క్షణంలో జరిగి పోయినాయి. అంతలోనే ఆమెకు సిగ్గు ముంచుకొచ్చింది, కౌగిలి విడిపించుకొని దూరంగా నిలబడింది. ఆమెను మరల కౌగలించుకోవడానికి రవి ముందుకు కదిలాడు. ఆమె యేదో తెచ్చి పెట్టుకున్న గౌరవంతో, ప్రక్కగా నిలబడి "నన్ను తాకకండి" అన్నది.

రవి :— ఏమి కారణం ?

రమణి :— ప్రేమతో పుష్పించి పోయే స్త్రీ హృదయాన్ని అర్థం చేసుకునే నేర్పు పురుషునికి లేక పోవడమే కారణం.

రవి :— మంచి కారణమే ! ప్రేమతో పుష్పించినా — పుష్పించక పోయినా — అగాధమైన స్త్రీ హృదయపు లోతులు చూచిన పురుషుడింత వరకూ పుట్టనే లేదు. కాని అగాధమైన ఆ స్త్రీ హృదయపు అంచుల్లోకి తొంగి చూడడానికైనా — అనుమతింపదూ ?

రమణి :— చాల్లేండి ! ఇటువంటి మాటలు నాకూ వచ్చు.

రవి :— ఓహో ! మీకు రానిదేముందిలే. కాని ఆ అందమైన ముఖం నా కప్పగించి తరువాత యెంతసేపైనా మాట్లాడు.

రమణి :— ముఖం ఒక్కటే చాలునన్న మాట ! కనపడని వేదనతో బాధపడే హృదయాన్ని అర్థం చేసుకొనే ప్రయత్నమే లేదు కదూ ?

రవి :— బయటికి కనపడకుండా యెక్కడో దాచి పెట్టుకున్నావు — నీ హృదయాన్ని. ఆ అగాధంలో యేముందో నాకెట్లా తెలుస్తుంది ?

రమణి :— హృదయమున్న వాళ్ళకే — హృదయం తెలుసుకోవడం సాధ్యం.

రవి :— నిజమే ! నాకు హృదయం లేదనుకుంటాను. నా హృదయాన్ని ఒకామె బలవంతంగా దొంగిలించుకొని పోయింది.

రమణి :— దాంతో ఆమెకేమి లాభం ? ఆ హృదయంగల ఆసామి కోసం ఆమె యెంత కాలం వేచి వుండాలో ?

రవి :— బలవంతంగా యెత్తుక పోయిన ఆ దొంగను పట్టడానికి ఆ సొంతదారు డెన్ని గడపలు త్రొక్కాలో ? ఎన్ని మారేడి పొదలు వెతకాలో ?

రమణి :— ఆ దొంగను బంధించి తీసుకపొయ్యే అధికారం ఆ సొంతదారుని కుంది కదూ ! (రవి మెడకు చేతులు పెనవేసి అప్యాయంగా చూస్తూ) ఆ పూచిన పూల తీగె క్రిందికి పోదామా ?

(ఇద్దరూ పూల తీగె క్రిందికి పోయి నిలబడుతారు.)

రవి :— చక్కని — చిక్కని వెన్నెల !

రమణి :— చల్లని గాలి !

రవి :— అందరూ నిద్ర పోతున్నారు.

రమణి :— ఇద్దరు తప్ప.

రవి :— రమణి !

రమణి :— ఊఁ . . . . . . . . ( నిస్తబ్దత )

రవి :— రమణీ ! . . . . . .

రమణి :— ఊఁ ! ఏమిటి ?

రవి :— ఈ చంద్రుడూ — ఈ నక్షత్రాలూ — మన ప్రేమను అనుగ్రహిస్తున్నాయి.

రమణి :— ఈ చల్లని గాలి మన ప్రణయాగ్నిని ప్రజ్వలింప జేస్తుంది.

రవి :— అదిగో ! గూటిలో ఒదిగిన ఆపక్షి రెక్కసారించి మనకు విసరుతూంది.

రమణి :— నిద్ర బోయింది. మనుషులు లేచి మన యీ ప్రణయకలాపాన్ని చూస్తే ?

రవి :— వద్దు, వద్దు. మనుష్యులు అసూయు పరులు.

(నిస్తబ్దత)

రమణి :— అదిగో ! . . ఆ తెల్లని మేఘాలకావైపు ఒక నల్లని మేఘచ్ఛాయకనపడటం లేదూ ?

రమణి :— ఔను.

రవి :— ఆ మేఘం చాటున నుండి ఒక చిన్న నక్షత్రం మన యీ క్రీడను చూస్తూ వుంది. దానికికూడా అసూయ వుంటుందేమో ! అని నా అనుమానం !

రమణి :— దానికికూడా మనుష్యత్వముందేమో ?

(కోడి కూస్తుంది .)

అర్ధ రాత్రైంది

రవి :— ఇంకా అర్ధ రాత్రి మిగిలి వుంది.

రమణి :— ఇట్లే ఎప్పుడూ రాత్రిగా వుంటే !

రవి :— ఈ యౌవనం గతించి పోకుండా శాశ్వతంగా వుంటే ?

(నిస్తబ్దత)

రమణి :— రవీ ! మన యౌవనం గతించినా మన ప్రేమ నశిస్తుందా ?

రవి :— ప్రేమకు యౌవనం కారణమైతే — అది పోయినప్పుడు యిదీ పోతుంది.

రమణి :— కారణమిది కాకుంటేనో ?

రవి :— ఐతే — యేది కారణమంటావు ?

రమణి :— అదే నాకు తెలియడం లేదు. మన ప్రేమ నశించకూడదని నా కోరిక.

రవి :— ఐతే, మన యౌవనం నశించడం నీ కిష్టమేనన్న మాట ?

రమణి :— ఇప్పుడున్న దేదీ నశింపకూడదని నాఆశ. మన యౌవనమూ — మన ప్రేమా — యీ పూల తీగా — పూర్ణమ చంద్రుడూ — నక్షత్రాలు — ఆ మేఘం చాటున మన విలాసం గమనిస్తున్న ఆ చుక్కా — కూసిన ఆ కోడి — యీ గున్న మామిడీ — యివన్నీ శాశ్వతంగా వుండాలనే నా కోరిక.

రవి :— నీ వలెనే నేనూ ఆశిస్తున్నాను. మన మిద్దరమే గాదు. గడచిన కాలంలో ప్రేయసీ ప్రియులందరూ యిదే ఆశించారు. రాబోయేవారు యిదే ఆశిస్తారు. కాని యివన్నీ నశిస్తాయి.

(నిస్తబ్దత)

రవి :— రమణి

రమణి :— ఊ . . . . . . . .

రవి :— అదిగో — ఆ కనపడే గుట్ట క్రిందికి పోదామా అక్కడింకా బాగుంటుందీ.

రమణి :— పోదాం.

రవి :— అయితేలే మరి.

రమణి :— వద్దు ఈ ఆనందానికి అంతరాయం కలగడం నాకిష్టంలేదు. ఈ బంధం వదలరాదు.

(ఇద్దరూ కౌగిలించుకొని, అలాగే కొంతసేపుంటారు.)

రవి :— రమణి !

రమణి :— ఊఁ . . . . . . .

రవి :— ఒక పాట పాడుతావా !

రమణి :— ఇప్పుడా ? ఈ నిస్తబ్దతలోనా ?

రవి :— అవును. యీ నిస్తబ్దతలోనే నీ స్వరమాధుర్యాన్ని పూర్తిగా ఆస్వాదిస్తాను.

రమణి :— నాయన నిద్దుర లేస్తే ? . . . . . . . .

రవి :— మెల్లిగా పాడు.

రమణి :— అయితే నీవు తాళం వేస్తావన్న మాట !

రవి :— అవును.

(రమణి మెల్లిగా పాడుతుంది రవి మెల్లిగా తాళం వేస్తాడు. కొన్ని నిమిషాల తరువాత)

రవి :— రమణి ! నా హృదయం ఘూర్ణిల్లుతూంది.

రమణి :— నా మనస్సు ఆనందంతో పరవళ్ళు త్రొక్కుతూంది.

రెండవ రంగం

(5 సంవత్సరాలు గడిచాయి. ఒక అందమైన సాయంకాలం. రవి ఆ మేడ వసారాలో యీజీ చేరులో కూర్చొని, ఎదురుగా కనపడుతూన్న గుట్ట క్రింది భాగంవైపు ఏదో పరధ్యానంగా చూస్తూ చేరగిల పడుకున్నాడు. వత్స రవిబిడ్డ. ఏడుస్తూ వస్తుంది.)

వత్స :— నాయనా ! నన్ను . . . . . . . అమ్మ . . . . . బడిలోకి . . . .

రవి :— ఎవరది ? ఎవరు మా తల్లిని కొట్టింది ?

(వత్సను తీసుకొని కన్నీళ్ళు తుడుస్తాడు)

వత్స :— (మళ్లీ ఏడుస్తూ) అమ్మ కొట్టింది. ఇదిగో ! ఇక్కడ ! (లొడపై చూపుతుంది.)

రవి :— (తన యెదపై బాలిక తలనాన్చుకొని తిన్నగా నిమురుతూ) కానీ . . . . కానీ . . . . . యేడవకు . . . మీ అమ్మకు రెండు తన్నులు తగిలిద్దాం లే ! (వత్స చెంపలు ముద్దెట్టుకుంటాడు)

వత్స :— (యేడు పాపి) అమ్మ దొంగ గదూ !

రవి :— అవునవును. చీకటిలో తినిపించి అమ్మను వెలుతురులోకి తోసివేద్దాం. ఏం ?

వత్స :— కాదు కాదు. వెలుతురులో తినిపించి — చీకటిలోకి తోసివేస్తే చాలు.

రవి :— (నవ్వుతూ) అదే వెలుతురులో తినిపించి — చీకటిలో తోసివేద్దాం.

వత్స :— అమ్మను బయటికి నెట్టి వేస్తావా ?

రవి :— అలానే చేద్దాం.

వత్స :— వద్దు వద్దు. చెవిపట్టుకొని ఒక్కసారి పిండితే చాలు.

రవి :— అల్లాగేలే ! (ఒక టెంకాయ యీనెను చేతబట్టుకొని రమణి ప్రవేశిస్తుంది.)

రమణి :— యేదీ అది ! ఇంత వరకూ పడిన తన్నులు చాల్లేదేమో (వత్సవైపు కోపంగా నడుస్తుంది. ఆ బాలిక తండ్రిని గట్టిగా పట్టుకుంటుంది.)

రవి :— (అడ్డువచ్చి) ఛే ! ఛీ ! ఇక చాల్లే.

రమణి :— దాన్ని లాలించి — లాలించి చెడగొడ్తున్నారు, మీరు. ఈ వేళ రెండు గ్లాసులు పగల గొట్టింది. నిన్న మేజా పైన వున్న దీపాన్ని కదలించింది. — దాని చిమ్నీ కాస్తా పగిలి పోయింది. ఆ పేటులు పైన వున్న గడియారం నాశనమైంది. ఇల్లాగైతే కాపరం చేసినట్టే !

రవి :— దానికి తోచినవన్నీ, పగుల గొట్టనీ లే ! వేరే తెచ్చుకుందాం.

రమణి :— ఇలా మీరు దాన్ని వెన కేసుకొని రావడం నా కిష్టంలేదు.

రవి :— మనకిష్టమున్నా — లేకున్నా — ఎప్పటిలాగే దాని పని అది చేస్తుంది.

రమణి :— అయితే నా మాట అది వినడం మీకా కిష్టంలేదన్న మాట. ఇదేనా మీరు దానికినేర్పేది ?

రవి :— ఏమయినా సరే ! దాన్ని ఏడ్పింపడం నాకిష్టంలేదు. ఆచిట్టి మనస్సును కష్ట పెట్టడం నాకిష్టం లేదు.

రమణి :— మరి దాని చేష్టలు నాకుగిట్టకపోతే నో ?

రవి :— గిట్టడం — గిట్టక పోవడం మాటకాదు. పైగా . . . . . . . . దానితోనా మనసుసంతం ! !

రమణి :— అలా కాదు. ఒకవేళలయితేనో అంటున్నాను.

రవి :— అప్పుడు నా కాస్టింగ్ వోటు వత్సలకే పడుతుంది.

రమణి :— (చిన్నపోయి) ఒకనాడు ఆ వోటు నాకే పడుతూండేది.

రవి :— (నవ్వుతూ) ఇప్పుడు దాని కధికారి వత్సల అయ్యింది.

రమణి :— అయితే . . . నా కంటే — వత్సలంపై మీదే ప్రేమ అన్న మాట.

రవి :— నిజమే ! ఇప్పుడు — భార్యకంటే నాబిడ్డ మీదేనాకుప్రీతి యెక్కువ.

రమణి :— వత్స — మన ప్రేమ బంధానికి ఒక ఛాయ మాత్రమే అనే విషయం మీరు మరిచి పోతున్నారు.

రవి :— కాదు. కాదు. వత్స మనస్నేహానికి మూర్తీకరణం.

(వత్సను కౌగలించుకుంటాడు).

రమణి :— (దుఃఖమూ—కోపమూ నిండుకొన్న ముఖంతో) మీరు వంచిస్తున్నారు. మీ మాటలు నా కర్థం కాలేదని అనుకోకండి. ఎప్పుడైనా నేను వత్సను దండిస్తే మీరు దాని పక్షం వాదిస్తారు. దాన్ని నేను లాలిస్తే — మీరు దానిపై కోపగించుకుంటారు — దీని కర్థమేమిటి ? మీరు నా కెప్పుడూ యెదురు పక్షంలో వుండడమే పనిలా వుంది.

రవి :— (చిరునవ్వుతో) రమణి ! మాతాపితల భిన్నభావాల మధ్యనే పిల్లలు పెరుగుతారు. వారికి రక్ష అప్పుడే. తల్లిదండ్రులు యెప్పుడూ ఒక్కటే అభిప్రాయం కలిగివుంటే వారికి రక్షణ లేదు. ఇద్దరికీ ప్రేమ యెక్కువ అయినా బిడ్డలకు చెరుపే. లేక ఇద్దరూ దండించే వారయినా చెరుపే. ఇదిగో ! నీ కిష్టమైతే పత్రులను తీసుకుపో ! దండించుకో ! నా ఆక్షేపణ యేమీ లేదు.

రమణి :— వద్దు వద్దు ! నన్నెవరూ అనుసరించనూవద్దు. నేనెవ్వరినీ అనుసరించను (సుభావంగా ముందుకు సాగిపోతుంది.)

మూడవ రంగం

12 సంవత్సరాలు గడిచాయి. ఒక రాత్రి ప్రథమయామం. రవి పండుకొనే గది. రవి పడకపైన పడుకున్నాడు. రమణి సోఫాపై కాళ్ళు చేతులు ముడుచుకొని పడుకున్నది. గుండ్రని బల్లపై ఒక దీపం మినుకు మినుకు మంటూంది.

రవి :— రమణి !

రమణి :— ఊఁ ః . . .

రవి :— వర్మయేదీ ?

రమణి :— చదువుకుంటూందేమో ?

రవి :— చదువుతూనట్లు వినబడ్డం లేదే ?

రమణి :— లెక్కలు చేసుకుంటూందేమో !

రవి :— విజయు డెక్కడ ?

రమణి :— వాని కెప్పుడు బొమ్మలు గీసుకోవడమే పని.

రవి :— భాను పడుకున్నాడా ?

రమణి :— ఊఁ ః

(నిశ్శబ్దత)

రవి :— రమణి

రమణి :— ఊఁ ః . . .

రవి :— డాక్టరు దగ్గరికి పంపి మందు తెప్పించనా ?

రమణి :— మరచి పోయాను.

రవి :— నా పని యెప్పుడూ మరచి పోతూనే వుంటావు.

రమణి :— ఈ యింట్లో అన్ని పనులూ నేనొక్కదాన్నే చూడాలి. ఇలాంటప్పుడు ఒకటో — అరో పని మరచి పోవడంలో ఆశ్చర్యమేముంది ?

రవి :— ఆ మరవడం నా పనులలోనే తటస్థపడుతూంటుందే అని !

రమణి :— మీరూ అంతే గదూ ! నా పనులే మరుస్తూవుంటారు.

(నిశ్శబ్దత)

రమణి :— వత్స మెడలో ఉన్న చైను తెగిపోయింది.

రవి :— ఊఁ . . .

రమణి :— దాని కది వద్దుట. ఇంక కొంచెంబంగారంచేర్చి — వేరే రకంలో చేయిస్తే బాగుంటుంది.

రవి :— ఊఁ . . . .

రమణి :— దాని సంగీతం టీచరుకి జీతం ఇవ్వాలి. రేపటితో నెల దాటుతుంది.

రవి :— ఊఁ . . . . .

రమణి :— దానికొక కొత్త వీనె తెప్పించాలని అంటూ వుంది.

రవి :— సరే.

రమణి :— విజయుని మొలత్రాడు ఎక్కడో పోగొట్టుకున్నాడు.

రవి :— ఊఁ.

రమణి :— వానిని పిలిపించి అడగాలి.

రవి :— ఎందుకూ ! లడిగితే మాత్రం దొరుకుతుందా.

రమణి :— ఇప్పటికి వాడు రెండు పోగొట్టేడు. ఇక మీద వానికి మొలత్రాడే పెట్టకూడదు.

రవి :— సరే.

రమణి :— భానుకివ్వడానికి రేపటికి హార్లిక్స్ లేదు.

రవి :— అంగడికెవరినైనా పంపి తెప్పించు.

రమణి :— అంగడినుంచి బిల్లువచ్చింది.

రవి :— ఊఁ

(నిశ్శబ్దత)

రమణి :— ఆ వస్తువు తీసుకోనే మాటయేమైంది ?

రవి :— చేతులో డబ్బంతా అయిపోయింది. బ్యాంకులోనించి తీసికోవాలి.

రమణి :— బ్యాంకులో నించి తీసుకోవద్దండి. ఈ నెల జీతం ఖర్చుపెట్టి దాన్ని కొనండి. తక్కినది తరువాత యిచ్చుకుందాం.

రవి :— అల్లాగలే !

రమణి :— ఆ వస్తువు వత్సకోసం తీసికొంటే సరిపోతుంది.
రవి :— అదేమిటి ? విజయుడికీ — భానుకు వద్దా !
రమణి :— వాళ్లకి తరువాత కొందాంలెండి.

నిశ్శబ్దత

రమణి :— వత్సను — ఇక మీద స్కూలుకి పంపితే కష్టంవచ్చేటుంది.
రవి :— ఏమిటది ?
రమణి :— దాని పుస్తకంలో ఒకజాబువుండింది. చూశాను.
రవి :— పుస్తకంలో జాబుంటే స్కూలుకి పంపగూడదని వుందా !
రమణి :— అదొక ప్రేమ లేఖ అనుకుంటాను.
రవి :— నీ కెలా తెలిసింది. ?
రమణి :— చదివి చూచాను.
రవి :— అయితే మాత్రం దాని వల్ల కలిగే పెద్ద ప్రమాద మేమిటి ?
రమణి :— ఏమిటీ ? ప్రమాదం లేదా ! అయితే ప్రేమ లేఖలు రాసుకోవ డానికేనా దాన్ని స్కూలుకి పంపుతూంది ?
రవి :— స్కూలుకి పోక పోయినా — ప్రేమలేఖలు రాసుకోరాదని నియమం లేదు గదా !
రమణి :— మనం అదుపులో బెట్టుకుంటే మంచిది గదా !
రవి :— ఆ పిల్ల తల్లివి నువ్వుకూడా — ఇంటిలోనూ — స్కూల్లోనూ ప్రేమ లేఖలు రాసుకున్న దానివే గదూ !
రమణి :— నేను మరెవ్వరితోనూ ప్రేమ లేఖలు రాసుకోలేదు. అప్పుడు నేను ప్రేమ లేఖలు రాసుకున్నాతడే నాకు కాబోయే భర్త అని నేనెరుగుదును.
రవి :— వత్సకూడా అంతే. ఇప్పుడు ప్రేమలేఖలు వ్రాసుకుంటున్నవాడే తనకు కాబోయే మొగుడని దానికీ తెలిసి వుంటుంది.
రమణి :— వాడు — నా బిడ్డకు మొగుడెప్పుడూ కాలేడు.
రవి :— ఎందుకు ! వాడు మోసం చేస్తాడనా ?
రమణి :— కాదు. వాడి సంబంధం నాకిష్టంలేదు.
రవి :— ఎందుకు ?
రమణి :— వాడికి ఇల్లూలేదు. వాకిలీలేదు. దరిద్రుడు. కొంచెం చదువుంది అంతే.

రవి :— మీ తల్లి దండ్రులు గూడా నన్నిలాగే అన్నారు. ఆ విషయం జ్ఞాపకం వుందా ? కాని — యేమైంది. వారి మాట కాదని మనం పెళ్లి చేసుకున్నాంగదా !

రమణి :— చివరికి వాళ్ళు గూడా ఒప్పుకున్నారుగా !

రవి :— ఈ కథ అలాగే అవుతుంది. మనమూ కాస్త తెలివిగా మెలగాలి. ఇంతకూ ఆ పిల్లవాడెవడు ?

రమణి :— వాడే — ప్రభాకరుడు. వాడికంటే మంచి స్థితిగతులున్నవాడే నా బిడ్డకు వస్తాడు.

రవి :— నీకు కూడా నా కంటే మంచి స్థితిగతులుండే వాడే వచ్చివుండేవాడు — ప్రయత్నించి వుంటే.

రమణి :— నా స్థితిని గురించి నా కిప్పుడు అసంతృప్తి ఏమీ లేదు.

రవి :— వాళ్లకు మాత్రముంటుందని నీకెలా తెలుసు ?

రమణి :— వత్స యింకా చిన్నది. దానికి కర్తవ్యాకర్తవ్యాలు తెలియవు.

రవి :— భిన్న రుచులు గల జనులు యిల్లాగే పరస్పరం దోషాలు యెంచుకుంటూ వుంటారు. వత్సకు తెలియక పోవడం కాదు. భిన్న రుచి యొక్క మహాత్యమది.

రమణి :— ఏమైనా దీనికి నేనొప్పుకోను.

నిశ్శబ్దత

రవి :— రమణి !

రమణి :— ఊఁ !

రవి :— పాలింకా తేలేదూ.

రమణి —: నేనే తీసుకొని వస్తాను. లేచి వెళ్తుంది .

నాలుగవ రంగము

1 సంవత్సరం గడిచింది. ఒకటో రంగంలో చెప్పబడిన స్థలమూ — కాలమూ గూడా, తెల్లని వెన్నెల రవి ఆకిటికీ కమ్మీలు పట్టుకొని — నిలుచున్నాడు. ఆనాడు — గున్న మామిడిగా వున్న చెట్టు — నేడు పెద్దదై వృక్షమైంది. ప్రక్కన మరొక చిన్న మామిడి చెట్టూ లేచింది. రవి — ఆ రెండు గున్న మామిడి చెట్ల క్రిందికి చూస్తూన్నాడు. అతని ముఖంలో — వాత్సల్యం — కౌతుకం — దయా — మొదలైన భావాలు వికసించి — నవ్వు నర్తిస్తూంది. గదిలో చిరువెలుగు. రమణి సోఫాపై పడుకొని నిద్రిస్తూంది.

రవి :— (మెల్లగా) రమణి ! నిశ్శబ్దం రమణి !

రమణి :— (లేచి) ఏమిటండీ ?

రవి :— ఇలారా !

రమణి లేచి పోతుంది

రవి :— అదిగో ! ఆ గున్న మామిడి చెట్టు క్రింద చూడు.

రమణి :— పరిశోధించి చూచి ఎవ్వరో ఇద్దరక్కడ నిలుచున్నారు. అదిగో ! వారు పరస్పరంకౌగలించుకుంటూన్నారు.

రవి :— అదే ! వారు — కామినీ కాముకులు.

రమణి :— ఎవరో పాపం .

రవి :— ఎవరున్నారు ? వారిలో ఒకతె మన వత్స.

రమణి :— (అదరి పడి) ఎవరూ . . . . . . . . . . వత్సా . . . . వాడెవడు ?

రవి :— ప్రభాకరుడు !

రమణి :— (కోపంతో) అయితే యింతదాకా వచ్చిందన్నమాట. వాణ్ణి నేను . . . (నడచి వెళ్లటానికి చూస్తుంది)

రవి :— (నిలిపి) రమణి ! ఏమంత భత్స వేశం ధరించావు ? పరమానందాన్ని అనుభవిస్తున్న వాళ్లకు భంగంచెయ్యకు.

రమణి :— ఏమిటీ ? భంగం చెయ్యకుండా వుండాలా ! మీరుకూడా యీ అవమానాన్ని సహిస్తూన్నారన్న మాట. వాణ్ణినేను . . . . . . ''

ముందుకు దూకుతుంది

రవి :— ఆమెను బలవంతంగా నిలిపి రమణి ! ఆ స్వర్గానుభూతిని చూచి ఆనందించే సహృదయత్వం నీ కుంటుందేమోననే ఆశతో నిన్ను పిలిచాన. అది మనకవమానకరం గాదు. ప్రణయప్రచోదితములైన రెండు యువ హృదయాల స్వాభావిక చేష్టలవి.

రమణి :— నా బిడ్డను ఒక బిచ్చగాడు — ఆలింగనం చేసుకోడం చూసి వోర్చుకొనే హృదయ శూన్యత నాకు లేదు.

రవి :— వాడు బిచ్చగాడే కాని — యాచకుడే కాని — వాడు మన బిడ్డను ఆనందింప జేస్తాడు — ఆమె వాడికి సంతోషం కలిగిస్తుంది. వాళ్ళు పరస్పరం దేహాలు మరచి ఒక ఆత్మయ్యై — ఒక హృదయమ్మై నిర్వృతిలోలయించారు. ఆ స్థిలో నించి — వారిని దూరం చెయ్యడమే హృదయ శూన్యత. అన్నిటి కంటే గొప్ప పాపం . . . . . . . రమణి ! ఇప్పటికి పది — పదహారు సంవత్సరాలకు ముందు మాట.

ఆ గున్న మామిడికా వైపున నున్న పెద్ద మామిడి చెట్టు క్రింద మనం నిలుచున్నాం. అది ఆ నాడూ యిలాగే తెల్లని వెన్నెల, చల్లని గాలి. మనమూ అలాగే కౌగలించుకున్నాము. నీకు జ్ఞాపకం వుందా ? ఆ సమయంలో మీ తల్లిగాని — తండ్రిగాని మనల్ని చూచి బెదిరించి వుంటే ....... మనము నిరాశతో క్రుంగి పోయేవాళ్ళం. ఆ స్థితిని కొంచెం గమనించు. ఇలారా. మన ముద్దు బిడ్డ తన ప్రేమికునితోచేరి — ఆనందిస్తూన్న సన్నివేశాన్ని కన్నారా చూచి హృదయం చల్ల జేసుకో !

ఇద్దరూ కిటికీ కమ్మల నానుకొని నిలిచి ఆ దృశ్యం చూస్తూ వుంటారు. అలా కొంచెం సేపు గడచింది .

రమణి :— మీ రన్నది నిజమే ! ఇలాగే ఆ రోజున చల్లని వెన్నెల. సురభిశీతల మైన గాలి. ఆ రాత్రి నా కిప్పుడు జ్ఞాపకం వస్తూవుంది. (రవికి దగ్గరగా నిలుచుంది) ఆనందకరమైన ఆ దృశ్యాలన్నీ — నా రవితో చేరి మాటాడిన ఆ అనుభవాలు నిన్నటి కథలైనట్లుగా నాకు జ్ఞాపకం వస్తూన్నాయి. నాడు — మన హృదయాలు ప్రణయంతో నిండిన మధుపాత్రలు — యువహృదయాలు.

రవి :— రమణి ! ఈ యౌవనమూ — యీ ప్రణయమూ — శాశ్వతంగా వుంటాయా ? అని నన్నానాడు ప్రశ్నించావు. జ్ఞాపకం వుంది వుంది గదూ !

రమణి :— అవునవును. మీరు అన్నట్లే — ఆ యౌవనమూ ఆ ప్రణయమూ నశించాయి. నేడు మనకు వయస్సు చెల్లి పోయింది. మన నడుమ యిప్పుడు ప్రణయం లేదు. చిరకాల పరిచయం మాత్రం వుంది. మన భావాలలోని ఏకత — మనను పెన వేసుకుంది. ఆహా ! ఆనాటి యౌవనమూ — ఆ ప్రణయమూ యింకా వుంటే యెంత బాగుండేది ?

రవి :— రమణి ! ఆ గున్న మామిడి క్రింద నిలుచున్న ప్రేమికులు గూడ అలానే ఆశిస్తుంటారు. వారి భవిష్యత్సంతతి గూడ అలానే ఆశిస్తుంది. అలా ఆశించి — ఆశించి వర్ణించుకొని — వర్ణించుకొని — ప్రార్థించి — ప్రార్థించి — స్త్రీ పురుషులందరూ — యౌవనం నుండీ వార్ధక్యానికి, దానినుండి మరణానికి త్వరితంగా తరలి పోతూం టారు. మన యౌవనమూ — ప్రణయమూ. గతించినా లోకంలో

యౌవనమూ, ప్రణయమూ మాత్రం శాశ్వతమైనవి. వాని కంతం లేదు.

రమణి :— మీరు. ఒక రహస్య వాదులు లెండి.

రవి :— కాదు. నేను నూటికి నూరు పాళ్ళు వాస్తవికతా వాదిని, ఆనాటి మన యౌవనమూ — ప్రణయమూ నశించిపోయినయి. నత్యమే గదూ కాని అదో — చూడు ! ఆరెండూ — రూపాంతరాలతో — ఆ ! మామిడి చెట్టు క్రింద భాసిస్తూన్నాయి ! మన మా నాడు ప్రదర్శించు కొన్న ప్రణయోన్మాదమో — నే డక్కడ తిరిగి ప్రత్యక్షమవుతూంది. అప్పుడు మన ప్రణయాన్ని ఆశీర్వదించిన గున్న మామిడి నేడు ముసలి దయింది. కాని అందులో నుండి పుట్టిన మరి యొక్క గున్న మామిడి చెట్టే నేడు మన బిడ్డ యొక్క ప్రణయానుభూతిని ఆశీర్వదించి నీడనిస్తూ వుంది. మన యౌవనమూ — ప్రణయమూ నశిస్తాయి — వారి యౌవనమూ — ప్రణయమూ నశిస్తాయి. కాని వానిలో నుండి మరల నూతన యౌవన వుద్భవిస్తుంది. నూతన ప్రణయం తాండవిస్తూంది. ఇలాగే జీవితచక్రం పరివర్తిస్తూ వుంటుంది. సన్నగా పాట వినిపిస్తుంది.

రమణి :— మన వత్స సంతోషంగా పాడుతూ వుంది.

రవి :— అవునవును. ఆ నాడుగూడా నీ విలానే చిన్నగా పాడేవు.

( కోడి కూస్తుంది )

రమణి :—ఆ నాటి వలె కోడి కూసింది.

రవి :—ఇక మనం పడుకుందాము — వాళ్ళ ప్రపంచంలో వాళ్ళను వదలి వేద్దాం ! ! !

---

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| లోపలి ముఖ పత్రం వెనుక | 5 | Pogadanda | Pogada Danda |
| ,, | 9 | M. K. Soma-sundaram | M. P. Soma-sundaram |
| ,, | 12 | Tirumalai | Tirumala |
| ,, | 12 | Ramachandran | Ramachandra |
| పరిచయం | 18 | ముందావహం | ముదావహం |
| పరిచయం ii | 8 | జ్ఞానాశక్తి | జ్ఞానాసక్తి |
| తొలిపలుకు | 8 | కథల | కథలు |
| iv | 5 | గాడమగు | గాఢమగు |
| ,, | 6 | నిగూడముగా | నిగూఢముగా |
| 1 | 6 | కంట్టంతో | కంఠంతో |
| 2 | 4 | కల్లెర్రనైనవి | కళ్లెర్రనైనవి |
| 2 | 26 | అరణ్యం రోదన | అరణ్యరోదన |
| 4 | 8 | కంట్టంలో | కంఠంలో |
| 5 | 7 | స్వస | స్వస్థ |
| 6 | 12 | హయంలో | హయాంలో |
| 8 | 26 | ఏయింది | ఏమయింది |
| 9 | 3 | ఇంటకాడ | ఇంటికాడ |
| ,, | 17 | బతిమాలాడు | బతిమిలాడు |
| 13 | 2 | తహశీగాదారు | తహశీల్‌దారు |
| 14 | 1 | వూల్లో | వూళ్లో |
| 15 | 6 | గోచరించడం | గోచరించింది |
| ,, | 11 | కనింబన | కానించిన |
| 16 | 17 | జన్మలకి | జన్మకి |
| ,, | ,, | చూడ గలన్నన | చూడగలనన్న |
| 17 | 25 | నెత్తూ్తరు | నెత్తురు |
| 18 | 2 | ఏదో | ఏడో |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 18 | 16 | కొలిపోతే | కాలిపోతే |
| 21 | 5 | కళ్ళెర్రచేసి | కళ్ళెర్రచేసి |
| ,, | 6 | పాట్టాలు | పాత్రాలు |
| 22 | 10 | ఏళ్లే | ఏళ్ళే |
| ,, | 23 | ఏదో | ఏదీ |
| 23 | 25 | ఆదుర్దగా | ఆదుర్దాగా |
| 24 | 10 | కుని | పెట్టుకుని |
| ,, | 13 | "కొత్తనా ? | "కొత్తవా ? |
| 26 | 2 | నవ్వుతూ | నవ్వుతూ. |
| ,, | 3 | ఒల్లో | ఒళ్ళో |
| ,, | 4 | ఎందుకీ | ఎందుకో |
| ,, | 17 | ఊరిసికి | ఊరికి |
| ,, | 20 | ఆవుతాడనీ | అవుతాడనీ |
| ,, | 24 | ఉండగట్టి | ఉండబట్టి |
| ,, | 27 | మెల్లో | మెళ్ళో |
| 27 | 5 | ఊరికి | ఊరులో |
| ,, | 30 | కృషిస్తూనే | కృశిస్తూనే |
| 28 | 29 | మన్నంసాతా | మన్నంతా |
| 29 | 23 | కంటన్ని | కంఠాన్ని |
| 30 | 11 | రువ్విన హేళన చేసిన | రువ్వినా, హేళన చేసినా |
| 31 | 8 | ఆవలించింది. | ఆవరించింది. |
| ,, | 9 | ముచ్చటగా గొల్పుతాయి. | ముచ్చట గొల్పుతాయి. |
| ,, | 10 | కవుకులు. కన్నండలో | కవులు. కన్నడంలో |
| ,, | 10 | కవుల | కథల |
| 31 | 11 | కావునాటక | కావ్యనాటక |
| ,, | 15 | రీతులను | రీతులలోను |
| ,, | 19 | కాదాళిని | కాహాళిని |
| ,, | 22 | పాండిత్యతకు | పాండిత్యాలకు |
| ,, | 23 | కణ్య | కణ్వ |
| 32 | 3 | పైనీ | పైనే |
| ,, | 12 | నిమిశాలకు | నిముషాలకు |
| ,, | 15 | మని. | పని. |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 32 | 27 | ఇప్పటికి | అప్పటికి |
| 33 | 6 | ఆయన | అయిన |
| ,, | 17 | నిందారింది. | నిండారింది. |
| ,, | 19 | ప్రయాణంలో | ఏదినాళ్ల ప్రయాణంలో |
| ,, | 22 | శార్జ్ఞరవునికీ | శార్ఙ్గరవునికీ |
| ,, | 22 | శరద్వతునికీ | శారద్వతునికీ |
| ,, | 32 | సమీని ఞానికి, | సమఞానికి |
| 34 | 19 | లేదుదనీ | లేదనీ |
| 35 | 2 | పడుతున్న | పడుతున్నది |
| ,, | 33 | సొటు | పాటు |
| 36 | 3 | కందానం | కందళం |
| ,, | 3 | మోసుకెత్తింది. | మోసులెత్తింది. |
| ,, | 28 | మాధవ్యునికి | మాఢవ్యునికి |
| 37 | 5 | కారణం. | కారణం : |
| ,, | 19 | పిచ్చ పట్టి | పిచ్చాపాటి |
| ,, | 27 | (పంక్తి పూర్తిగా కొట్టి వేయాలి) | |
| 38 | 1 | మనస్సుకు చించు | మనస్సు కుంచించు |
| 39 | 26 | ఔసు మా. | ఔను మరి. |
| ,, | 30 | పెద్దదిదీ | పెద్దదీ |
| 40 | 1 | కంట్టం | కంఠం |
| ,, | 2 | ఆ ఎంతటి ఉద్వేశా | ఎంతటి ఉద్వేగా |
| ,, | 5 | అమ్మ రావురంటూ | అవురావురంటూ |
| ,, | 8 | ఇట్లు | ఇటు |
| ,, | 14 | స్నావఘటం | స్నానఘట్టం |
| ,, | 29 | చెపెప్పటానికి | చెప్పటానికి |
| 41 | 2 | వటుకును | వటువును |
| ,, | 32 | హట్టం | హఠం |
| 42 | 6 | కటిన | కఠిన |
| ,, | 25 | గురించి, | గుర్తించి, |
| ,, | 31 | చిన్నపోయింది | చిన్నపోయింది. |
| 43 | 3 | ఏన్నటి | ఎన్నిటి |
| ,, | 10 | అన్నది. తగ్గు తికతో. | అన్నది డగ్గు తి కతో. |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 43 | 22 | నవ్వే నవ్వు | నవ్వే నవ్వు. |
| 44 | 4 | దేహంతో. | ధేయంతో |
| ,, | 9 | వ్రాసినది | వ్రాసినది. |
| ,, | 13 | రమణియ్యు | రమణీయ |
| ,, | ,, | తాకెట్టు | తాకేట్టు |
| ,, | 21 | రాతులను | మూర్తులను |
| 45 | 1 | అశ స్వప్నం | ఆశా స్వప్నం |
| ,, | 17 | బారరల | బారల |
| ,, | 19 | నిమిశాల | నిముషాల |
| ,, | 31 | తమాశాగా | తమాషాగా |
| 46 | 31 | చెట్టు | బెట్టు |
| 47 | 13 | సోదరాతిధ్యం | సాదరాతిథ్యం, |
| 48 | 9 | —ఇవి | —ఇందులో |
| ,, | 12 | మళ్ల | మళ్లీ |
| ,, | 27 | వినలేని | ఎనలేని |
| 49 | 3 | వేల్దామనుకొని | వేద్దామనుకొని |
| ,, | 28 | గాణానికి | గానానికి |
| 50 | 3 | చేసి కూర్చునందున | చేసి కూర్చున్నందున |
| ,, | 4 | సద్దుకొని, | సద్దు కాని |
| 51 | 19 | మరడిచెట్టుకు | మరడిబెట్టుకు |
| ,, | 28 | జాచెన్నమ్మ | చెన్నమ్మ |
| 52 | 7 | మూర్ఖ్యనికి | మూర్ఖునికి |
| 53 | 16 | కీర్లే | కీళ్లే |
| ,, | 27 | మున్న | మూత్న |
| 54 | 6 | వధుమ" | వధువు" |
| ,, | 10 | చెనకినానని | రేపానని |
| ,, | 15 | వేనూ | నేనూ |
| 55 | 14 | కంట్టధ్వనిలో | కంఠధ్వనిలో |
| 56 | 13 | వదలతాము | వదులుతాము |
| 57 | 28 | వాళ్లూ | వాళ్లే |
| 58 | 13 | మాణం | మానం |
| ,, | 18 | కడా. | హీనం. |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 59 | 5 | మౌడ్యం ! | మౌఢ్యం ! |
| ,, | 17 | మాకు, | మారు |
| ,, | 33 | మనిషా, పాపిష్టి | మనస్సా పాపిష్ఠి |
| 60 | 8 | సాకాయేమొ ! | సోకాయేమో ! |
| ,, | 12 | దేవుడు అని | దేవుడ నని |
| 61 | 28 | పోరాడ | పొరాడ |
| 62 | 23 | పోరాడే | పొరాడే |
| ,, | ,, | హమకణం | హిమకణం |
| 63 | 7 | తీసుకొని | తోసుకొని |
| ,, | 8 | మాటే | మాటే! |
| ,, | 9 | సమీక్షంలో | సమక్షంలో |
| 64 | 13 | కళ్ళక్కు | తళుక్కు |
| 65 | 6 | తుల్లిపడుతూ | త్రుళ్లిపడుతూ |
| ,, | 10 | మెరగినట్లు | మెరసినట్లు |
| ,, | 15 | సఖిజనంతో | పక్షిజనంతో |
| ,, | 17 | కేళావిహారం | కేళీవిహారం |
| 66 | 19 | ముందిదిలి | ముఖం విదిలిం |
| 68 | 24 | ఉంటుందనా, | ఉంటుందనీ, |
| 71 | 17 | పిచ్చి మావయ్య | పిచ్చు మావయ్య |
| ,, | 29 | నాకు | నీకు |
| 72 | 21 | "ప్రసాద్" | "ప్రసాద్". |
| ,, | 25 | దాని | దానికి |
| 73 | 20 | ఆమెకూడ | ఆమెతోకూడా |
| 74 | 3 | మామ, | మామీ, |
| ,, | 6 | మామ- | మామీ- |
| ,, | 13 | బిల్ తోలుపెట్టె. | ఒక తోలుపెట్టె. |
| ,, | 21 | లోలంగా | లంగాలో |
| 75 | 23 | ఎన్ని | ఎన్నో |
| 76 | 11 | తమ్ముల్లుళ్ళు | తమ్ముళ్ళు |
| 77 | 1 | నాకు | నీకు |
| ,, | 10 | నాకెంత | నీకెంత |
| ,, | 28 | కరువుదెచ్చి | కరువుదెబ్బ |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 78 | 27 | పాతగా | తినగా |
| 82 | 16 | వంభారించు | పంబాళించు |
| ,, | 30 | ఒకటేవా? | దేశమేనా ? |
| 83 | 16 | చెప్పడానికి | బెట్టడానికి |
| 84 | 2 | మృధు | మృదు |
| 87 | 22 | బయటలో | బయట |
| 88 | 10 | అలాగ ఎవ్వో | ఎవ్వో |
| ,, | 33 | బాబా(కానికి | ఆత్రం తీర్చడానికి |
| 90 | 2 | తప్పినట్టయింది. | లేపినట్టయింది. |
| ,, | 19 | వట్టూ | వట్టు. |
| 91 | 20 | పాపాగా | పావగా |
| 92 | 1 | పద్ధతి | పాకం |
| ,, | 23 | వేళ | వేల |
| 94 | 9 | వాళ్లాకో? | వాళ్లకా? |
| 96 | 16 | నగరాలన్నీ | నగరాలను |
| 99 | 4 | హట్టాత్తుగా | హఠాత్తుగా |
| 101 | 31 | పెట్టంది | పెద్దది. |
| 102 | 10 | గాడ్డానుబంధం | గాఢానుబంధం |
| ,, | 29 | యిట్లా | యిల్లూ |
| 103 | 6 | సుందరరంగా | సుందరంగా |
| ,, | 18 | కంట్టం | కంఠం |
| 104 | 9 | సైన్యం పెద్దలో | సైన్యంలో పెద్ద |
| 105 | 12 | ఉత్కంట్ట, | ఉత్కంఠ |
| ,, | 18 | హట్టాత్తుగా | హఠాత్తుగా |
| 107 | 1 | (నిస్తబ్దత) | (నిస్తబ్ధత) |
| 110 | 19 | వత్సలపై | వత్సల |
| 111 | 5 | వాళయినా | వాళ్లయినా |
| ,, | 17 | చదువుతూనట్లు | చదువుతూన్నట్లు |
| 112 | 11 | వీనె | వీణ |
| 113 | 7 | వుండింది. | వుంది. |
| 114 | 5 | ఈ కథ | ఈ కథా |
| ,, | 16 | మహాత్యమది. | మహత్త్వమది. |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 114 | 31 | నిశ్శబ్దం | (నిశ్శబ్దం) |
| 115 | 14 | భత్సవేశం | బీభత్సవేషం |
| ,, | 20 | పిలిచాన. | పిలిచాను. |
| 117 | 2 | మీరు. | మీరు |
| ,, | ,, | ఒక రహస్య | రహస్య |
| ,, | 8 | పరిణయోన్మాదమో | ప్రణయోన్మాదమే |
| ,, | 14 | యౌవన | యౌవనం |
| ,, | 17 | పాడుతూ వుంది. | పాడుతూంది. |

—:oOo:—